




ముఖచిత్రం బంతి కాశీరత్నాలు

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ 18-00

దీపావళి సంచికతో రూ 23-00

యువ వడపళని మదరాసు-26



నవంబరు సంచిక ముఖచిత్రం 'రాగ దీపిక' చాలా బాగుంది. ధనికొండవారి నవల ఆద్యంతమూ రసవత్తరంగా వుండి మమ్మల్ని ఆనందింపజేసింది. పరిమళా సోమేశ్వర్‌గారి నవల ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది. కథల్లో 'వర్షించని మేఘం' నాకు బాగా నచ్చింది.

—ద్వివేదుల నారాయణశాస్త్రి.
శ్రీకాకుళం.

నా అభిమాన రచయిత గోపీచంద్‌గారి కథ ''సంపెంగ పువ్వు'' చదివే అవకాశం కల్గించినందుకు చాలా థాంక్స్.

ప్రతి నెలా ఓ చిన్న నవల వేస్తున్నందుకు చాలా కృతజ్ఞతలు. ఈ నెల నవల 'గుడ్డివాడు' చాలా బాగుంది.

—కొల్లూరు గౌరిలక్ష్మి. పార్వతీపురం.

ఈ నెల మీరు ప్రచురించిన అయిదు కథలూ చదివేను. సుపర్బ్! గోపీచంద్ గారి కథ చాలా బాగున్నది. వారి కథలు మీరు ప్రతినెలా ప్రచురించడం మాకు చాలా ఆనందదాయకంగా వుంది. పరిమళా సోమేశ్వర్‌గారి నవల్లోని మెహర్ నా మనస్సు కలచివేసింది. మెహర్ అంటే నాకు చాలా జాలేస్తోంది.

—జహీదా బేగం, మద్రాస్-21.




# కిడ్డీ కిడ్డీ బ్యాంక్ బ్యాంక్!

మి పిల్లలు, డబ్బును ఆదాచెయడం అంటె, ఒక ఆటలాగ ఇష్టపడతారు. వారికోసమే ఆంధ్ర బ్యాంకువారు ఒక ఆకర్షణీయమైన స్కీమును మొదలుపెట్టారు — అది కిడ్డీ బ్యాంక్. తమ స్వంత కిడ్డీ బ్యాంకులో మీ పిల్లలు రోజూ డబ్బు దాచుకొని, 4% వడ్డీని కూడ పొందుతారు.

ఈ మంచి అలవాటుకై మీ పిల్లలను ప్రోత్సహించండి.

ఈ రోజే వారికి ఒక కిడ్డీ బ్యాంక్‌నివ్వండి!




## ఏ ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

సెంట్రల్ ఆఫీసు: సుల్తాన్ బజార్, హైదరాబాదు

కె. గోపాలరావు, చైర్మన్ యం. వి. సుబ్బారావు, జనరల్ మేనేజర్

జాతీయ సేవలో వున్న జాతీయం చేయబడని బ్యాంకు

FDSAB-1648 TI

ప్రతినెలా 20-వ తేదీకి ముందుగా వచ్చే యువకొరకు ఎదురుచూచి నెలా ఆతుస అందుకున్నాము. కొత్త తర హాగా వున్న గుడ్డివాడు నవల మమ్మ ల్నాకర్షించింది. గోపీచంద్, కొ. కు. రావుగారి కథలు ప్రతినెల యువకు వడ్డాది పాపయ్యగారి ముఖచిత్రంతోపాటు హైలెట్‌లే. ఇందిరాదేవిగారి వర్షించని మేఘం బాగుంది. తప్పటడుగు నవల ముందు ముందు యెలా వుంటుందో ఊహించలేకుండా వున్నాము.

—సుధా, రాజా, శీను వేటపాలెం.

నవంబర్ నెల 'యువ' లోవి వర్ణ చిత్రాలు 'రత్నదీపిక', 'నర్తనదీపిక' చాలా ఆకర్షణీయంగ వున్నవి. ఈసారి కార్టూన్లలో నూతనత్వం వుంది. చాల 'ఏట్టీ'గ వున్నవి. 'సుందరహర్మ్యం' కథ వాస్తవికంగ వున్నది. 'వర్షించని మేఘం'. 'మరుగుపడ్డ మంచితనం' కథలు బాగున్నాయి. 'తప్పటడుగు' సీరి యల్‌లో క్రొత్తదనం వుంది ఇంట రెస్టింగ్‌గా వుంటున్నది

—కుమారి దారా లక్ష్మీకామాక్షి.
దారా సోమరాజు, సాలూరు.

ఫిలిం పరిశ్రమ
సేవకు
చిహ్నము




వెస్ట్రన్
విజయ స్టూడియోస్
వాహిని స్టూడియోస్
మదరాసు

# ట్విన్ సిటీ గ్యాస్ కం.

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి సర్దార్ పటేల్ రోడ్ సికింద్రాబాదు-3 ఫోన్ 76600




బ్రాంచీలు :

షో రూమ్ :

86. సరోజినీ దేవి రోడ

తాజ్‌మహల్ హొటల్ ఎదురుగా

సికింద్రాబాదు

| | |
|---|---|
| 4-1-881/7, తిలక్ రోడ్ | ఫోన్ 42586 |
| 15-9-311, అఫ్జల్‌గంజ్ | ఫోన్ 42629 |
| 16-6-68, చాదర్‌ఘాట్ | ఫోన్ 52400 |
| ఆంధ్ర బ్యాంక్ ఎదురుగా, విద్యానగర్ | ఫోన్ 35419 |
| సత్యా టాకీస్ వద్ద, ఆల్వాల్ | ఫోన్ 79009 |
| గోల్డు స్పాట్ వద్ద అమీర్ పేట | ఫోన్ 32901 |
| భారత్ హెవీఎలెక్ట్రికల్స్ రామచంద్రపురం | |

**RUNNING TO PACKED HOUSES**
**AT**
**NAVRANG CINEMA**
(AIR—COOLED)
**HYDERABAD**



RUPAM CHITRA'S

# GUDDI

(COLOUR)

*Starring*

DHARMENDRA, JAYA BHADURI, SAMIT,
SUMITA SANYAL & UTPAL DUTT Etc.,

*Directed by*:
HRISHIKESH MUKHERJEE

*Music:*
VASANT DESAI

*Story & Dialogues*
GULZAR

*Produced by*:
N. C. SIPPY & HRISHIKESH MUKHERJEE

*Distributors for Nizam*:

B. MARIDESWARA RAO & Co.,
1141-3, Rashtrapathi Road,
SECUNDERABAD (A. P.)

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 24 డిశంబరు—1971 సంచిక 12


ఆంధ్ర దేశంలోని అన్ని కాలేజీలలోను చదువుతున్న విద్యార్థులందరూ, సమ్మె ప్రారంభించి విరమించారు. ఈ సమ్మెకు కారణం, ఇంగ్లీషులో విద్యాబోధన జరగాలనే కోరిక. ఇది సబబైన అభ్యర్థనే.

ఇంగ్లీషును, భాషగామాత్రమే బోధిస్తూ, తక్కిన అన్ని సబ్జక్టులనూ తెలుగులోనే బోధించడానికి, ప్రభుత్వమూ, యూనివర్సిటీలు నిర్ణయించి, ఆ నిర్ణయాన్ని అమలు జరపడం ప్రారంభించాయి. ఈ విధానంవల్ల, తమ భవిష్యత్తు దెబ్బ తింటుందని విద్యార్థులు, యీ విధానం మార్చవలసిందని ఆందోళన చేస్తున్నారు. యువకుల భవిష్యత్తునూ, దేశీయ పురోగమనానికి గల అవసరాలనూ దృష్టిలో పెట్టుకొని, తదనుగుణమైన విద్యావిధానాన్ని రూపొందించడం ఇంతవరకు జరుగలేదు.

ఈనాడు యువకులు యూనివర్సిటీ చదువుకోసం ప్రాకులాడడానికి, ముఖ్యకారణం ఉద్యోగాలు సంపాదించడానికే. ఆ ఉద్యోగాలుకూడా, గవర్నమెంటు ఉద్యోగాలే. అయితే, యీ గవర్నమెంటు ఉద్యోగాలకు ఎవరైనా, అంటే చరిత్ర, భూగోళశాస్త్రం, ఫిజిక్సు, కెమిస్ట్రీ, బోటనీలలాంటి సైన్సు సబ్జక్టులు చదివినవారుకూడా ప్రయత్నం చెయ్యడానికి అవకాశం ఉన్నంతవరకూ, ప్రతి యువకుడూ ఏ సబ్జక్టులో

సీటు దొరికితే అది చదివి. ఎలాగో ఒకలాగ డిగ్రీ సంపాదించుకొని, ఉద్యోగానికి ప్రయత్నం చేస్తున్నాడు. తను చదివే సబ్జక్టుపట్ల అతడికి అభిరుచి లేకపోయినా, ఎలాగైనా డిగ్రీ సంపాదించుకోవడమే లక్ష్యంగా పెట్టుకుంటున్నాడు. ఏమంటే, ఏ సబ్జక్టు చదివినా, ప్రభుత్వ ఉద్యోగానికి ఆ సబ్జక్టు ఎంతమాత్రమూ అవసరం లేకపోవడమే. దానికి కారణం.

ప్రభుత్వ ఉద్యోగాలకు ప్రయత్నం చెయ్యడానికి యువకులకు ఉండవలసిన అర్హతలను స్పష్టంగా నిర్ణయిస్తూ, ఒక విధానం అంటూ ఏర్పడితే, ప్రత్యేకమైన సైన్సు సబ్జక్టులను చదవడానికి ముందుకువచ్చే యువకుల సంఖ్య చాలావరకు తగ్గిపోతుంది. అప్పుడు, సైన్సు సబ్జక్టులను చదవడానికి, వాటిపట్ల అభిరుచి వున్నవారే ముందుకు వస్తారు. అనవసరంగా, వేలసంఖ్యలో సైన్సు సబ్జక్టులను చదువుతున్నవారి సంఖ్య బాగ తగ్గిపోవడమూ, అభిరుచితో ఆ సబ్జక్టులను చదివి, శాస్త్ర పరిశోధన చేసేవారు కొంతమంది తయారవడమూ జరుగుతుంది.

ఈనాడు మనదేశాన్ని పీడిస్తున్న ముఖ్య సమస్యలలో, నిరుద్యోగ సమస్య ఒకటి. డిగ్రీలు సంపాదించుకొని, ఉద్యోగాలు దొరకక హతాశులై ఎంతోమంది యువకులు నేడు దేశంలో తిరుగుతున్నారు. సంపాదించుకున్న డిగ్రీలు నిరుపయోగమై పోవడమే కాక, నాలుగేళ్ళ చదువూ, దానికి అయిన ఖర్చూ వృథా అయిపోయినందువల్ల, వారు జీవితంలో మరే వృత్తినైనా అవలంబించడానికికూడా ఉత్సాహం లేకుండా బాధపడుతున్నారు.

ప్రభుత్వ ఉద్యోగాలను నిర్వహించడానికి కావలసినవి, చక్కని భాష, ప్రపంచ జ్ఞానము ముఖ్యము. వీటితోపాటు, ఆర్థికశాస్త్రము ఒకటి అవసరమౌతుంది. ఈ విషయాలను మాతృభాషలో బోధించవచ్చును. కాని, పరిపాలనా కలాపమంతా మాతృభాషలోనే జరిగేటట్లయితేనే, యీ విద్య చాలుతుంది. కాని, 14 మాతృభాషలు ఉన్న మనదేశంలో, తన మాతృభాషను మాత్రమే బాగా చదువుకున్న విద్యార్థి, దేశంలో ఏ ప్రాంతానికైనా వెళ్లి ప్రభుత్వ ఉద్యోగాన్ని నిర్వహించజాలడు. దేశమంతటా వ్యవహరింపబడే. ప్రభుత్వభాష అంటూ ఒకటి నేడు ఇంగ్లీషు మాత్రమే. అంచేత, ప్రతి విద్యార్థి ఇంగ్లీషు చదువుకొని తీరాలి. లేకపోతే, తాలూకా ఆఫీసులో గుమాస్తాగా చేరినవాడు యావజ్జీవమూ అదే ఉద్యోగంలో ఉండవలసి వస్తుంది. అంచేత, ఇంగ్లీషు భాషను కాలేజీలలో బోధించడం మానకూడదు.

ఇక, సైన్సు సబ్జక్టులను చదివేవారి మాట. ఈ విద్యార్థులకు ఇంగ్లీషును భాషగా

బోధించడం మాత్రమే కాక, వారు చదివే సబ్జక్టులనుకూడా ఇంగ్లీషు భాషలోనే బోధించాలి. లేకపోయినట్లయితే, ప్రపంచంలో ఇతర దేశాలలో జరుగుతున్న పరిశోధనలను గురించీ, ఆ పరిశోధనల ఫలితాలను గురించీ క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడం, ఆ విద్యార్థికి కష్టం అవుతుంది. అలాటివాడు, ఆధునిక విజ్ఞానాన్ని పొందలేక పోవడమే కాక, తాను స్వయంగా పరిశోధనలను చెయ్యడానికి కావలసిన ప్రాతిపదికను పొందలేకపోవడమే కాక, తన పరిశోధనల ఫలితాలను ఇతరదేశాల శాస్త్రజ్ఞులకు తెలియపరచలేడుకూడా. అందువల్ల, సైన్సు సబ్జక్టులను మాతృభాషలో చదివినవాడూ, సైన్సు సబ్జక్టులను అసలు చదవనివాడూ, ఒకటే అవుతారు. అలాటి యువకులు దేశానికీ పనికిరారు; తమకు తామూ పనికిరారు.

అంచేత, మన విద్యావిధానాన్ని వెంటనే సంస్కరించవలసి వుంది. కేవలం ప్రభుత్వ ఉద్యోగాలకోసం చదివేవారికీ, వృత్తివిద్యలను నేర్చుకొనేవారికీ, సైన్సు సబ్జక్టులలో ఉత్తీర్ణత పొందదలచినవారికీ, వేరువేరు విధంగా విద్యాబోధన చెయ్యడం జరగాలి. ఏ విధమైన విద్యను నేర్చుకొనేవారికయినా, ఇంగ్లీషు భాషాబోధన వుండితీరాలి. ఆధునిక పరిస్థితులలో, ఇంగ్లీషు చదువని భారతీయుడు, కూపస్థమండూకం అవుతాడు. ప్రపంచ పరిస్థితులనూ, సంస్కృతినీ, విజ్ఞానాన్నీ అవగాహన చేసుకొని ప్రతి యువకుడూ దేశ పురోగమనానికి ఒక ఆటంకమే.

ఇంగ్లీషు భాషనూ, సబ్జక్టులను ఇంగ్లీషులో బోధించడాన్నీ విరమించకూడదని ఆందోళన చేస్తున్న విద్యార్థులు, ఆ భాషను చక్కగా, శ్రద్ధగా నేర్చుకోవడం అవసరం. ఈనాడు, కొంతమంది ఎం.ఏ. లు కూడా పట్టుమని పదివాక్యాలు తప్పులు లేకుండా ఇంగ్లీషులో వ్రాయలేకపోతున్నారు. ఆ విధంగా ఇంగ్లీషును నేర్చుకున్నా ఒకటే, నేర్చుకోకపోయినా ఒకటే.

శ్రద్ధతో చదువుకుంటామనే విద్యార్థులకు, వారు కోరిన ప్రకారం ఇంగ్లీషులోనే అన్ని సబ్జక్టులనూ చదువుకోవడానికి అవకాశం వుండాలి. ఆ అవకాశాన్ని ప్రభుత్వం తొలగించరాదు.




దేశద్రోహులు వర్ధిల్లాలి!
చిలక నాదేనండీ గాని ఆమాటలు మటుకు నేను నేర్పించినవి కావండీ!


మన పెళ్ళికి అప్పుడే ఏం తొందర సోంబాబూ! ఇంకొన్ని ఏళ్ళు ఆగ్గూడదా?
చంద్ర

# మేధావి

ఎం. యస్. మూర్తి



"శేషయ్యా!"

"ప్రభూ! ఇక్కడే వున్నా—"

"నిన్న మన పట్టాభిషేక సమయంలో నన్ను ప్రజలకు పరిచయం చేస్తూ ఏదో అన్నావోయ్—!"

"ఏమన్నాను ప్రభూ?"

"జ్ఞాపకం చాలదోయ్—"

"ఏ సందర్భంలోనో కొంచెం తమరు తెలివిస్తే...."

"నా సుగుణాలను ఏకరుపెడుతూ నే నేదో పెద్ద వాణ్ణన్నావు—"

"ఓహోహో! అదాండీ? తమరు, గొప్ప మేధావులన్నా—"

"మేధావినా—అంటే?"

"గొప్ప మేధగలవారని—"

"మేధంటే—"

"మెదడండి—జ్ఞానేంద్రియం—"

"ఎక్కడుంటుందా పదార్థం?"

"తమ తలకాయలోనండి—బత్తాయి కాయంత వుంటుంది—"

"అది నా వొక్కడికే వుంటుందా?"

"లేదండి—అందరికీ వుంటుంది."

"అయితే నా గొప్పేమిటీ?"

"మీ గొప్ప మీ మేధే! అందరికీ ఉసిరికాయంత ఉంటే, మీది—"

"సైజు పెద్దదంటావా నాది?"

"సైజే కాదండి — అంతస్తు కూడాను—"

"అంటే?"

"తమ తలకాయలో వున్న ఈ మేధా యంత్రం సామాన్యులందరికీ వుండే టటువంటిది కాదు — ప్రభువులకిమట్టుకే అటువంటిది—అంత పెద్దది వుంటుంది—"

"బాగా విశాలంగా చెబుతావా?"

"చిత్తం! తమ రాజ్యంలో ఎవరికీ కూడా తమకు వుండేటంత గొప్ప—మేధ లేదు—"

"అలాగనా! అయితే ఇది యెందుకు పనికి వస్తుందంటావు?"

"బుద్ధి వికాసాదులను ఇచ్చేది అదే నండి—తమ చేతులు కత్తిపట్టుకుని యుద్ధం చేస్తాయి, కాళ్లు నడస్తాయి, కళ్లు చూస్తాయి—ఇలాగే ఏ అవయవం అది చేయవలసిన పనిని చేస్తుంది—వీటన్నిటి చేతా ఆ పనులను చేయించేది మెదడు— ఇది చిన్నదైతే—చిన్నచిన్న పనులనే




చేయిస్తుంది—పెద్దదైతే—తమకు వుండే లాంటిదైతే బ్రహ్మాండమైన పనులను చేయిస్తుంది—"

"ఎలాగ కాస్త విడమరిచి చెప్పు—?"

"నా మెదడు చిన్నది—గనక, నేను మంత్రిగానే వున్నాను. తమరిది పెద్దది—మీరు ప్రభువులై పాలిస్తున్నారు—"

"అర్థమైంది—"

"ధన్యోస్మి"

"అయితే, ఇది నాకు చాలా విలువైందన్నమాట?"

"మీ రాజరికం దానిమీదే ఆధారపడి వుంది—"

"అంటే, ఆది నాకూ, నా రాజరికానికీ చాలా ముఖ్యమయిందన్నమాట?"

"చిత్తం!"

"అయితే నేను, దాన్నిగురించి చాలా జాగ్రత్త తీసుకోవాలి కదూ?"

"దేన్ని గురించండీ?"

"ఈ మెదడును గురించి—?"

"అవునండి! దాన్ని ఏ మాత్రం అలసట చెందనీకండా, జాగ్రత్తగా కాపాడుకోవాలి—"

"మన ఖజానాలో డబ్బుకు మల్లే కదూ?"

"ఒకవిధంగా చూస్తే—అంతేనండి!"

"అయితే దాన్నితీసి పదిలంగా ఖజానాలో దాచమని చెప్పు!"





ముద్దంశెట్టి హనుమంతరావు

కరుణాకరం మొహం, హఠాత్తుగా పాలిపోయింది, కాగడాపెట్టి వెదికినా, ఉత్సాహం యెక్కడా కనిపించడం లేదు. కళ్ళల్లో, సన్నని నీటిపొర మిలమిల మెరుస్తోంది. ఏడుపొచ్చినంత పని అవుతూన్నా, యేడవగలిగే శక్తి లేనట్టుగా, నీరసపడిపోయాడు. అతని కళ్ళు, మేనేజరు ముకుందరావుకేసి, దీనంగా, జాలిగా చూస్తున్నయ్.

ముకుందరావు, కరుణాకరం బాధను అర్థం చేసుకున్నాడు. బరువుగా ఓ
వదిలాడు.

"ఏం చెయ్యను కరుణాకరం! సాధ్యమైనంత మేరకు నా శాయశక్తులా ప్ర
త్నించి చూశాను. కాని, ఫలితం లేకపోయింది. బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లో ప్రతి
ఒక్కరూ వారివారి స్వార్థాల్ని పెంచుకుంటూ, వారి ఆశ్రితుల్ని తెచ్చి ఆఫీసులో
నింపుతున్నారు. వారికి, ఆఫీసు బాగోగులతో ప్రమేయం లేదు. ఆశ్రితులంటే, యీ
సందర్భంలో అర్థమేమిటో తెలుసా? డబ్బు గుమ్మరించిన వాళ్ళన్నమాట. దేశంలో
యెక్కడ చూసినా యీ లంచగొండితనం విలయతాండవం చేస్తున్న విషయం,
అందరికీ తెలిసిందే! నాకూ పరిచయమున్న డైరెక్టరొకడున్నాడు. అయితే వట్టి
పరిచయాలతో పనులు జరగడం యీ రోజుల్లో సాధ్యం కాదన్న సంగతి నీకు
మాత్రం తెలీదూ? నువ్వీ ఉద్యోగంలో స్థిరపడాలంటే, ఓ వెయ్యిరూపాయలైనా
అతనికి సమర్పించుకోవాలి. అప్పుడే నువ్వు అతని ఆశ్రితుల జాబితాలోకి వస్తావు.
అర్థమయ్యింది కదూ? బాగా ఆలోచించుకో! ఇంతకు మించి, వేరే సహాయం నేనేమీ
చెయ్యలేను" అన్నాడు.

కరుణాకరంలో నిరుత్సాహపు డిగ్రీ అధికం కాగా, నిర్విణ్ణుడై చూస్తూ వుండి
పోయాడు. "వెయ్యిరూపాయలు!" తల్చుకుంటేనే అతనికి భయం వేసింది. ఇంత
మొత్తం ఒక్కసారి యెక్కణ్ణించి తీసుకురాగలడు? తీసుకురాకపోతే, వున్న ఉద్యో
గానికి తిలోదకాలిచ్చుకోవాలి. ఈ కాస్త ఉద్యోగం పోతే, నిరాధారంగా జీవితంతో
పోరాడవల్సిందే! ఈ సంగతి వింటే, తల్లి యెంతగా కృంగిపోతుందో, ఊహించుకో
లేకపోయాడు. ఆలోచిస్తున్నకొద్దీ అతని మెదడు వేడెక్కిపోతోంది. ఏం చెయ్యడం?
బ్రతుకును స్థిరపర్చుకోవాలంటే, వెయ్యిరూపాయలు సంపాదించాలి. అయితే, యెలా
సంపాదించడం? అదే పెద్ద సమస్య!

"ఇదంతా, నా దురదృష్టం సార్! మరోమార్గం లేదంటారా?" అతని గొంతు
పేలవమయ్యింది.

ముకుందరావు మెల్లగా నిశ్వాసం వొదిలాడు.

"లేదు కరుణాకరం! మరో మార్గం లేదు. నీకు సహాయం చెయ్యడానికి, నేను
సర్వదా సంసిద్ధుణ్నే కాని, నేను అసహాయుణ్ణి. ప్రస్తుతం మనదేశంలో పాతుకు
పోయిన లంచగొండితనం, అన్యాయం, ఆశ్రితజన పక్షపాతం, మొదలైన అన
ర్థాల్ని కూకటివేళ్ళతో పెకళించడం, యెవరి తరం? అందుకే, వాటికి దాసోహమనాలి.
తప్పదు. నువ్వు వెయ్యిరూపాయలు తేగలిగితేనే, ఖచ్చితమైన అవకాశం. నిశ్చింతగా

యుప

వుండొచ్చు'' అన్నాడు.

''సరే! వస్తాను సార్. మా అమ్మతో సంప్రదించి యే విషయమూ మీతో మనవి చేసుకుంటాను. ఉన్నపాటున వెయ్యిరూపాయిలు సంపాదించడమంటే, యెంత కష్టమో, మీకు తెలీందికాదు. అయినా, ప్రయత్నించి చూస్తాను. దీనిమీదే నా భవిష్య త్తంతా ఆధారపడి వుంది.'' దిగులుగా అనేసి, నిట్టూర్చుకుంటూ ముందుకు సాగి పోయాడు కరుణాకరం.

ముకుందరావు, అతనికేసి జాలిగా చూస్తూ క్షణం వుండిపోయాడు. రెండు సంవత్సరాల క్రితం, కరుణాకరంని టెంపరరీ ఉద్యోగంలో చేర్పించింది అతనే! అయితే, యిప్పుడతని హోదా తగ్గిపోయింది. అతనికి యింతకుపూర్వం వుండే అధికారపు విలువను క్రమంగా తగ్గించేశారు యజమానులు. ఆ అధికారాన్ని తామే చేబట్టారు. అందుకే. టెంపరరీగా పనిచేస్తున్నవాళ్ళకు, కొత్తవారికి సెలక్షనుపెట్టి యెంచుకుంటామని, తాఖీదు జారీచేశారు డైరెక్టర్లు. ఈ పరిస్థితుల్లో తనేమీ సహాయం చెయ్యలేక పోతున్నందుకు, ముకుందరావు యెంతగానో బాధపడుతున్నాడు. కరుణాకరమంటే, అతనికి అదోవిధమైన అభిమానం మరి!

సూర్యుడు పశ్చిమాన కృంగిపోయాడు, దిగులుతో బాధతో మొహం ముడుచుకున్నట్టుగ, ఆ విచారరేఖలు, నల్లని ఆకృతిని రూపొందించుకుంటున్నయ్ క్రమంగా.

కరుణాకరం, యింట్లో అడుగుపెట్టాడు. గదిలో వెలుగుతూన్న హరికేన్‌లాంతరు పొగబట్టి పోతోంది. అది పట్టించుకొనే లేదతను. వాలుకుర్చీలో ఉస్సురనుకుంటూ మేను వాల్చాడు.

అప్పుడే వంటగదిలోంచి వచ్చిన కాంతమ్మ, లాంతరు ఒత్తిని కాస్త తగ్గించింది. వాలుకుర్చీలో నిరుత్సాహంగా చేరబడివున్న కొడుకును చూసి విస్తుపోయింది. అంత దిగులుగా వాడెప్పుడూ అగుపించలేదు.

''ఏంరా కరుణా, అలా ఉన్నావు?'' అంది,

చప్పున జవాబు చెప్పలేకపోయాడు కరుణాకరం. తల్లి తట్టుకోలేదేమోనన్న భీతి పట్టుకుంది. అయినా, చెప్పక తప్పదనుకున్నాడు.

''చెప్పవేంరా?'' ఆతృత పెరిగిందామెలో.

కరుణాకరం ఓ వేడినిట్టూర్పు విడుస్తూ సవివరంగా చెప్పాడు.

కాంతమ్మ స్తంభించిపోయింది. పరిసరాలన్నీ చిమ్మచీకటిగా వున్నట్టు తోచాయి. ఈ సమస్య యెలా పరిష్కృతమౌతుందో అంతుచిక్కలేదు. ఏం చెయ్యాలో ఆమె ఊహకి అందనేలేదు. ఆమె హృదయస్పందన రెట్టింపయ్యింది.

"భగవంతుడికి మనమీద యెందుకింత కసో, అర్థం గాకుండా వుంది. ఇప్పుడేం చేస్తాం చెప్పు? ఈ ఉద్యోగం పోతే, మళ్ళీ ఉద్యోగం దొరుకుతుందన్న ఆశ అగుపించడం లేదు. అలాగని, వెయ్యిరూపాయలు వున్నపాటున తెచ్చివ్వడం సాధ్య పడదు. ఈ విషమపరిస్థితిలో మనల్ని ఆదుకునేవా ళ్ళెవరున్నారని ఆశ పెట్టుకోవడం? మీ చిన్నాన్న వున్నారూ అంటే, మనమంటేనే ఆయనకి కిట్టదు. మనింటికి రాక పోవడం మాటటుంచితే, మనతో మాట్లాడ్డమే కష్టంగా వుంటుందాయనకి. అటువంటి వ్యక్తి సహకరిస్తాడని యెలా అనుకోవడం?" బాధగా నిశ్వాసం వదుల్తూనే అంది. ముడతలు పడిన ఆమె మొహం బాగా పాలిపోయింది.

కరుణాకరం క్షణం మౌనం వహించాడు. అతని మెదడు చురుగ్గా పనిచేస్తోంది. తమని, చిన్నాన్న నిరసనగా చూసినా, ఆదరించకపోయినా, వెళ్ళి ఆయన్నే అర్థించడం అన్నివిధాలా శ్రేయస్కరంగా తోచింది. పరాయివాళ్ళను పట్టుకుని ప్రాకులాడ్డం కంటె, అభిమానం విడిచి, అయినవాళ్ళను అర్థించడమే మంచిదనుకున్నాడు. ఆ ఆలోచనతో, అతనికి దూరంలో యెక్కడో ఆశాజ్యోతి మిణుకుమిణుకుమంటూ అగుపించింది. ప్రస్తుతానికి యింతకుమించి మరో మార్గం లేదనుకున్నాడు.

"అమ్మా! ఇప్పుడు ఒక్కటే మార్గం కనిపిస్తోంది." తల్లికేసి పరికిస్తూ అన్నాడు.

కాంతమ్మ ఆసక్తిగా చూస్తూ చప్పున ప్రశ్నించింది.

"ఏమిట్రా?" అంది. ప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తికి, ఓ కర్ర దొరికినంత ఆశను రేకెత్తించాయామెకి, ఆ మాటలు.

"అదేనమ్మా! చిన్నాన్న మనల్ని యెంతగా నిరసించినా, అవన్నీ యీ తరుణంలో పట్టించుకోకుండా, ఆయన్నే సహకరించమని అర్థించితే మంచిదనిపిస్తోంది, ఏమంటావమ్మా?"

కాంతమ్మలో రేకెత్తిన ఆశ చల్లబడింది. నిరుత్సాహంతో మొహం ముడుచుకుంది.

"ఆయన సహాయం చేస్తాడన్న నమ్మకం నాకు లేదురా అబ్బాయ్. మీ నాన్నగారు పోయినప్పుడుకూడా, యేదో నలుగురూ యేమనుకుంటారోనన్న భావంతో వచ్చాడే గాని, తీసుకోవల్సిన బాధ్యతలేవీ తీసుకోలేదు. ఆ తర్వాత మనం యేమయ్యామో, యెలా వున్నామో, ఆయన పట్టించుకోనే లేదు. అటువంటివాడు, ఆర్థికంగా సహకరించుతాడంటే, అదీ వెయ్యిరూపాయలు—నాకేం నమ్మకంలేదు" అంది.

"నాకు మాత్రం, ఆ ఆశ పూర్తిగా చావలేదమ్మా! నేను స్వయంగా వెళ్ళి, సహా




శించమని అర్థిస్తే, తప్పకుండా సహాయపడతాడన్న విశ్వాసం వుంది.''

''నీ విశ్వాసాన్ని వమ్ముచెయ్యడం, నాకిష్టంలేదురా బాబూ! ప్రయత్నించి చూడవుతే. భగవంతుడి కృపవల్ల ఆయన హృదయం కరిగి సహకరిస్తే అంతకంటె కావల్సిందేవిఁటి? నెలనెలా కొంత తీర్చుకుంటామని చెప్పు.''

''అలాగేనమ్మా! ఇప్పుడే వెళ్తాను. 'శుభస్య శీఘ్రం' అన్నారు.'' లేచాడు.

''కాఫీ తీసుకుని వెళ్ళరా.'' లోపలికి వెళ్ళింది కాంతమ్మ.

కరుణాకరం యాంత్రికంగా కూలబడ్డాడు మళ్ళీ. అతని మనస్సు మనస్సుగా లేదు. కల్లోల శరధిలా చిందరవందరగా వుంది. తల్లి తీసుకొచ్చి అందించిన కాఫీని రెండు గుక్కల్లో సేవించేసి బైటికి నడిచాడు.

వెళ్తోన్న కొడుకుకేసి జాలిగా చూసింది కాంతమ్మ. మనస్సులో దేవుణ్ణి ప్రార్థించుకుంది.

## 2

రఘుపతి ముందుగదిలో కూచుని సిగరెట్ కాల్చుకుంటున్నాడు. వయస్సు సుమారు

యాభై వుంటుంది. మనిషి బలిష్టంగా వుండటంవల్ల, అంత వయస్సువాడిలా ఆగుపించడు. కోరమీసం, అతణ్ణి మరింత గంభీరంగా కనబరుస్తున్నది.

గడియారం యేడుగంటలు కొట్టింది.

"ఏడుగంటలయ్యింది. భోజనానికి లేవండి నాన్నా" అంటూ లోపల్నించి వచ్చింది జానకి. వేళ తప్పకుండా భోజనం చెయ్యడం రఘుపతికి అలవాటు.

"ఇవ్వాళ మధ్యాహ్నం భోజనమే యింకా జీర్ణం కానట్టుగా వుందమ్మా! కాస్సేపు పోయాక తింటాలే, నువ్వు భోజనం చేసెయ్" అన్నాడు రఘుపతి.

"నా భోజనానికి తొందరేవిఁటి లెండి నాన్నా? తర్వాతే తింటాను" అనేసి, లోపలికి వెళ్ళిపోయిందామె.

జానకికి పందొమ్మిది సంవత్సరాలుంటాయి, గొప్ప అందమైన అమ్మాయి కాకపోయినా అందవిహీన కాదు, మూడు సంవత్సరాల క్రితం, తల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతురాలు. ఆమెకి వివాహం చేసెయ్యాలన్న తలంపు రఘుపతికి యెన్నోసార్లు మెదడులో మెదిలింది. కాని, ఉన్న ఒకే ఒక్కకూతురూ దూరమైపోతే, తన బ్రతుకు మరీ అధ్వాన్నమై పోతుందన్న దిగులు ఆ ప్రయత్నాల్ని వాయిదావేస్తూ వస్తోంది. అందుకనే యెన్ని సంబంధాలు వస్తున్నా, ఆలోచించి చెబుతానంటూ తప్పించుకు వస్తున్నాడు. అలాగని, యెన్నాళ్లు ఉపేక్షించగలడు? నలుగురూ హర్షించొద్దూ? తన బ్రతుకూ, భవిష్యత్తూ విషయం యెలా వున్నా, యేదో ఒక మంచి సంబంధం చూసి, అమ్మాయికి వివాహం చేసేస్తేనే మేఁలనిపించింది. అప్పటప్పుడూ ఒంటరిగా కూచుని, వస్తున్న సంబంధాల్ని గుర్తుకు తెచ్చుకుంటూ, వాటి విషయం తార్కికంగా ఆలోచిస్తూ వుంటాడు. ఈ రోజుకూడా ఆ ఆలోచనే అతని మస్తిష్కాన్ని పనిచేయిస్తోంది.

జోడు శబ్దం విని, ద్వారంకేసి దృష్టిని పోనిచ్చాడు రఘుపతి. కరుణాకరంని చూసి ఆశ్చర్యపోయాడు. చాలారోజుల్నించి తమ కుటుంబాల మధ్య రాకపోకలు సన్నగిల్లాయి. అటువంటిది, వాడిప్పుడు వస్తున్నాడంటే, ఆశ్చర్యమే మరి. ఇంటికొచ్చినవాణ్ణి పలుకరించకుండా యెలా వూరుకోగలడు?

"ఏఁరా కరుణాకరం! చాలారోజుల తరువాత వచ్చావు. కూచో!" అంటూ ఆహ్వానించాడు. ఆ మాటల్లో వ్యంగ్యం ధ్వనించింది. అయినా, కరుణాకరం బాధపడలేదు. అవసరంలో వున్నవాడు, అభిమానపడితే లాభం యేవిఁటి? ఎదురుగా కూచున్నాడు.

"చాలా అవసరం వుండి వచ్చాను బాబాయ్" కూచుంటూనే అన్నాడు కరుణా

కరం.

"అది నేను విన్న చూడగానే ఊహించాను" చిన్నగా నవ్వుతూ అన్నాడు రఘుపతి. "ఏవిటది? చెప్పు."

"నా భవిష్యత్తును తీర్చి దిద్దుకోవడానికి, మీ సహకారం కావాలి బాబాయ్. ఈ తరుణంలో మీరు సహాయం చెయ్యకపోతే, నా జీవితం మలుపు తిరగొచ్చు."

"సహకారమంటే....? ఏదో వివరంగా చెప్పరా. నాకు అందుబాటులో వుంటే చేస్తాను."

"మీకు అందుబాటులో వున్నదే బాబాయ్. ఇన్నాళ్ళూ నేను వెలిగిస్తున్న ఉద్యోగం. ఖాయమైంది కాదని యిప్పుడు తెలిసింది. ఏదో సెలక్షను పెడుతున్నారట. అందులో ఉత్తీర్ణులైనవారినే ఖాయం చేస్తారట. ఆ 'ఉత్తీర్ణత' అన్నది, వ్యక్తిప్రజ్ఞా విశేషాలపై ఆధారపడి వుండదట. సిఫారసులు, లంచాలు, మొదలైనవాటిపై ఆధారపడి వుంటుందట. అధికారమంతా బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్‌కే పరిమితమై వుంటుందిగా. అందులో యే ఒక్కర్నో ప్రసన్నుణ్ణి చేసుకోకపోతే, ఆ సెలక్షనులో ఉత్తీర్ణులు కావడం అసంభవమట. మా మేనేజరుగారికి నేనంటే యెంతో వాత్సల్యం. ఆయనే యీ యేర్పాటు చేస్తామన్నారు. అయితే లంచం రూపంలో వెయ్యిరూపాయలైనా ముట్టచెప్పకపోతే, డైరెక్టర్ల చల్లని చూపులకు దూరమైపోవల్సిందేనట. అందుకని ఓ వెయ్యిరూపాయలు సహాయంచేస్తే, మీ మేలు యెన్నటికీ మర్చిపోను. నెలనెలా కొంత తీర్చుకుంటాను. ఈ అవాంతరం గట్టెక్కించడానికి మీరు తప్పించి యింకెవరున్నారు చెప్పండి?" ప్రాధేయపూర్వకంగా అన్నాడు కరుణాకరం.

రఘుపతి అంతా విన్నాడు. కరుణాకరంమీద అభిమానమైతే వుంది. జాలికూడా కలిగింది. అయితే, ఒకనాడు వాళ్ళ నాన్న అన్నమాటలు యిప్పటికీ అతని చెవుల్లో గింగురు పెడుతున్నయ్. "మా యింటి కాకి అయినా మీ యింటిమీద వాలదురా రఘూ! నీవంటి కృతఘ్నులకు దూరంగా వుండటమే మంచిది. నువ్వే యెప్పటికైనా 'దేహీ!' అంటూ మా యింటికి వస్తావు. ఆ రోజుకోసమే వేచివుంటాను" అన్నాడు అప్పట్లో. ఆ మాటలు తను బ్రతికివున్నంతకాలం మర్చిపోగలడా? ఇంతా చేస్తే, తను చేసిన తప్పేవిటి? అన్యాయమేవిటి? తనకి రావల్సిన వాటా అడిగాడు, అదీ యివ్వలేదు సరిగదా, కృతఘ్నుడన్న బిరుదుమాత్రం ప్రసాదించాడన్నయ్య. పోనీ, ఆయనమాత్రం సుఖపడ్డాడా అంటే అదీలేదు. త్రాగుడుకి అలవాటుపడి ఇల్లూ, వొళ్ళూ గుల్ల చేసుకున్నాడు. ఇన్నిమాటలు అన్న అన్నయ్య యెక్కువరోజులు జీవించలేదు. ఆయన సజీవంగా వున్నన్నాళ్ళూ తమ యింటి గడప తొక్కలేదు. ఆయన మర

ణించిన తరువాత వదినగాని, కరుణాకరం గాని రాలేదు. అయితే ప్రస్తుతం అవసరం దృష్ట్యా రాక తప్పిందికాదు. వాళ్ళకే యింత ఆత్మాభిమానం వుంటే, తనకి మాత్రం లేదూ? తనది మరీ పట్టుదల స్వభావం. ఇప్పుడు తను కరుణాకరంకి యెందుకు సహాయం చెయ్యాలి? అతడి ఉద్యోగం ఖాయం గాకపోతే, తనకి జరిగే నష్టమేమిటి? వాళ్ళ నాన్న అన్నాడుగా, వారి యింటి కాకికూడా, తన యింట్లో వాలదని? అలాగే వుంటే కాదూ? తన సహాయంకోసం అర్థించడమెందుకొచ్చింది? ఆలోచించాడు. ఆలోచిస్తున్నకొద్దీ అతనిలోని పట్టుదల బిగుసుకుంటోంది. అన్నయ్య మాటలు అదే పనిగ గుర్తుకొస్తున్నయ్. ఏది యేమైనా తను సహాయం చెయ్యకూడదు. అప్పుడు గాని తన గొప్పతనం తెలీదు వారికి .. అనుకుని ఒక నిర్ణయానికి వచ్చేశాడు.

కరుణాకరం ఆసక్తితో చూస్తున్నాడు, బాబాయ్ జవాబుకోసం. ఆయన అంతగా ఆలోచించడం అతనిలో కంగారు కలిగించినా ఆశమాత్రం వదులుకోలేదు. ఆ ఆశ తోనే కళ్ళప్పగించి ఆసక్తిగా చూస్తున్నాడు. అతనికి క్షణమొక యుగంగా తోచిం దప్పుడు.

రఘుపతి మెల్లగా మందహాసంచేసి ప్రారంభించాడు.

''సహకరించమని అర్థిస్తున్నావు గాని, నేనుమాత్రం నా మనస్సుకి వ్యతిరేకంగా యేమీ చెయ్యలేనురా. ఆనాడు మీనాన్న అన్నమాటలు నా హృదయఫలకంమీద శాశ్వతమైన ముద్రవేశాయి. వాటిని నేను మర్చిపోలేను. నేనే 'దేహీ!' అని మీ యింటి గడప త్రొక్కిననాడు, ఆలోచిద్దాంలే! నాలుకకు యెముకలేదు గాబట్టి, అనే యడం చాలా సుళువు. కాని, యెదుటివారిని ఆ మాటలు యెంతగా నొప్పిస్తాయో ఆలోచించడం కష్టతరం. ఈ సహాయాన్ని నేను చెయ్యలేనని కాదు....గాని చెయ్యను'' నిష్కర్షగా చెప్పాడు.

కరుణాకరం కర్రగట్టిపోయాడు. అతని మొహంలో అంతవరకూ వుంటూవచ్చిన ఆశ కల్పించిన తేజస్సు కాస్త మాయమయ్యింది. మొహం బాగా నల్లబడింది. మిణుకు మిణుకుమంటున్న ఆశ ఆరిపోయింది. బేలమొహం వేస్తూ బాబాయ్‌కేసి నిరాశతో చూశాడు.

''బాబాయ్! నాన్న మాటల్ని మీరింత పట్టుదలతో మనస్సులో పెట్టుకుని యిప్పుడీ విధంగా నామీద వాటి ప్రభావాన్ని ప్రయోగిస్తారని నేననుకోలేదు. నాన్నగారు మీకు పరాయి వ్యక్తికాదు, స్వయానా అన్నయ్య. ఆయన స్వభావంకూడా మీకు తెలీంది కాదు. తెలిసికూడా ఆయన మాటల్ని మీరు మనసులో పదిలపర్చుకున్నారంటే యేమనుకోవాలో తెలీదు. ఇది నా అభ్యర్థనగా తీసుకుని వాటిని మర్చిపోండి బాబాయ్.




నాకీ ఒక్క సహాయమూ చెయ్యండి. మీ మేలు యెప్పటికీ మర్చిపోను. మీ నిర్ణయాన్ని మార్చుకోండి బాబాయ్. కేవలం నాకోసం మార్చుకోండి'' దీనాతిదీనంగా అన్నాడు.

అయినా రఘుపతి హృదయం కరుగలేదు. తను కరిగిపోకూడదని, అంతకు ముందే నిర్ణయించుకున్నాడు గనుక, దృఢనిశ్చయంతో నిలువగలిగాడు.

''లాభం లేదురా! నా నిర్ణయాన్ని మార్చుకోలేను. మీ నాన్న నాకు స్వయానా అన్నయ్యే కావచ్చు. ఆ బంధుత్వాన్ని అప్పుడాయన గుర్తించలేదుగా! అందుకే యీనాడు నా యీ పట్టుదల. ఆయన ఆత్మ గుర్తించి, తను అప్పట్లో చేసిన పొరపాటుకి పశ్చాత్తాపపడితే, అదే నాకు పరమానందాన్ని కలిగిస్తుంది. ఆ ఆనందమే నా మనస్సుకి వూరట కలిగిస్తుంది. నేనిలా అన్నానని మీ అమ్మతో చెప్పు. ఆమెకూడా తెలుసుకోవడం చాలా అవసరం. వెళ్ళిక '' అన్నాడు.

ఆ మాటలు శూలపుపోటుల్లా బాధించాయి. బొత్తిగా మానవత్వపు ఛాయలు యెక్కడా బాబాయ్‌లో అగుపించలేదతనికి. తన తండ్రి రక్తం పంచుకున్న వ్యక్తేనా యిలా అంటున్నదని విస్తుపోయిన కరుణాకరం, క్షణంసేపు కల్లోల జగతిలో

విహరించి, తర్వాత తెరుకున్నాడు. అతనిలోని ఆత్మాభిమానం వొళ్ళు విరుచుకుని లేచింది. తన స్థితి, యింకే విధంగామారినా లెక్కచెయ్యకూడదుగాని, యీ విధంగా బాబాయ్‌చేత అవమానింప బడకూడదనుకున్నాడు. తన తండ్రిని, అక్కసుగా తూల నాడుతూ ఉంటే, సహించి, ఓపిగ్గా వింటూ కూచోవడం, యింక సాధ్యపడలేదు. అతని మొహం అసహ్యంతో, కోపంతో, రంగు మార్చుకుంది. బాబాయ్‌ని అర్థించడమే తన పొరపాటనుకున్నాడు. తల్లి మాట విననందుకు, యిప్పుడు పశ్చాత్తాపపడ్డాడు. లేచాడు. "వస్తాను బాబాయ్! మీరింత కటువుగా ప్రవర్తిస్తారని, నే నెప్పుడూ వూహించలేదు. ఏం చేస్తాను? మిమ్మల్ని సహకరించమని అర్థించడానికి రావడం, నా దురదృష్టం. బహుశా, అదృశ్యంగా వున్నా, నాన్న ఆత్మ నా స్థితికి జాలి పడుతూ వుంటుందనుకుంటాను. మీరు ఇప్పుడు ఆనందించవచ్చు." అంటూ చరచరా వెళ్ళిపోయాడు బైటికి.

రఘుపతి మెల్లగా నవ్వుకున్నాడు. ఆ నవ్వులో ప్రతీకారపు తృప్తి నిండివున్నట్టుగ ధ్వనిస్తోంది. ఇంకెక్కడా సహాయం దొరక్కుండావుండి, కరుణాకరం ఉద్యోగం వూడిపోతే బావుంటుందనుకున్నాడు మనసులో. అతనికసి, అంత ప్రబలంగా వుంది మరి!

జానకి, అప్పుడే లోపల్నించి వచ్చింది కాఫీ కప్పుతో. కరుణాకరం రావడం, ఆమె పసిగట్టింది. ఇన్నాళ్ళకు తమ యింట్లో అడుగుపెట్టిన అన్నయ్యకి, కాఫీ అయినా యివ్వకుండా ఎలా పంపడం? అనిపించి, గబగబా కాఫీని తయారుచేసి తెచ్చింది. కాని, ఖాళీగా అగుపించిన కుర్చీని చూసి, నిర్ఘాంతపోయింది.

"కరుణన్నయ్య వెళ్ళిపోయాడేమిటి నాన్నా?" ప్రశ్నించింది ఆశ్చర్యంగా.

"ఔనమ్మా! వెళ్ళిపోయాడు."

"అప్పుడే వెళ్ళనిచ్చారేం? రాక రాక, చాలా కాలానికి వచ్చాడు. కాఫీ అయినా తీసుకున్నాడు కాదు." ఆమె మాటల్లో, అభిమానం వ్యక్తపడింది.

రఘుపతి మెల్లగా నవ్వేడు.

"అవసరముండి వచ్చాడు. అవసరం అందుబాటుకిరాక, వెళ్ళిపోయాడు. దానికి మనమేం చేస్తాం జానకీ?" తేలిగ్గా అన్నాడు.

"అవసరముండి వచ్చాడా?" ప్రశ్నించింది.

"మరి కాకపోతే, మనల్ని చూసి పోవడానికి వచ్చాడనుకుంటున్నావా? పిచ్చితల్లీ! వాడి వుద్యోగం పోకుండా వుండాలంటే, వున్నపాటున వెయ్యి రూపాయలు కావాలిట. నా నుండి యీ సహాయాన్ని పొందడానికి వచ్చాడు"

"మీ రేమన్నారు? ఇచ్చారా?"

"లేదమ్మా! ఇవ్వనన్నాను."

జానకి ఆశ్చర్యపోయింది. ఆమె కళ్ళు వింత పరిణామాన్ని పొందాయి.

"ఇవ్వనన్నారా? ఏం నాన్నా?" వింతగా అంది.

"నీకు తెలీదమ్మా! మీ పెద్దనాన్న జీవించి వుండగా ఆయన నాకు చేసిన అన్యాయం, నన్ను అవమానించిన తీరూ, ఆ మాటలు, యిప్పటికీ నా హృదయ ఫలకం మీద చెరిగిపోలేదు. అటువంటివాని కొడుక్కి, గతాన్నంతా మర్చిపోయి సహాయం చేస్తానా! నాకూ అభిమానముందమ్మా! నేనూ వుప్పూ, కారం, తింటున్నాను." కక్ష, కరడుగట్టి పోయినట్టుగ, పట్టి పట్టి అన్నాడు.

తండ్రి మాటలు, జానకికి రుచించలేదు. "మీ అన్నదమ్ముల పట్టుదలలూ, పౌరుషాలూ పిల్లలమీద చూపిస్తారా నాన్నా? అన్నయ్య. యేం అన్యాయం చేశాడని యీ కక్ష చెప్పండి? తండ్రి చేసిన తప్పుకి, కొడుకు యెట్లా బాధ్యుడౌతాడో, ఒక్కసారి ఆలోచించండి నాన్నా: పాపం, మీరీ సహాయం చెయ్యకపోతే, వుద్యోగాన్ని పోగొట్టుకుంటాడేమో అన్నయ్య!" అంది జాలిగా.

"పోగొట్టుకోనీవమ్మా! దానివల్ల నాకు జరిగే నష్టమేవిఁటి? వాళ్ళనాన్నే వచ్చి అదుకుంటాడు. అతడికేం?" వెటకారంగా అన్నాడు.

జానకి, తండ్రి పట్టుదలకూ, మొండితనానికీ, మనసులో ఎంతగానో బాధపడింది. అన్నయ్యపట్ల, ఆమెకి యెనలేని జాలి పెరిగింది. కాని, ఏం చెయ్యగలదు? గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది.

"చాలా కఠిన హృదయులుగా మారిపోతున్నారు నాన్నా! ఇటువంటి సమయాల్లో పరాయివాళ్ళే సహకరిస్తారు కదా, తండ్రి సోదరులు మీరు సహకరించడానికి నిరాకరించడం, లోకం హర్షించదు." తన హద్దుల్ని దాటకుండా, అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

రఘుపతి వెటకారంతో కూడిన పొడినవ్వు నవ్వేడు. లోకంతో నాకేమీ ప్రమేయం లేదమ్మా జానకీ! నాకు న్యాయంగా రావల్సిన ఆస్తిని యివ్వకుండా, దాన్ని తగలేసినప్పుడు, అన్నయ్యను యీ లోకం యేమందని? ఏమీ అనలేదు. మరిప్పుడు, నన్ను అనడానికి లోకానికి యేం అర్హత వుంటుందని చెప్పు! నీకు లోకానుభవం లేదమ్మా! నువ్వీందులో జోక్యం కలిగించుకోకు." అంటూ మెల్లగా మందలించాడు.

జానకి మరింకేమీ మాట్లాడలేక పోయింది. తను, యెంత ప్రయత్నించినా, తండ్రి హృదయంలో కరడుగట్టిన కరకుదనం కరగదన్న నిశ్చయానికి వచ్చేసింది.

చేతిలోవున్న కాఫీ చల్లబడి, వెక్కిరిస్తున్నట్టనిపించింది. ఉస్సురనుకుంటూ నిట్టూర్చి, లోపలికి వెళ్ళిపోయింది.

రఘుపతి ఒక విధమైన గర్వాన్ని నింపుకుని, లేచాడు.

"వడ్డించమ్మా, భోంచేస్తాను" అంటూ కూతురికి వినిపించేలా కేకవేసి, లోపలికి విశ్రమించాడు.

# 3

"నా శాయశక్తులా ప్రయత్నించాను కరుణాకరం. కాని, ఫలితం లేకపోయింది. ఈ రోజుల్లో డబ్బు విలువముందు మాటకి యేం విలువుంటుంది చెప్పు! అప్పటికీ చెప్పాను, తర్వాత ఏదో ముట్టజెప్తామని. సరేనన్నారు. కాని, తీరా కార్య రూపంలో మాత్రం, మొండి చెయ్యి చూపించారు. ఇంక యెవర్ని, యెలా నమ్మేది? ఇదిగో నిన్ను ఉద్యోగం నుంచి తీసివేస్తున్న ఆర్డరు. నీ స్థానంలో అప్పుడే ఓ వ్యక్తిని పోస్టు చేశారు కూడాను. అతను యీ రోజే వస్తున్నాడు. ఐ యామ్ సో సారీ!" అంటూ బాధపడుతూ, ఆఫీసు ఆర్డరు అందించాడు, ముకుందరావు.

నిజం చెప్పాలంటే, కరుణాకరమంటే, ముకుందరావుకి వల్లమాలిన అభిమానం, కరుణాకరం పనిలో ప్రజ్ఞావంతుడే గాకుండా, అణకువ, ఓర్పు, గలవాడుగా అందరిలో పేరు సంపాదించుకున్నాడు. అందుకే, మేనేజరుకి అతనిమీద అంత అభిమానం. కాని, యేం లాభం! ఆ అభిమానం ఎందుకూ కొరగాకుండా పోయింది. పేరుకి మేనేజరే అయినా, ఉద్యోగాలకు సంబంధించినంతవరకూ, యేమీ అధికారం లేక పోయింది

కరుణాకరం స్తంభించిపోయాడు. అతనికి తెలుసు—తనకి ఉద్యోగం ఖాయమవ్వదని. తను డబ్బు వెదజల్లకపోతే, యింక అయ్యేదేవిఁటనుకున్నాడు. అయినా సరే, ధైర్యంగా వుండలేక పోయాడు. కంపిస్తున్న చేత్తో, ఆ ఆర్డరు తీసుకున్నాడు. అతని కళ్ళల్లో అశ్రువులు గూడుకట్టినయ్. శరీరమంతా ఒక్కసారి చల్లబడినట్టుగా, అనుభూతిని పొందాడు.

"నాకు సహాయం చెయ్యాలన్న సంకల్పంతో, మీరెంతో శ్రమతీసుకున్నారు సార్. కాని, ఫలితం లేకపోతే మీరుమాత్రం యేం జేస్తారు చెప్పండి? అది నా దురదృష్టమే మరి! నా జీవితం, నా కెన్నో పాఠాలు నేర్పుతోంది. అందులో యిదొకటి. ఏం చెయ్యను? వెళ్ళొస్తాను సార్!" అన్నాడు, రెండు చేతుల్తో నమస్కరిస్తూ. అతని గొంతు కంపించింది. కళ్ళల్లో గూడుకట్టిన కన్నీరు, అక్కడ యింక వుండలేక




గామోసు, ఒక్కవుదుటున చెక్కిళ్ళమీదికి పరుగుతీసింది.

ముకుందరావు జాలిగుండె, ద్రవించిపోయింది. అతని నయనాలు ఆర్ద్రమయ్యాయి.

''వెళ్ళు కరుణాకరం! నీకు భగవంతుడు మేలుచేస్తాడు. నిరాశ చెందకు. ధైర్యాన్ని కూడగట్టుకో! కాషియర్ దగ్గరికి వెళ్ళి, నీకు రావల్సిన పైకాన్ని తీసుకో. జీవితంలో యిటువంటి పరీక్షలనేకం వుంటూ వుంటాయి. వాటిని తట్టుకుని, ధైర్యంగా ముందుకు పోవడమే మానవుడు నేర్చుకోవల్సింది. పిరితనంతో నిరాశను నింపుకుని, జీవితం మీద విరక్తిని పెంచుకోవడం, శ్రేయస్కరంకాదు. ఇదిమాత్రం గుర్తుంచుకో!'' అంటూ, కరుణాకరం భుజాన్ని తట్టాడు, ముకుందరావు.

కరుణాకరం కళ్ళొత్తుకుంటూ, మరేమీ మాట్లాడలేక, అక్కణ్ణించి కదిలాడు, కాషియర్ రూమ్‌కేసి.

కరుణాకరం అల్లంత దూరం వెళ్ళిపోయాక, ముకుందరావు చేతిరుమాలు తీసి కళ్ళొత్తుకున్నాడు. ఇటువంటి దురదృష్టవంతులు దేశంలో ఎంతమంది వున్నారో ననిపించిందతనికి. లోలోన చాలా బాధపడ్డాడు.

* * *

ఇల్లు చేరుకున్నాక తల్లిచేతిలో డబ్బు పెట్టాడు కరుణాకరం. కాంతమ్మ ఆశ్చర్య

పోయింది.

"ఇప్పుడు జీతమేమిచ్చిరా?" అంది విస్తుపోతూ.

కరుణాకరంకి, ఆ క్షణంలో ఏడుపొచ్చింది.

"ఔనమ్మా! ఇది, నా ఆఖరు జీతం. ఈ రోజునించీ నాకు ఉద్యోగం లేదమ్మా దేశంలోని లక్షలాది నిరుద్యోగుల్లో, నేనూ ఒకణ్ణి." అన్నాడు గాద్గదిక స్వరంలో.

కాంతమ్మ, నిర్ఘాంత పోయింది. ఆమె కళ్ళు అశ్రువులతో నిండిపోయాయి.

"చివరికి, అనుకున్నంతా అయిందన్నమాట మీ చిన్నాన్న యిప్పటికయినా సంతోషిస్తాడనుకుంటాను. వెళ్ళి, ఈ విషయం చెప్పిరారా! మనసారా ఆనందించమను." బాధ, కోపం, మిళితమై పొంగివస్తుంటే, కసిగా అందామె. అప్రయత్నంగా ఆమె కన్నీరు, జలజలా చెక్కిళ్ళమీదికి జారిపోయింది.

కరుణాకరం, గట్టిగా ఓ నిశ్వాసం వదిలాడు. "ఇంకెందుకులే అమ్మా! జరిగిందేదో జరిగింది. ఆయన ఎంత ఆనందిస్తే మనకేం? రాతి హృదయుడనుకుంటాం. అంతే!" మొహం దించుకుని అన్నాడు.

క్షణం నిశ్శబ్దం. ఇద్దరూ మాట్లాడలేక పోయారు.

"అయితే, ఇప్పుడేం చెయ్యదల్చుకున్నావురా?" అంది, కాంతమ్మ.

"అదే ఆలోచిస్తున్నానమ్మా! అంత సుళువుగా వుద్యోగాలు దొరికే రోజులాయివి? రేపట్నించి ఆ అన్వేషణ ప్రారంభించాలి మరి!"

"నీకు తెలిసిన వాళ్ళెవరూ మంచి పదవుల్లో లేరా?"

"వుంటేమాత్రం, ఏం లాభమమ్మా! సమయానికి, ఎవ్వరూ ఆదుకోరు. కాస్తంత అంతస్తు వచ్చిందనేసరికి, వారిలో స్నేహానుబంధానికి విలువ తగ్గిపోతుంది. స్వార్థం, ధనాశ, పెరిగిపోయి, యితర అంతే వుండదు వారి మెదడులో. అటువంటి పరిస్థితుల్లో, ఎంతటి పరిచితులైనా, సహాయపడతారన్న నమ్మకంలేదు. అయినా, ప్రయత్నమన్నది చెయ్యాలిగా! చూస్తాను...." నిస్పృహతో అన్నాడు.

కాంతమ్మనోట, మాటరాలేదు. భవిష్యత్తంతా, ఆమెకి గాఢాంధకారంగా గోచరిస్తోంది. ఏం జరుగుతుందో, తమ పరిస్థితి ఎలా మారుతుందో, ఆమె వూహించుకోలేకపోయింది. ఇంక, ఆలోచించడానిక్కూడా ఆమెకి ఓపికలేకపోయింది. ఆమె దృక్కులు ఎదురుగా గోడపై వేలాడుతోన్న భర్త ఫోటోకేసి పోయాయి. "చూశారా మేం పడుతున్నపాట్లు' అని మనసులో అనుకోకుండా వుండలేక పోయింది. అక్కణ్ణించి, బరువుగా అడుగులు వేసుకుంటూ, నిష్క్రమించింది లోపలికి.

కరుణాకరం, వుస్సురనుకుంటూ, కుర్చీ వెనక్కి చేరబడ్డాడు. కిటికీలోంచి

వడగాడ్పు వీస్తోంది. టేబిలుమీదున్న ఫ్లవర్ వాస్‌లోని పూలు వాడిపోయి,వాలిపోయాయి. వాటిని చూసేసరికి, యేవిఁటోలా అనిపించింది. అతని మనస్సు, నిశ్చలంగా లేదు. అసంఖ్యాకమైన ఆలోచనలతో, మెదడు చిందరవందరయ్యింది. అదేపనిగా ఆలోచిం చించడంవల్ల, ప్రయోజనం లేదనుకున్నాడు. లేచివెళ్ళి, టేబిలుముందు కూచున్నాడు. సగం పూర్తిచేసిన 'రాధామాధవుల' చిత్రం, వెక్కిరిస్తున్నట్టనిపించింది. ఏకాగ్రతలేని ఆ తరుణంలో, ఆ చిత్రాన్ని పూర్తిచెయ్యడం, అసంభవ మనిపించింది. దాన్నో పక్కకి నెట్టి, మరో కాగితం తీసుకుని, టేబిలుమీదున్న ఫ్లవర్ వాస్, దాన్లోని వాడిన పూలు రాయడానికుపక్రమించాడు. గంటన్నరసేపు యిలాగే కూచుని, రంగుల్లో దాన్ని పూర్తిచేశాడు. చాలా సహజంగా రూపొందిందా చిత్రం. శీర్షిక "వాడినపూలు" అనే పెట్టాడు. అతని హృదయం, ఇప్పుడు కాస్త కుదుటబడింది. ఉద్యోగం లేనన్నాళ్ళూ, తను చిత్రలేఖనంతో కృషిచెయ్యడం, తప్పనిసరి, అనిపించింది.

కరుణాకరం, చిత్రలేఖనం ఎవ్వరి దగ్గరా అభ్యసించలేదు. కనిపించిన ప్రతి చిత్రాన్నీ గీస్తూ, కొంత ప్రావీణ్యత సంపాదించాడు. చిన్నప్పట్నుంచీ, అతనికి లలిత కళలపై మక్కువ ఎక్కువ. ముఖ్యంగా చిత్రలేఖనమంటే మరీ అభిమానం.

చిత్రకారుడు. ఒకసారి తన చిత్రలోకంలో విహరించడం ప్రారంభించాడంటే, ఆ మైకం, అందులోని మాధుర్యం, అంత సుళువుగా వొదలిపెట్టకోలేడు. ఒక్క చిత్రకారుడేకాదు. ప్రతీ కళాకారుడూ, తమ కళల్లో అదే అనుభూతిని పొందుతా డేమో!

చిత్రం పూర్తిచేసి, ఆ చిత్రాన్ని పదేపదే వివిధ కోణాల్లో చూసుకుంటున్నాడు కరుణాకరం. అదేసమయంలో లోపల్నుంచి వచ్చి, కొడుకును చూసిన కాంతమ్మ ఓ నిట్టూర్పు విడిచింది. ఇక వీడు మరీ ఇందులో లీనమైపోయి, వాస్తవిక ప్రపం చాన్నే మర్చిపోతాడేమోనన్న భీతిపట్టుకుందామెకి. ఆమెకి తెలుసు—దిగులన్నది, మనిషిని మరో మలుపుకి తిప్పుతుందని.

పక్కింటి గడియారం ఒంటిగంట కొట్టింది. పదకొండు గంటలకు కూర్చున్న వాడు, అంతవరకూ ఆ టేబిలుముందే కూచుని బొమ్మ పూర్తిచేశాడు. అంతగా అందులో లీనమైపోతున్న కొడుకు ధోరణి నచ్చలేదు కాంతమ్మకి "అబ్బాయ్, కాస్సేపు అలా మంచంమీద విశ్రాంతి తీసుకోరాదట్రా? ఎంతసేపని అక్కడ అలాగే కూచుంటావు?" అంది.

కరుణాకరం మాట్లాడలేదు. చిత్రంకేసి పరిశీలనగా ఓసారి చూసి, నిస్పృహతో ఓ నిశ్వాసంవదిలి అక్కణ్ణించిలేచి, గదిలోకిపోయి మంచంమీద ఒరిగాడు. అతని

మెదడు అతి జోరుగా పని చేస్తోంది. కీకారణ్యం గుర్తుకొస్తోంది. సహారా ఎడారిని వూహించుకో ప్రయత్నిస్తున్నాడు. భీభత్సంగా కెరటాలతో నిండిన సముద్రం జ్ఞప్తికి వస్తోంది కళ్ళు మూసుకున్నాడు ఎప్పుడు నిద్రపట్టిందో అతనికే తెలీదు.

* * *

మధ్యాహ్నం మూడు కావస్తోంది. ఎండ తీవ్రత యింకా సన్నగిల్లలేదు. కరుణాకరం ఇంకా నిద్రనించి మేల్కొలేదు. కాంతమ్మ ముందు గదిలో కూచుని, బియ్యంలోని రాళ్ళు, దాన్యం, ఏరలేక లోలోన తిట్టుకుంటోంది బియ్యం ధర రోజుకిరోజూ యెంతగా పెరుగుతూవుందో, అంతకంటే అధికంగా, అందులోని రాళ్ళ సంఖ్యకూడా పెరుగుతుందేమో ననిపించిందామెకి.

"ఏవమ్మా కాంతమ్మా, ఏం జేస్తున్నావేవిటి?" గుమ్మంలో అడుగుపెడుతూనే ప్రశ్నించుకుంటూ వచ్చాడు లోపలికి ఇల్లుగలాయన సీతారామయ్య.

"రండి అన్నయ్యగారూ! కూర్చోండి. ఇదిగో, బియ్యంలో రాళ్ళు యేరలేక ఛస్తున్నాను" అంటూ లేచి నుంచుంది మర్యాదకోసం.

సీతారామయ్య కాస్తంత దూరంలోవున్న కుర్చీలో కూచున్నాడు.

"రేషను బియ్యంలో రాళ్ళున్నాయంటే అర్థముందిగాని, అధికధరపోసి బజార్లో కొనుక్కున్న బియ్యంలోనూ రాళ్ళేనమ్మా: ఏవిటో రోజులు మరీ మారిపోతున్నయ్."

"మీ వంటివారికీ ఇబ్బందేమీ వుండదులెండన్నయ్యగారూ! పంటధాన్యం వుంటాయిగా! ఇంక రాళ్ళ ప్రసక్తేవిటి?" నవ్వుతూ అందామె.

సీతారామయ్య మెల్లగా నవ్వేశాడు. "ఆ మాట నిజమేలేవమ్మా! సాధారణ విషయం చెబుతున్నాన్నేను."

క్షణం మౌనం దాల్చారిద్దరూ. ఇంకేం మాట్లాడాలో కాంతమ్మకి తోచలేదు. సీతారామయ్యే ప్రారంభించాడు.

"అన్నట్టు నేను చెప్పిన విషయం ఏం ఆలోచించావు మరి?" అన్నాడు.

"ఏ విషయ మన్నయ్యా!"

"అదేనమ్మా! మీవాడి వివాహం. ఉన్న ముగ్గురమ్మాయిల్లో, ఇద్దర్ని పైవూళ్ళోనే యివ్వాల్సి వచ్చింది. కనీసం మా చిన్నమ్మాయినయినా నా కళ్ళముందు మసలేలా వుంచుకోవాలన్న కోరికవుంది నాకు. చెప్పకేంగాని మీ వదినకూ, నాకూ, మీవాడిమీద దృష్టిపడింది. అంతస్తుల్ని దృష్టిలో పెట్టుకోకుండా అంగీకారం తెలిపితే యీ సంవత్సరమే ముహూర్తం పెట్టించేద్దాం. ఏ మంటావమ్మా!" అన్నాడు వుత్సుకతతో.

కాంతమ్మ మొహం మాడిపోయింది. బరువుగా ఓ నిట్టూర్పు విడిచింది. ఇటువంటి




అవకాశం వచ్చినందుకు ఆమె జారవిడుచుకుని వుండేదికాదు. ఇంతకుముందే తన అభిప్రాయాన్ని తెలుపాలని నిర్ణయించుకుంది కూడాను. వాళ్ళ చిన్నమ్మాయి విమలను కోడలుగా చేసకోవడంకంటే అదృష్టం మరోటి వుండదనుకుంది. ఈ రోజు ఉదయం వరకూ. కాని. ఇప్పుడా భావనలేదు. ఆ ఆశలేదు. ఆ అవకాశంలేదు. తన కొడుక్కి ప్రస్తుతం ఉద్యోగంలేదని తెలిస్తే సీతారామయ్య తన అభిమతాన్ని మార్చుకోకుండా వుంటాడా? ఆమెకి నమ్మకం లేకపోయింది.

ఆమె ఆలోచిస్తూ వుండటాన్ని గమనించాడు సీతారామయ్య.

"ఏమిటమ్మా అలా ఆలోచిస్తున్నావు? అభ్యంతరమేమైనా వుందా? నిర్మొహమాటంగా, మనసులోని మాట చెప్పేయవమ్మా! దాపికేం!" అన్నాడు.

కాంతమ్మ. మొహం దించుకుంది.

"అదేంకాదు అన్నయ్యగారూ...." చెప్పలేక పోతోందామె.

"మరేమిటి?"

"మా వాడికి. ప్రస్తుతం ఉద్యోగం లేదు." ఆమె స్వరం కనిపించింది.

సీతారామయ్య. నిర్ఘాంతపోయాడు.

"ఉద్యోగం లేదూ? ఎప్పట్నుంచి?" ఆశ్చర్యంగా అన్నాడు.

"ఈ రోజునించే అన్నయ్యగారూ?"

"కారణం! తప్పేమైనా చేశాడా? అటువంటి మనిషికాదే!"

''అదేం కాదన్నయ్యగారూ! ఆ ఉద్యోగం ఖాయపర్చడానికి లంచం రూపంలో కొంత ముట్టజెప్పకోవాలిట. అదీ వందా, రెండొందలుకాదు. వెయ్యి రూపాయలు. హఠాత్తుగా మేం ఇంత మొత్తం ఎక్కణ్ణించి తీసుకురాగలం చెప్పండి? ఇంతవరకూ ఉన్న అప్పులు తీర్చుకునేసరికే సరిపోతోంది. అప్పటికీ అభిమానం చంపుకుని, వాళ్ళ చిన్నాన్న దగ్గరికి పోయి అర్థించాడు. ప్రాధేయపడ్డాడు. కాని, ఫలితం లేకపోయింది. ఆయన కఠినహృదయం కరగలేదు. అంతే! ఉద్యోగం పోయింది.'' రుద్ధస్వరంతో అంది.

''ఎంత పని జరిగిందమ్మా! నన్ను అడిగితే, యిచ్చివుండేవాణ్ణిగా!'' సానుభూతితో అన్నాడతను.

''ఏమో, నాకా ఆలోచన అప్పట్లో తట్టలేదన్నయ్యగారూ! అయినా, మీరుమాత్రం యేవో షరతులు పెట్టకుండా వూరికనే యిస్తారన్న నమ్మకమేవిఁటి?''

''ఇంకేం షరతులుంటాయని? మా అమ్మాయిని వివాహం చేసుకోవడమన్నదే షరతు. ఇదో పెద్ద షరతా?''

''పోనీ లెండి అన్నయ్యగారూ! అటువంటి షరతులంటే మా వాడికి అసలే గిట్టదు. వాడి తత్వమే వేరు. అయినా, తరుణం మించిపోయాక యేమనుకుని యేం లాభం?''

''అయితే, ఇప్పుడేం చెయ్యాలని మీవాడి ఉద్దేశమమ్మా?''

''ఇంకా నిశ్చయించలేదు. ఉద్యోగాన్వేషణ జరుపుతాడు. అంతకంటే యింకేముంది? ఈ పరిస్థితుల్లో మీ అమ్మాయి నివ్వడానికి యెలా సాహసిస్తారు చెప్పండి?'' ఆయన మనస్తత్వం తెలుసుకుందుకే అలా అందామె.

సీతారామయ్య ఓ నిట్టూర్పు విడిచాడు.

''ఔనమ్మా! ఆస్తిపాస్తులయినా వుండాలి, ఉద్యోగమైనా వుండాలి. ఈ రెండూ లేని వ్యక్తి ఎలా జీవించగలడని? అతడికి పిల్లనివ్వడానికి ఎలా సాహసించడం చెప్పు? అది నేనే కాదు. ఎవ్వరూ చెయ్యరు. మరి వెళ్ళొస్తానమ్మా!'' అంటూ నిష్క్రమించాడు.

కాంతమ్మ దిగులుతో కూడిన ఓ పొడినవ్వు నవ్వుకుంది. సీతారామయ్య మాటలు ఆమెకి ఆశ్చర్యాన్ని కలిగించ లేదు. నిజంగా తాము దురదృష్టవంతురాలననుకుంది. బియ్యం తీసుకుని వంటగదికేసి వెళ్ళిపోయింది.

* * *

# 4

కరుణాకరంకి ఉద్యోగాన్వేషణ నిత్యజీవితమయ్యిం దిప్పుడు. అతడు తిరగని ఆఫీసు లేదు. ఆశ్రయించని స్నేహితులు, బాగా పరపతివున్న పెద్దలు లేరు. కాని, యెక్కడా అదృష్టం కలిసిరావడం లేదు. ప్రతీచోటా రిట్రెంచ్‌మెంట్ నినాదమే వింటున్నాడు గాని, ఖాళీలున్నాయన్నమాట మచ్చుకయినా ఒక్కచోటకూడా వినలేదు. దేశంలో యీ నిరుద్యోగ సమస్య యెప్పుడు అంతమవుతుందోననికూడా తలపోశాడు. నిరుద్యోగులు రోజురోజుకీ అధిక ప్రమాణంలో పెరుగుతూవుంటే, ప్రభుత్వం ఆటోమెషీన్లతో పనిచేయించడం ప్రారంభించి, మరికొందర్ని నిరుద్యోగుల జాబితాలో చేర్చడం మరీ ఆశ్చర్యం కలిగించిం దతనికి. ఒక్కొక్కప్పుడు అతనిలో అదో విధమైన నిస్పృహ మొలకెత్తుతుంది. అయితే, దాన్ని అంతలోనే అణచి వేసు కుంటున్నాడు. తప్పదు మరి!

రోజూ యేదో చిత్రం గీయాలనే సంకల్పంతో కాస్సేపు కూచుంటాడు. కాని, యేం గియ్యాలో నిశ్చయించుకోలేని అనిశ్చలత, అతణ్ణి ఆలోచనారహితుణ్ణి చేస్తోంది. దాంతో అక్కణ్ణించి లేచిపోతాడు. అలా యెన్నో అసంపూర్తి చిత్రాలు పక్కకి పెట్టేవాడు కరుణాకరం.

ఓరోజు సాయంసమయం మనశ్శాంతిని పుంజుకోడానికి గామోసు, బీచ్‌కి బైలు దేరాడు కరుణాకరం. అడుగులు ఉత్సాహంగా పడ్డంలేదు. ఔను మరి! రోజురోజుకీ నిరుత్సాహం నిండుకుంటూ వుంటే, యింక ఉత్సాహం యెక్కణ్ణించి వస్తుంది? మనిషిలో యిప్పటికే బాగా మార్పు వచ్చేసింది. ఆలోచనలు ఆరోగ్యాన్ని చెడగొడతా యన్నది అబద్ధం కాదేమో! మొహం దించుకునే నడుస్తున్నాడు. ఎవ్వరి ప్రమేయమూ లేదు. ఏదో ఆలోచిస్తూ పోతున్నాడు.

సముద్రం హోరుమంటోంది. అప్పుడే చంద్రుడు సముద్రగర్భంలోంచి వెలికి వస్తున్నాడు. వెన్నెలరేఖలు పల్చని వెండి తాపడంలా సముద్రపు టలలపై ప్రతిఫలి స్తున్నయ్. ఓచోట కూలబడ్డాడు. ఆ దృశ్యాన్ని తదేకంగా చూస్తూంటె, అతని హృదయం ఉప్పొంగిపోయింది. అతనిలోని కళాకారుడికి భావోద్వేగం అధిక మయ్యింది. ఎంత చక్కని దృశ్యం? ...అనుకున్నాడు. తనదిగ్గరే యిప్పుడు పరికరా లుంటే, యీ రమణీయ దృశ్యాన్ని చిత్రించేవాడే! అయినా, మనోఫలకంమీద ముద్రించుకున్నాడు. చిత్రకారులకు అదో వరం. చూసిన యే దృశ్యాన్నీ చప్పున మర్చి పోలేరు. కెరటాలు రివ్వున ముందుకువస్తూ వెనక్కిపోతున్నయ్....మళ్లీ వస్తున్నయ్.

బహుశా, జీవితంకూడా యింతేగామోసు ననిపించిం దతనికి. బరువుగా నిట్టూర్చాడు. అతనికి కాస్తంత దూరంలో యిటూ, అటూ యెవరెవ్వరో కూచున్నారు. వాళ్లంతా ఉత్సాహంగా నవ్వుకుంటున్నారు. మాట్లాడుకుంటున్నారు. ఏవేవో రాజకీయ విషయాల్లో వాదోపవాదాలు సాగించుకుంటున్నారు. నిజంగా, వాళ్ళంతా యెంత అదృష్టవంతులు?....అనిపించేసరికి యింక అక్కడ కూచోలేకపోయాడు. తనలాంటి దురదృష్టవంతుడికి అది అనువైన స్థలం కాదేమోనన్న భావన వచ్చేసరికి, చప్పున లేచి బైలుదేరాడు. ఆహ్వానిస్తున్నట్లుగా సముద్రపు హోరు వినిపిస్తోనే వుంది ఆ పిలుపుకు దూరంగా సాగిపోతున్నాడు. రోడ్డుమీదకు వచ్చేశాడు. విద్యుద్దీపాల కాంతిలో రోడ్డు మెరుస్తోంది.

"హలో కరుణా!" అన్న సంబోధన వినిపించింది.

కరుణాకరం వెనక్కి తిరిగాడు. వెనుక వస్తోన్న సుందరం కనిపించాడు. అతని ప్రక్కనే ఓ అమ్మాయి వుంది. బహుశా, శ్రీమతి అయ్యుంటొచ్చు ననుకున్నాడు. ఆగిపోయాడు.

"నువ్వెప్పుడు యీ ఊరొచ్చావు సుందరం?" ప్రశ్నించాడు కరుణాకరం ఆశ్చర్యంగా.

సుందరం మందస్మిత వదనంతో ముందుకొచ్చాడు.

"రెండు నెలల్నుంచి యిక్కడే వున్నాను కరుణా! నిన్ను చప్పున గుర్తుపట్టలేకపోయానోయ్ నిజంగా. నువ్వే అవునా, కాదా అని కాస్సేపు తర్జనభర్జన పడ్డాను. దీపపు కాంతిలోకి వచ్చాక, స్పష్టంగా గుర్తించగలిగాను. బాగా నీరసించిపోయావు. ఒంట్లో బాగాలేదా యేవిఁటి?" అన్నాడు సుందరం.

"అబ్బే! అటువంటిదేమీ లేదురే. బాగానేవుంది ఆరోగ్యం." పొడిగా నవ్వుతూ అని "ఆ మధ్య గుంటూరులో ఉద్యోగం వెలిగిస్తున్నట్టు చెప్పినట్టు గుర్తు ..." అన్నాడు కరుణాకరం.

"ఔనోయ్. మా కంపెనీ బ్రాంచి ఒకటి యిక్కడ కొత్తగా నెలకొల్పారులే. నన్ను మేనేజరుగా పోస్టుచేశారు. మరి, నువ్వేం చేస్తున్నట్టు?"

కరుణాకరం చప్పున జవాబు చెప్పలేదు. ముగ్గురూ మెల్లగా నడుస్తున్నారు. స్నేహితుడు జవాబు చెప్పకుండా మౌనం దాల్చడం ఆశ్చర్యం కలిగించింది సుందరంకి.

"అదేవిఁటి కరుణా: మౌనం దాల్చావేం?" అతడికేసి పరిశీలనగా పరికిస్తూ ప్రశ్నించాడు.




కరుణాకరం బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు. మౌనం దాల్చక, యేం చెప్తాడు మరి? ఉద్యోగం సంపాదించుకోలేని అసమర్ధుణ్ణని చెప్పుకుంటాడా? అయినా, ఉన్న విషయం వ్యక్తంచెయ్యక తప్పదుగా మరి?

"సుందరం, నా మౌనానికి అర్ధం నువ్వు గ్రహించుకోలేకపోయావా? ఔనులే! ఎవ్వరూ ఊహించలేరు, నాకు ఉద్యోగం లేదని, నే నిప్పుడు నిరుద్యోగిని సుందరం" అన్నాడు. అతని స్వరం బొంగురుపోయింది.

సుందరం నిర్వోఃపోయాడు. వింతగా స్నేహితుడి మొహంలోకి చూశాడు.

"ఏవిటి నువ్వంటున్నది కరుణా? నిజమా?"

కరుణాకరం బాధపడుతూ విషయాన్నంతా విపులంగా చెప్పాడు. తన దురదృష్టం, యెలా తనని పెక్కిరించిందో విడమర్చి చెప్పాడు. అదంతా చెబుతూవుంటే, అతని నయనాలు చెమ్మగిల్లాయి.

సుందరం జాలిగా స్నేహితుడికేసి చూశాడు. వ్యక్తిగతంగా ఒక్కొక్కరి అదృష్టం, ఒక్కోలా వుంటుందని, యిప్పుడు అతనికి రూఢిగా తెలిసింది. లేకపోతే చదువుకునే రోజుల్లో ఎప్పుడూ మంచి మార్కులు తెచ్చుకుని, మాష్టర్ల అభినందనలు

అందుకునే కరుణాకరం బ్రతుకు యిలా వుండటమేవిటి? ఎప్పుడూ వెనుకబడి వుండే తన జీవితం, మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుండటమేవిటి? కాలం తెచ్చిన మార్పు యిదేనేమో! దీన్నే అదృష్టమని పేర్కొంటాం. ..అనుకున్నాడు.

"నీ విషయం నన్నెంతో బాధపరుస్తోంది కరుణా! ఉజ్జ్వలంగా వుండాల్సిన నీ భవిష్యత్తు, నీకో సమస్యగా తయారయ్యిందంటే యెంతో చింతిస్తున్నాను. సరే! సమయానికి అగుపించావు. నువ్వేం అధైర్యపడకోయ్. మా ఆఫీసులో నీకు వుద్యోగం యిప్పిస్తాను. కొత్తగా పెట్టిన బ్రాంచి కదూ! నాకూ నమ్మకస్తులు కావాలి మరి! ఏమంటావ్? నీకేమీ అభ్యంతరం లేదుగా?"

కరుణాకరం తన చెవులను తనే నమ్మలేకపోయాడు. కళ్ళు ఆశతో మెరిశాయి. హృదయం ఉప్పొంగిపోయింది. మొహంలో ఒకవిధమైన తేజస్సు తారాడింది.

"నిజంగానా సుందరం?" సంతోషం పట్టలేక, ఆసక్తితో స్నేహితుడి మొహం లోకి చూస్తూ అన్నాడు.

"మంచివాడివేనోయ్! ఇటువంటి సమయాల్లోనా పరిహాసం? నాకు హృదయం లేదనుకుంటున్నావా? నేను చెప్పిందంతా నిజమే! ఈమధ్య కొన్ని దరఖాస్తులొచ్చా యనుకో! సెలెక్షను పెట్టాలనుకుంటున్నాను. ఇంకెందుకు? ఆ ఛాన్సు నీదే! రెండొందలు జీతం....ఏమంటావు?"

ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు కరుణాకరం.

"ఏమనడానికేముంది సుందరం? దిక్కుతోచక నిరాశతో దిగులు చెందుతున్న నాకు సహాయపడమని భగవంతుడే నిన్ను పంపించాడేమో ననిపిస్తుంది. కటిక చీక టిలో దిక్కుతోచక ప్రయాణిస్తున్న వ్యక్తికి, సన్నని వెలుగురేఖ యెక్కడో అగు పిస్తే యెంత ఆనందంగా వుంటుందో ఒక్కసారి ఊహించు. ప్రస్తుతం అదే నా అనుభూతి సుందరం. నీ మేలు యీ జన్మలో మర్చిపోలేను" కృతజ్ఞతాభావంతో అన్నాడు కరుణాకరం. అతని కళ్ళల్లో ఆనందబాష్పాలు మెరిశాయి.

సుందరం మెల్లగా నవ్వాడు.

"అవకాశం వుంది గాబట్టి ఆదుకోగలిగాను. దానికింతగా కృతజ్ఞత చెప్పుకోవా లటోయ్?" అన్నాడు.

"నువ్వీ యుగంలో వుండాల్సిన వ్యక్తివి కాదు సుందరం! అవకాశం వుండని యెంతమంది ఆదుకుంటున్నారు చెప్పు? ఎవరిమాటో యెందుకు? మనతో చదువు కున్న పద్మనాభం గుర్తున్నాడుగా?"

"ఔను! పద్మం అనేవాళ్ళం ...ఎక్కడున్నాడేవిటి?"

"ఇక్కడే వున్నాడు. వాడిప్పుడు ఓ పెద్ద వ్యాపారిలే. వాడి అదృష్టం బావుండి, వాళ్ళ వ్యాపారం మంచి స్థాయికి వచ్చింది. వాడు తల్చుకుంటే కనీసం నన్ను వాళ్ళ గుమస్తాగానైనా వేసుకోగలడు. ఆ అభిప్రాయంతోనే గట్టి నమ్మకంతో అభిమానాన్ని చంపుకుని, ఆ మధ్య వాడి దగ్గరికి పోయి, నా పరిస్థితి చెప్పుకున్నాను. కాని.... కాని...." కాస్తంత ఉద్రిక్తతకు లోనై, చెప్పలేక ఆగిపోయాడు.

"ఏమన్నాడప్పుతే ?"

"పోనీ, అవకాశం లేదని చెప్పేస్తే, పోయేదిగా! అది చెయ్యలేదు. నా మనస్సుని నొప్పిస్తూ న్యూనతగా మాట్లాడాడు. ఆ క్షణంలో నా గుండె ఆగిపోయినా బావుండు నన్నంతగా ఖేదపడ్డాను. అందుకే నీ సహాయాన్ని అంత తేలిగ్గా కొట్టిపారేయొద్దని చెబుతున్నాను సుందరం."

"పోనీ లేవోయ్. ఎవరి మనస్సు యెలా వుంటుందో యెవరేం చెప్పగలరు? ఇదిగో నా అడ్రసు, రేపు యెనిమిది గంటలకి మా యింటికి రా. నీకోసం నేను వేచి వుంటాను. ఇద్దరం కలిసి వెడదాం" అంటూ పర్సులోని ఓ కార్డు తీసి అందించాడు సుందరం.

"అలాగే! తప్పకుండా వస్తాను సుందరం" అన్నాడు ఉత్సాహంగా.

"క్షమించు కరుణా! ' అన్నాడు సుందరం తలా తోకా లేనట్టు.

మళ్ళీ యేమిటోనని కంగారుపడ్డాడు కరుణాకరం. కళ్ళప్పగించి, నిస్సహాయంగా చూశాడు.

"ఏమిటి సుందరం?" అతని గొంతు పేలవమయ్యింది.

"మా ఆవిణ్ణి పరిచయం చెయ్యడం మర్చాను మాటల్లో పడి. నా శ్రీమతి ... పేరు సుమతి...." అంటూ భార్య నుద్దేశించి "సుమతీ, ఇతను నా మిత్రుడు.... పేరు కరుణాకరం" అన్నాడు.

ఆ ఇరువురూ, పరస్పర నమస్కారాలు అందజేసుకున్నారు. మరి కాస్తసేపటికి వెళ్ళేసరికి బస్సు వచ్చింది. సుందరం, సుమతీ అందులో వెళ్ళిపోయారు. కరుణాకరం వడివడిగా అడుగులు వేసుకుంటూ ఎంతో ఉత్సాహంతో యిల్లు చేరుకున్నాడు.

"ఉద్యోగం దొరికిందమ్మా!" అన్నాడు తల్లి యెదురుపడగానే.

"ఎక్కడ?" ఆరాటంతో అడిగిందామె.

కరుణాకరం అంతా చెప్పాడు. కాంతమ్మ మొహం విప్పారింది. మనసులో భగవంతునికి కృతజ్ఞత చెప్పుకుంది. "భగవంతుడు, దయామయుడురా బాబూ! ఇప్పటికయినా నీ మనసు కుదుటపడింది. అంతేచాలు. ఇటీవల నిన్ను చూస్తూవుంటే, నాకు

యభమేస్తుండేది కూడాను.''

కరుణాకరం మొహం దించుకుని, తనలో నవ్వుకున్నాడు. నిజమే మరి! తన గురించి తనకే భయం కలిగింది కూడాను.

''లేరా, భోజనం చేద్దువుగాని....'' అంటూ లోపలికి పోయిందామె.

కరుణాకరం ఉత్సాహంగా లేచాడు.

# 5

కరుణాకరం, ఉద్యోగంలో చేరాడు. ఇంద్రపదవి లభించినంతగా ఆనందించాడు అతని మనస్సు పూర్తిగా కుదుటపడింది. భవిష్యత్తును గురించిన భయాందోళనలు సమసి పోయినయ్. కాంతమ్మ మరీ మురిసిపోయింది.

* * *

ఓ రోజు, కరుణాకరం ఆఫీసునించి తిరిగి వస్తున్నాడు. పూర్తిగా చీకటి పడలే దింకా. సంజవెలుగు పరిసరాల్ని వింతశోభతో నింపింది. చిన్న కూనిరాగం తీస్తూ, మొహం దించుకుని నడుస్తున్నాడు.

''కరుణా!'' అన్న కేక విన్పించింది. తన వెనుకనించి ఆ పిలుపు వచ్చినట్టు గుర్తించి, చప్పున ఆగిపోయి వెనుదిరిగాడు. బాబాయ్ తనని దాటుకుని వెళ్ళిపోయి, అక్కడ ఆగి పిల్చినట్టు ఊహించాడు. వడిగా రెండడుగులు వేసి, బాబాయ్ సమీ పానికి వెళ్లాడు.

''ఏం బాబాయ్!'' మామూలుగా అన్నాడు. ఆ సంబోధనలో యేమంత ఆప్యాయత ధ్వనించలేదు.

''ఎక్కణ్ణించి వస్తున్నావేమిటి?'' ప్రశ్నించాడు రఘుపతి. ఆయన ఆ ప్రశ్న వేయడంలో గూఢార్థం లేకపోలేదు. కరుణాకరం యింకా నిరుద్యోగిగా వుంటున్నా డనే అతని భావన. ఆ భావనని నిర్ధారణ చేసుకుందుకే ఆ ప్రశ్న వేశాడు.

''ఆఫీసునుంచి వస్తున్నాను బాబాయ్....'' అన్నాడు కరుణాకరం. అతను చెప్ప డంలో ఒకవిధమైన గర్వం పొంచివుంది.

రఘుపతి మొహంలోని రంగులు మారినయ్. కనుబొమలు దగ్గరపడ్డాయి. ఆశించని దేదో హఠాత్తుగా విన్నట్టు ఆశ్చర్యపోయాడు.

''ఉద్యోగం చేస్తున్నావన్నమాట?''

''ఔను బాబాయ్. మొదటి ఉద్యోగం ఆనాడే ఊడిపోయింది. కారణం మీకు తెలుసు. ఏ ఉద్యోగమూ లేక మొన్నమొన్నటివరకూ దిక్కుతోచక తిరిగాను. భగ




వంతుడే నామీద జాలి తలచి, మార్గం చూపించాడా అన్నట్టుగా, నా స్నేహితు డొక తను కలిశాడు. అతడు ఓ కొత్త కంపెనీలో మేనేజరుగా వుంటున్నాడు. నా స్థితి తెలుసుకుని, వెంటనే తన ఆఫీసులో గుమస్తాగా వేసుకున్నాడు. రెండొందలు జీతం. ఇంతకంటె నేను కోరేదిమాత్రం ఏముంది?" అంటూ వివరాలన్నీ యేకరువు పెట్టాడు అవన్నీ కావాలనే చెప్పాడు. ఆ చెప్పడంలో ఏ కోశానో, కాస్తంత కసి వున్నట్టు ధ్వనించింది.

"పోనీలే అతడు సహకరించాడు. సంతోషం. వస్తా మరి...." అని తన త్రోవన పోయాడు రఘుపతి.

బాబాయ్ మొహంలో యెక్కడా సంతోషపు సూచనలు కనిపించలేదు కరుణా కరంకి. అయనకి యింకా తనమీద కసి పోలేదేమో ననుకున్నాడు. ఆయన మన స్తత్వానికి మెల్లగా నవ్వుకుని ముందుకి సాగిపోయాడు,

ఇల్లు చేరుకునేసరికి సీతారామయ్యగారున్నారు. బహుశా, ఆయన యింటి అద్దె కోసం వచ్చివుంటాడని భావించాడు కరుణాకరం,

''నమస్కారమండీ!'' సవినయంగా అన్నాడు.

''నమస్కారమోయ్. కూచో!'' మందహాసంతో అన్నాడు సీతారామయ్య.

''మీ యింటద్దె యీ నెలకూడా యివ్వలేక పోతున్నందుకు చింతిస్తున్నానండీ! మీకు తెలుసుగా, నాలుగు నెలలై అర్జనలేదు. వచ్చేనెల జీతం దొరగ్గానే, ముందుగా మీ కివ్వవల్సింది యిచ్చివేస్తాను. మరేం అనుకోకండి.''

సీతారామయ్య చిన్నగా నవ్వేడు.

''అబ్బే! నేనేం యింటద్దె కోసం వచ్చాననుకుంటున్నావటోయ్? అదేం కాదు. ఏదో క్షేమ సమాచారం తెలుసుకుపోదామని వస్తూవుంటాను. నీ దగ్గర డబ్బు రాక పోతుందనా? ఆఁ అన్నట్టు నువ్విప్పుడు చేరిన ఉద్యోగం ఖాయమయ్యిందేనా?''

''అది చెప్పలేనండీ! మా స్నేహితుడు అండగా వున్నాడు గాబట్టి, ఖాయమై పోతుందన్న నమ్మకం వుంది''

ఈ జవాబు సీతారామయ్యను తృప్తిపర్చలేదు గామోసు. మరింక ఆ ప్రసక్తివి పొడిగించలేదు. ఆయన అభిప్రాయం పాతదే! ఈ ఉద్యోగమైనా ఖాయమైనదైతే తన కూతుర్ని కరుణాకరంకి యివ్వాలనే ఆకాంక్ష వుంది. అయితే, ఖాయంలేని ఉద్యోగం మళ్లీ యెప్పుడు ఊడిపోతుందోనన్న భయం పట్టుకుందిప్పుడు. అందుకే ఆ ఆలోచనకి స్వస్తి చెప్పేశాడు.

''మరి, వెళ్ళొస్తానోయ్....'' లేచాడు సీతారామయ్య.

''ఉండండన్నయ్యగారూ! కాఫీ తీసుకునిపోదురు గాని....'' అంటూ కాంతమ్మ లోపలికి పోయింది.

సీతారామయ్య మళ్లీ కూలబడ్డాడు కుర్చీలో. అతని దృష్టి టేబిలుమీదికి పోయింది. అసంపూర్తిగ వుండిపోయిన ఓ చిత్రం అగుపించింది, దగ్గరగా పోయి పరిశీలనగా చూశాడు.

''నువ్వు బొమ్మలుకూడా వేస్తావటోయ్?'' ఇన్నినాళ్ళు అతనికా విషయం తెలీక పోవడంవల్ల ఆశ్చర్యంగా అన్నాడు.

''ఏదోనండీ! తీరిక సమయాల్లో కాలాన్ని వృథాచెయ్యడం యిష్టంలేక, అలవాటు తప్పిపోకుండా, ప్రావీణ్యత వున్నంతమేరకు గీస్తుంటాను.'' మొహం దించుకుని సవినయంగా అన్నాడు కరుణాకరం.

''చాలా బావుందోయ్ యీ చిత్రం, పూర్తిచేసెయ్ మరి! ఇంకా కృషి చెయ్యి. ముందుకొస్తావు.''

''కృషిచేస్తే మాత్రం ప్రయోజనమేముంది లెండి. ముందుకు రావడమన్నది

కేవలం ప్రజ్ఞమీద ఆధారపడి వుండదు. అసలు యీ రోజుల్లో ప్రజ్ఞను గుర్తిస్తున్నా దెవరు చెప్పండి? అందుకే కదండీ, మనదేశంలోని చాలామంది ప్రతిభావంతులు వెలుగుకి రాలేకపోతున్నారు! అలాగని, నేనో ప్రతిభావంతుణ్ణని చెప్పుకోవడం లేదు సుమండీ ఏదో సందర్భం వచ్చింది గాబట్టి చెబుతున్నాను.'' ఓ విధమైన భావో ద్రేకంతో చెప్పుకుపోయాడు కరుణాకరం.

''అదీ నిజమేలే! సరేగాని, నాదో ఫోటో వుందోయ్. దాన్ని పెద్దసైజులో రాయ కూడదూ? రంగుల ఖర్చులు ముట్టజెప్పుకుంటాన్లే ''

చాలామంది ధనవంతులకు మల్లే సీతారామయ్యగారికి కూడా పెద్దసైజు చిత్రపటం యింట్లో పెట్టుకోవాలన్న ఆకాంక్ష పుట్టడంలో ఆశ్చర్యం లేదనిపించింది కరుణా కరంకి

''అలాగే లెండి. తీరిక చూసుకుని చెబుతాను.''

కాంతమ్మ, అప్పుడే లోపల్నుంచి రెండుకప్పుల కాఫీ తీసుకునివచ్చి వాళ్లిద్దరికీ అందించింది. కాఫీ తీసుకున్నాక సీతారామయ్య నిష్క్రమించాడు.

''అమ్మా, యెప్పుడూ లేనిది నా ఉద్యోగవిషయం ప్రస్తావించారేవిటి సీతా రామయ్యగారు?'' ఆయన వెళ్లిన కొద్దిక్షణాల తర్వాత అన్నాడు కరుణాకరం,

కాంతమ్మ బరువుగా ఓ నిశ్వాసం వదిలింది.

''అందుకు కారణం లేకపోలేదురా! వాళ్ళ చిన్నమ్మాయిని నీ కిచ్చి పెళ్ళి చెయ్యా లన్న కోరిక వుండేదాయనకి. అయితే, నీ ఉద్యోగానికి స్థిరత్వం లేకపోవడంవల్ల తన కోరికను కార్యరూపంలో పెట్టడానికి సాహసించ లేకపోతున్నాడు. ఆ అమ్మాయి తండ్రిగా యివన్నీ యోచించే బాధ్యత అతనికీ వుందిగా మరి!'' అంది.

కరుణాకరంకి యిప్పు డర్థమయ్యింది సీతారామయ్యగారి మనస్తత్వం. చిన్నగా నవ్వుకున్నాడు.

''పోనీలే! ఇదీ ఒకవిధంగా మంచిదే అయ్యింది. లేకుంటే వాళ్ళమ్మాయిని చేపట్టు మని ఒకటే పోరుబెట్టేవాడేమో!''

''అలా అనకురా అబ్బాయ్, ఈ అవకాశం జారిపోయినందుకు, నేనెంతగా విచా రిస్తున్నానో నీకు తెలీదు' నిస్పృహతో అందామె.

''విచారమెందుకమ్మా! ఏది వచ్చినా మన మంచికే అనుకో! అయినా, మనం ఊహించినవి, అనుకున్నవి, అనుకున్నట్టే జరిగిపోతే, 'విధి' అన్న మాటకి అర్థమే ఉండదు ఆ విషయాన్ని మర్చిపో.''

''అంతేలే!'' చాలా నిరుత్సాహపడింది.

కేవలం ప్రజ్ఞమీద ఆధారపడి వుండదు. అసలు యీ రోజుల్లో ప్రజ్ఞను గుర్తిస్తున్నా రెవరు చెప్పండి? అందుకే కదండీ, మనదేశంలోని చాలామంది ప్రతిభావంతులు వెలుగుకి రాలేకపోతున్నారు! అలాగని, నేనో ప్రతిభావంతుణ్ణని చెప్పుకోవడం లేదు సుమండీ ఏదో సందర్భం వచ్చింది గాబట్టి చెబుతున్నాను.'' ఓ విధమైన భావోద్రేకంతో చెప్పుకుపోయాడు కరుణాకరం.

''అదీ నిజమేలే! సరేగాని, నాదో ఫోటో వుందోయ్. దాన్ని పెద్దసైజులో రాయ కూడదూ? రంగుల ఖర్చులు ముట్టజెప్పుకుంటాన్లే''

చాలామంది ధనవంతులకు మల్లే సీతారామయ్యగారిక్కూడా పెద్దసైజు చిత్రపటం యింట్లో పెట్టుకోవాలన్న ఆకాంక్ష పుట్టడంలో ఆశ్చర్యం లేదనిపించింది కరుణాకరంకి

''అలాగే లెండి. తీరిక చూసుకుని చెబుతాను.''

కాంతమ్మ, అప్పుడే లోపల్నుంచి రెండుకప్పుల కాఫీ తీసుకునివచ్చి వాళ్లిద్దరికీ అందించింది. కాఫీ తీసుకున్నాక సీతారామయ్య నిష్క్రమించాడు.

''అమ్మా, యెప్పుడూ లేనిది నా ఉద్యోగవిషయం ప్రస్తావించారేవిటి సీతారామయ్యగారు?'' ఆయన వెళ్లిన కొద్దిక్షణాల తర్వాత అన్నాడు కరుణాకరం,

కాంతమ్మ బరువుగా ఓ నిశ్వాసం వదిలింది.

''అందుకు కారణం లేకపోలేదురా! వాళ్ళ చిన్నమ్మాయిని నీ కిచ్చి పెళ్ళి చెయ్యాలన్న కోరిక వుండేదాయనకి. అయితే, నీ ఉద్యోగానికి స్థిరత్వం లేకపోవడంవల్ల తన కోరికను కార్యరూపంలో పెట్టడానికి సాహసించ లేకపోతున్నాడు. ఆ అమ్మాయి తండ్రిగా యివన్నీ యోచించే బాధ్యత అతనికీ వుందిగా మరి!'' అంది.

కరుణాకరంకి యిప్పు డర్థమయ్యింది సీతారామయ్యగారి మనస్తత్వం. చిన్నగా నవ్వుకున్నాడు.

''పోనీలే! ఇదీ ఒకవిధంగా మంచిదే అయ్యింది. లేకుంటే వాళ్ళమ్మాయిని చేపట్టమని ఒకటే పోరుబెట్టేవాడేమో!''

''అలా అనకురా అబ్బాయ్. ఈ అవకాశం జారిపోయినందుకు, నే నెంతగా విచారిస్తున్నానో నీకు తెలీదు' విస్పృహతో అందామె.

''విచారమెందుకమ్మా! ఏది వచ్చినా మన మంచికే అనుకో! అయినా, మనం ఊహించినవి, అనుకున్నవి, అనుకున్నట్టే జరిగిపోతే, 'విధి' అన్న మాటకి అర్థమే ఉండదు ఆ విషయాన్ని మర్చిపో.''

''అంతేలే!'' చాలా నిరుత్సాహపడింది.




దిక్కుతోచని స్థితిలోనే బాబాయ్‌ని అర్థించాడు సహాయంకోసం. అయితే, ఆయన సహాయానికి బదులు పరిహసించి పగ సాధించాలనుకున్నాడు. సహాయాన్ని నిష్కర్షగా తిరస్కరించాడు. అది గుర్తుంచుకుని ప్రతీకార వాంఛతో జానకిని ఆమె దుర దృష్టానికి వదిలేస్తాడా?....ఆలోచన సాగించిందతని మెదడు. అలాగయితే తనకీ, బాబాయ్‌కీ వ్యత్యాసమేముంది? సాటివ్యక్తిగా తను సహకరించాల్సిందే!....అనుకుని కంగారుగా లోపలికి పోయాడు మూకను చీల్చుకుంటూ కరుణాకరం.

జానకి తండ్రి భౌతికదేహంమీద పడి హృదయవిదారకంగా రోదిస్తోంది. కరుణాకరం ఆమెకి దగ్గరగ వెళ్లాడు. ఈ ప్రపంచంతోను, వ్యక్తులతోను యింకేమీ సంబంధం లేనట్టుగా అచేతనంగా పడున్న బాబాయ్‌ని చూసేసరికి అతనికి యేడుపొచ్చింది. కళ్ళనుంచి అశ్రువులు జాలువారినయ్. కరుణాకరంని చూడగానే జానకి బావురుమంది.

''అన్నయ్యా!'' రుద్ధస్వరంతో కుమిలిపోతూ అంది.

కరుణాకరం ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాడు. అంతకంటె అతను

చేయాల్సిందేముంది మరి! ఇంక ఉపేక్షించకుండా దహనక్రియలకు యేర్పాట్లు గావించాడు.

*　　　*　　　*

జానకి యిప్పుడు కరుణాకరం యింట్లోనే వుంటోంది. ఆమెకి మరో ఆసరాలేదు. ఆమెను దిక్కులేని వ్యక్తిగా చెయ్యడం, కరుణాకరంకికూడా యిష్టంలేదు అందుకే తనింటికి తీసుకొచ్చేశాడు. రఘుపతి స్థిర చరాస్తుల్ని జానకి పేర మార్పించాడు. జానకికి క్రమంగా ధైర్యం చెబుతూవచ్చి, తండ్రిలేని లోటును మర్చిపోవడానికి అనువుగా వాతావరణాన్ని మార్చుతున్నాడు.

"అన్నయ్యా, నువ్వేగాని యీ తరుణంలో నన్ను ఆదుకుని వుండకపోతే, నేను యేమైయుందునో ఊహించుకోలేక పోతున్నాను" అంది జానకి ఓరోజు.

కరుణాకరం చిన్నగా మందహాసం చేశాడు. అతడు యేదో అనాలనుకుంటున్నంతలో కాంతమ్మ అందుకుంది

"అదేం మాట జానకీ! నువ్వు మాకేం పరాయిదానివా! ఒకవిధంగా చూస్తే యిది మా కర్తవ్యం కూడాను" అందామె.

"ఆరోజు అన్నయ్య స్వయంగా వచ్చి అర్థించినా, మా నాన్న ఆర్థిక సహాయాన్ని తిరస్కరించారు అది దృక్పథ లో పెట్టుకుని, నన్ను మీరెవ్వరూ ఆదుకోరేమోనన్న భయం నాకుండేది పిన్నీ! అందుకే అంటున్నాను" అంటూ తన మనసులోని అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది.

"నువ్వలా భావించడంలో తప్పులేదులే చెల్లాయ్. మా నాన్నగారు యేదో అన్నారని, తనకి అన్యాయం చేశారని, బాబాయ్ నామీద ప్రతీకారం తీర్చుకున్నారు. అలాగే నేనూ ప్రవర్తిస్తానేమోనన్న భయం నీకుండటం సహజమే! కాని, నా మనస్తత్వమే వేరు. పట్టుదలను పదిలంగా దాచుకుని, పగనాధించే తత్వం కాదమ్మా నాది. మనుష్యులందరూ ఒకేలా వుండరుగా! మనిషి జీవిస్తున్నది, కక్ష సాధించుకోడానికి కాదు తోటి మానవుడికి తోడ డి, సమిష్టి జీవనానికి జీవం పోయడానికి. అలా జీవించలేనినాడు, మానవులకు మృగాలకు, వ్యత్యాసమేముంటుంది చెప్పు?" అన్నాడు కరుణాకరం మెల్లగా నవ్వుతూ.

అన్నయ్య మాటలు వ్యంగ్యంగా తన తండ్రిని విమర్శిస్తూ వున్నట్టున్నా, సందర్భానుసారంగా యెంతో సమంజసంగా తోచాయి జానకికి. ఆమె కళ్ళు ఆనంద బాష్పాలతో చెమ్మగిల్లాయి.

"నువ్వెంత సహృదయుడివి. అందుకే భగవంతుడు నీకు సర్వదా అండగా నుంచుం

కాడు. మా నాన్న నీమీద కక్ష సాధించాలనుకున్నా. తను ఆశించినట్టు జరగలేదు. చివరికి ఆయన సాధించిందేవిఁటి? కన్నుమూశారు. ఆయన నాకు తండ్రే. అయితే నేం—ఆయన పట్టుదలను మాత్రం నే నెప్పుడూ హర్షించలేదు'' అంది.

' పోనీలేవమ్మా జానకీ! మీ రిద్దరూ ఒక కడుపున పుట్టకపోయినా భావాలుమాత్రం ఒకేలా వుండటం హర్షదాయకం. వాడికి చెల్లెలులేని లోటు తీరింది ' అంది కాంతమ్మ ఆనందం వ్యక్తపడుతుంటే.

''అంతేకాదు పిన్నీ! నాకు అన్నయ్యలేని లోటు తీరింది'' అంది జానకి ఉత్సాహంగా.

కరుణాకరం మురిసిపోయాడు. నిజంగానే తనకి చెల్లెలులేని లోటు తీరింది. జానకి చిన్నప్పట్నుంచీ, తనని స్వంత అన్నయ్యలానే భావిస్తూ వస్తోంది కూడాను. ఇంత వరకూ పరిస్థితులు ఏదో విధంగా చక్కబడుతూ వచ్చాయి. కాని, ఒక్కటే సమస్యగా మిగిలింది. అన్ని విధాలా నిశ్చయమైన ఆమె వివాహం ఆగిపోవడం అతణ్ణి బాధించింది.

''సరేగాని జానకీ! నాదో అభ్యర్థన వుందమ్మా! నువ్వు బాధపడనంటే చెబుతాను'' అన్నాడు.

జానకి ఆశ్చర్యపోతూ అన్నయ్య మొహంలోకి చూసింది. తనని కలవరపరిచే ఆ విషయం ఏమిటైవుంటుందో ఆమెకి అనూహ్యమయ్యింది. కాస్తంత కంగారు కూడా కలిగింది.

''ఏవిఁటన్నయ్యా అది? చెప్పు... నా కేవిఁటో కంగారుగా ఉంది....'' ఆతృతతో అంది.

''మరేంకాదమ్మా! బాబాయ్ నీ పెళ్ళి ప్రయత్నాలు చేసి, అన్నీ నిశ్చయమయ్యే సమయం ఆసన్నమయ్యేసరికి హఠాత్తుగా కళ్ళు మూశారు. బహుశా ఆయన ఆత్మ మిగిలిపోయిన ఈ బాధ్యతను తలచుకుంటూ ఎంతగా పరితపిస్తుందో ఎవరికి తెలుసు? మొన్ననే ఆ పెళ్ళివారు ఓ ఉత్తరం రాశారు కూడాను. నిశ్చయమైవున్న సంబంధాన్ని ఎందుకు వృధాగా పోగొట్టుకోవడం? నువ్వు అన్యధా భావించకుండా నన్ను అపార్థం చేసుకోకుండా నీ సమ్మతిని వ్యక్తపరిస్తే నేను మిగతా ప్రయత్నాలన్నీ చేస్తానమ్మా!'' అన్నాడు.

కరుణాకరం అలా అనేశాడేగాని, ఒకప్రక్క అతనికి సందేహంగానే వుంది. జానకి తనని అపార్థం చేసుకుంటుందేమోనని. అయితే, ఆ సంబంధాన్ని వదులుకోవడం ఇష్టంలేక, ఆమె ఆలోచనలు ఎప్పుడూ తండ్రిని గుర్తుచేసుకోకుండా మళ్ళించడం కోసం ధైర్యంచేసి అడిగాడు.

జానకికి, తండ్రి జ్ఞప్తికిరాగానే, మళ్ళీ దుఃఖం పొంగి పొర్లింది. ఆమె కను కొనల్లో అశ్రువులు గూడుకట్టుకొని గిర్రున తిరుగుతూ ఉండటం, గమనించాడు కరుణాకరం. అతను నిజంగానే కంగారుపడ్డాడు. తను తొందరపడలేదు కదా అని పించింది.

''అదిగో, అందుకే ముందుగా, బాధపడొద్దని కోరాను జానకీ! నువ్వేదో నాకు బరువుగా ఉన్నావని, అందుకే యీ ప్రయత్నం చేస్తున్నానని నువ్వు ఒకవేళ అను కుంటే, అది పొరపాటే అవుతుంది. భగవత్సాక్షిగా చెబుతున్నాను. అటువంటి అభి ప్రాయం నాకేమీలేదు. ఈ వివాహంవల్ల, నువ్వు మీ నాన్నను క్రమంగా మర్చిపోయి ఆ ఆవేదనకు దూరమై కొత్త వాతావరణంలో పడే అవకాశం కూడా వుంటుంది. ఆలోచించు. నా మనస్తత్వాన్ని మనస్సులో పెట్టుకొని మరీ ఆలోచించు.''

కాంతమ్మ పరిస్థితిని అవగాహన చేసుకుంది. చప్పున కలిగించుకుంది.

''ఔనమ్మా జానకీ! పోయిన వాళ్ళకోసం మనం ఎంత పరితపించినా వాళ్ళు తిరిగి రారు. కనీసం వాళ్ళు పరలోకంలో మనశ్శాంతిని పొందే అవకాశాన్నయినా కలిగిం చడం మన కర్తవ్యం. మీ నాన్నగారు నిశ్చయించిన యీ సంబంధం చేసుకుంటే అదే ఆయన ఆత్మకు తృప్తి. కాదనకమ్మా! స్త్రీ అయి పుట్టాక, ఎప్పుడో ఒకనాడు అత్తారింటికి వెళ్ళాల్సిందేకదా?'' అంటూ నచ్చజెప్పడానికి ప్రయత్నించింది.

జానకి, క్షణం యోచించింది. వివాహంపట్ల, ఆమెకో నిశ్చయమైన అభిప్రాయం లేదు అందుకే, ప్రత్యేకించి తన అభిమతం చెప్పడం ఇష్టంలేకపోయింది. అసలు అభిమతమన్నది వుంటేగా?

''మీ యిష్టం పిన్నీ! అన్నయ్యా, నువ్వూ, ఏం నిశ్చయించినా అందుకు నేను బద్ధురాలనే'' అంది, మెల్లగా.

''ఇది బలవంతమని అనుకోకమ్మా జానకీ? నువ్వు మనస్ఫూర్తిగా అంగీక రిస్తేనే, నేనీ ప్రయత్నంలోకి దిగుతాను. లేదంటే నిశ్చింతగా వూరుకుంటాను'' మళ్ళీ అన్నాడు కరుణాకరం.

''అలా నే ననుకోవడం లేదన్నయ్యా! ఈ సంబంధం విషయమై, నా అంగీ కారాన్ని అప్పట్లోనే నాన్నకు తెలియజేశాను కూడా'' అంటూ చెప్పేసి, లోపలికి వెళ్ళిపోయింది జానకి.

తృప్తిగా నిట్టూర్చాడు కరుణాకరం. చెల్లాయి మనస్తత్వం అతన్నెంతో ఆహ్లాద పర్చింది. కాంతమ్మ కొడుక్కేసి చూసి, ముసిముసి నవ్వుతూ లోపలికి వెళ్ళి పోయింది. కరుణాకరం హుషారుగా బైటికి నడిచాడు.




# 7

జానకి వివాహం. యేమంత ఆర్భాటం లేకుండానే జరిగిపోయింది. వరుడు నెల్లూరులో బ్యాంకు ఉద్యోగి. జానకి, అత్తారింటికి వెళ్ళిపోయింది ఆమె వెంట ఆనవాయితీ ప్రకారం వెళ్ళవలసిన ముత్తయిదువు ఎవ్వరూ లేకపోవడంవల్ల. పద్ధతికాకపోయినా, తప్పనిసరిగా కరుణాకరమే వెళ్ళి వచ్చాడు. అక్కణ్ణించి తిరిగి బైలుదేరిన రోజు. వరుడు సుదర్శనం రెండుచేతులూ పట్టుకుని. చెప్పాడు,

"వస్తానండీ బావగారూ! జానకి, నా స్వంత సోదరి కాకపోయినా, అంతటి అనుబంధం మాలో యేర్పడింది. ఈమె ఒక విధంగా దైవోపహతురాలు. తలిదండ్రుల్ని పోగొట్టుకుంది, తోబుట్టువులు కరువయ్యారు. ఈ విశాల విశ్వంలో ఆమె 'నా' అని చెప్పుకోడానికి నేనే వున్నాను. అటువంటి జానకిని ఇక్కడ విడిచి వెళ్ళడానికి నా కెంతో బాధగావుంది. కాని, ఏం చెయ్యను? ఏనాడైతే వివాహమయ్యిందో, అప్పట్నుంచీ ఆమె పరాయివ్యక్తే. ఇంక మీరే ఆమెకి తల్లీ, తండ్రీ, భర్తాను. ఇంతకంటే నేనేమీ చెప్పలేను ..." అన్నాడు. చివరిలో అతని గొంతు కాస్తంత జీరవోయింది కళ్ళు చెమ్మగిల్లితే చేతిరుమాలుతో ఒత్తుకున్నాడు.

సుదర్శనం, సంస్కారంగల వ్యక్తి. సహృదయుడు. కరుణాకరం మాటలు అతణ్ణి కదిలించేశాయి.

''మీరేం బాధపడకండి బావగారూ! జానకికి, ఈ ఇంట్లో ఏ ఇబ్బందీరాదు. ఆ హామీ నేనిస్తున్నాను'' అన్నాడు సుదర్శనం.

కరుణాకరం తృప్తిగా నిట్టూర్చాడు, చెల్లాయికేసి చూశాడు. ఆప్తులు దూరమౌతూ వుంటే, ఎంత ఆవేదన కలుగుతుందో అప్పుడతనికి అర్థమయ్యిందేమో!

''వస్తానమ్మా చెల్లాయ్. ఉత్తరాలు రాస్తూవుండు. ఎప్పుడు నీకు అక్కడికి రావాలనున్నా నిస్సంకోచంగా నాకు తెలియజెయ్యి. నేను స్వయంగా వచ్చి నిన్ను తీసుకువెళ్తాను. లేదా బావగారూ, నువ్వూ కలిసివస్తే అది మా అదృష్టంగా భావిస్తాం.''

''అలాగేలే అన్నయ్యా! వెళ్లిరా! పిన్నికి నమస్కారాలు చెప్పు.'' కంటతడి బెట్టుకుంటూ అంది జానకి. ఎంత గుండెదిటవు పరుచుకోవాలన్నా, కన్నీరు ఆగితేగా!

కరుణాకరం వెళ్ళి రిక్షాలో కూర్చున్నాడు. రిక్షా కదిలిపోయింది. రిక్షా కనుచూపుమేర వెళ్లేవరకూ, జానకి చూస్తూనే వుంది.

* * *

జానకి కొన్నాళ్ళపాటు తమ ఇంట్లో కలివిడిగా మసలి ఉండటంవల్ల, యిప్పుడామె లేని లోటు, కాంతమ్మకి యెంతో బాధ కలిగించింది.

''ఈ మధ్య లక్ష్మిలా ఇంట్లో మసలిన జానకి, లేకపోవడంతో, మనయిల్లు ఎంత చిన్నబోయిందో చూడరా కరుణా!'' అంది కాంతమ్మ, ఓ రోజు అనుభూతి మరీ బలీయంగా కలగడంతో.

''నిజమేనమ్మా! నాకూ అట్లానే అనిపిస్తోంది. చెల్లాయి ఉన్నన్నాళ్ళూ మన ఇల్లు ఎంత కలకలలాడుతూ ఉండేదని!'' అన్నాడు కరుణాకరం.

''ఆడపిల్లలు ఇంట్లో మసలుతూవుంటే అలానే అనిపిస్తుందిరా! అందుకే ఆడపిల్లల్ని 'లక్ష్మి' అంటారు. ఒరే అబ్బాయ్! నీతో ఓ విషయం చెప్పాలని ఎన్నాళ్ళనించో అనుకుంటున్నానా!'' మందహాసం తొణికిసలాడుతూవుంటే అంది కాంతమ్మ.

''ఏవిటమ్మా!'' ఆ విషయమేవిటో తెలుసుకోవాలన్న ఆసక్తి, అతనికీ కలిగింది మరి!

''కన్నతల్లి ఏం కోరుకుంటుందో ఆలోచించు, తన కొడుకు, ఓ ఇంటివాడై, ఆ దంపతులు చిలకా గోరింకల్లా హాయిగా తిరుగుతూ వుండటం కళ్ళారా చూడ్డం, చూసి యీ జీవితానికి ఆ ఆనందం చాలనిపించుకోవడం, కోరుకుంటుంది. ఔనా మరి!''

అంటూ ప్రశ్నార్థకంగా, కొడుకు మొహంలోకి చూసిందామె.

కరుణాకరంకి, తల్లి అభిమతం సుళువుగా అవగాహన అయ్యింది.

''అంటే?....'' నన్ను పెళ్ళి చేసుకోమంటావు. అంతేకదమ్మా!'' చిలిపిగా అన్నాడు.

''ఔన్రా! జానకి పెళ్ళితోపాటే, నీ పెళ్ళి ఎందుకు నిశ్చయించలేదా అని ఇప్పుడు విచారిస్తున్నాను. ఈ వయస్సులో నేనీ కోరిక కోరడం అసహజం కాదనుకుంటాను నా కోరికను, నువ్వు నిరాకరించవన్న విశ్వాసం కూడా నాకుంది.'' ముందుగానే కాళ్ళకు బంధాలు వేసినట్టుగా తన నమ్మికను కూడా వ్యక్తపరిచింది.

''ఇప్పుడేం తొందరొచ్చిందిలే అమ్మా!'' అని మాత్రమే అనగలిగాడు, కరుణాకరం, ఒకప్రక్క ఇంటి పనిపాటల్లో అమ్మ కష్టపడిపోతుందన్న భావనవున్నా.

బైట స్కూటర్ ఆగిన చప్పుడు, సుందరం పిలుపు ఒకేసారి వినిపించేసరికి, ఒక్క వుదుటున కరుణాకరం వెలుపలికి వచ్చి, సుందరంని యింట్లోపలికి తీసుకొచ్చాడు.

''రా నాయనా సుందరం.'' ఆప్యాయంగా ఆహ్వానించింది కాంతమ్మ ''కూచో.''

సుందరం, తమని విషమస్థితిలో ఆదుకున్నాడన్న కృతజ్ఞత కాంతమ్మలో పరిపూర్ణంగా వుంది. అందుకనే వయసులో పిన్నవాడయినా, అతడంటే ఆమెకి ఎనలేని గౌరవభావం వుంది.

సుందరం కూచున్నాడు.

''ఏవిఁటి పిన్నీ, ఇంట్లో కూచుని, కరుణ ఏం కబుర్లు చెబుతున్నాడేవిఁటి?'' నవ్వుతూ అన్నాడు సుందరం.

''ఏ వంటాడు నాయనా! పెళ్ళి చేసుకోరా అంటే ఇప్పుడేం తొందరంటాడు. ఈ ముసిలికాలంలో నా వంటిదానికి ఇంతకంటే మరోకోరిక యేముంటుంది చెప్పు? కళ్ళు మూసే ముందు కొడుకు కోడలు, ఇంట్లో సందడిగ మసులుతూవుంటే, చూసి ఆనందించడంకంటే యింకేం కావాలి?''

సుందరం, ఆమె అభిప్రాయంతో ఏకీభవించాడు,

''ఔనోయ్ కరుణా! అమ్మ చెప్పింది నిజం. నీ కింకా పెళ్ళీడు రాలేదని భ్రమపడుతున్నావా? 'ఇప్పుడేం తొందర్లే' అనడం ఇప్పుడో ఫాషన్ అయిపోయిందోయ్.''

''అక్కడికి నువ్వేమీ అనకుండా పెద్దలు అడిగిందే తడవుగా 'వూఁ' కొట్టినట్టు చెబుతావేం?'' నవ్వుతూ స్నేహితుడికేసి చూశాడు కరుణాకరం.

సుందరం నవ్వేశాడు.

"అఫ్‌కోర్స్। అలా అనడం ప్రధమంలో అందరికీ పరిపాటనుకో। అయినా ఒకసారి అనేశావుగా। ఇక అంగీకరించు మరి। ఇంతవరకూ సంబంధాలేవీ చూశ్చేద పిన్నీ?" కరుణాకరం అభిప్రాయంకోసం ఆగకుండానే ముందుకు సాగిపోతున్నాడు సుందరం.

"లేదు బాబూ। ఒకటి, రెండు సంబంధాలొచ్చాయి. మా వాడు అంగీకారం తెలుపకుండా నే నెట్లా మాటిస్తాను।" అంది కాంతమ్మ.

"సరేలే పిన్నీ। ఆ విషయం నాకు విడిచిపెట్టేయండి. కరుణకి తగిన సంబంధాన్ని నేను చూస్తాను. తెనాలిలో మా బంధువుల అమ్మాయి వుందిలే. ఆ అమ్మాయికి ఏదేనా సంబంధం చూడమని వాళ్ళ నాన్నగారు రెండు ఉత్తరాలు రాశారు. అమ్మాయి చక్కగా చందనపు బొమ్మల్లే వుంటుంది. స్కూలుఫైనల్‌వరకూ చదివిందట. సంగీతంలో ప్రవేశం వుందట...." అంటూ ఫుల్‌స్టాప్ లేకుండా ఏకరువు పెడుతున్న సుందరం వాగ్ధాటికి అడ్డుతగిలాడు కరుణాకరం.

"అక్కడితో ఆపవయ్యా మహానుభావా। వధువుకి తప్పనిసరిగా యీ అర్హతలన్నీ వుండాలని అలా చెప్పుకుపోతున్నావా యేవిఁటి?" నవ్వుతూ అన్నాడు.

"బానోయ్। ఈ రోజుల్లో యీ అర్హతల్ని చూడనివాళ్ళు, కనీసం అడిగి తెలుసుకోనివాళ్ళు తక్కువ పాళ్ళలో వుంటారు. అందుకే నేను ముందుగా చెప్పేస్తున్నాను. వరుడు పెద్ద చదువేమీ చదువుకోకపోయినా, అతడో స్కూలుఫైనల్ గ్రాడ్యుయేట్ అయినా, భార్య మాత్రం స్కూలుఫైనల్ చదివుండాలి. అతడు అందంగా లేకపోయినా కాబోయే భర్తమాత్రం అందచందాల్లో రంభా, ఊర్వశుల్ని మించి వుండాలి. అతడికి సంగీతంలో ప్రాధమిక పరిజ్ఞానం లేకపోయినా, చక్కగా పాడగలిగే భార్య కావాలి. ఇలా చెప్పుకుపోవాలంటే, ఇంకెన్నో ఉన్నాయి...."

"సరేలే। ఎవరికే కోరికలున్నా నాకు మాత్రం యిన్ని కోరికలు లేవు. మా అమ్మకి నచ్చితే నాకు నచ్చినట్టే అనుకో।" తన అభిమతాన్ని వెల్లడి చేశాడు కరుణాకరం.

"అయితే మరింకేం? సమస్యే లేదింక. ఇంక ఆలోచించడమేవిఁటి పిన్నీ? ప్రయత్నం కొనసాగిస్తే సరి."

"అదేదో నువ్వే ప్రారంభించు బాబూ। ఉద్యోగ విషయంలో పుణ్యంగట్టుకున్నావు. వాణ్ణో ఇంటివాణ్ణి చేసి, మిగిలిన ఆ బాధ్యత కూడా తీర్చుకోమరి" నవ్వుతూ అంది కాంతమ్మ.

"ఇప్పుడు చెప్పారుగా పిన్నీ ఇక నా ప్రయత్నం నేను చేస్తాను. అవసరమైతే మనం ఓ సారి వెళ్దాం."




"అంతదూరం వెళ్ళిరావడమంటే యీ వయస్సులో నాకు సాధ్యంకాదు బాబూ! ఎలాగూ బంధువులే అంటున్నావు గబట్టి, మీ యింటికి రప్పించకూడదూ?"

'సరేపిన్నీ! ఉత్తరం రాస్తాను. ఏమోయ్ కరుణా, చూశావా ప్రయత్నాలు ఎంత చకచకా పరుగెడుతున్నాయో! అరే! అదేవిఁటి? అంత సిగ్గుపడిపోతున్నావు?" కరుణాకరంకేసి చూస్తూ పరిహాస మాడాడు సుందరం.

"సిగ్గుదేవికిగానీ పద ఆలా వెళ్దాం...." లేచాడు కరుణాకరం.

"వస్తాము పిన్నీ మరి!" అన్నాడు సుందరం తనూలేస్తూ.

"కూచో బాబూ! కాఫీ తీసుకుని పోదువుగాని...."

"అబ్బే! ఇప్పుడేమీ వద్దులే పిన్నీ! ఈ సారి వచ్చినప్పుడు కాదనకుండా తీసుకుంటాన్లే"

"ఆ విషయం మర్చిపోవద్దు బాబూ!" హెచ్చరించిందోసారి కాంతమ్మ.

"మర్చిపోవడమేవిఁటి పిన్నీ! ఇందులో నా బాధ్యత కూడా వుందిగా? రేపే ఉత్తరం రాసి పడేస్తాను."

సుందరం, కరుణాకరం బైటికి నిష్క్రమించారు. కాంతమ్మ తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచింది. ఆమె హృదయం ఆనందంతో నిండిపోయింది. తన కొడుకు ఓ ఇంటివాడవుతాడని లక్ష్మిలాంటి కోడలు తమ ఇంట్లో తారాడుతుందని ఏవేవో వూహించుకుని తన్మయత్వం పొందింది.

# 8

సుందరం రాసిన ఉత్తరం అందుకున్న తక్షణమే, కూతురు సుజాతను తోడ్కొని వచ్చేశాడు గంగాధరం. సుందరం పట్ల అతనికి గల గౌరవభావానికి యిదో తార్కాణమనుకోవచ్చు.

నిజంగానే, సుజాత అందమైంది. అయితే ఆమె మొహంలో ఎప్పుడోగాని సహజంగా చిరునవ్వు కనిపించదు. చాలా గంభీరంగా ఉంటుంది. ఈ గంభీరత, ఆమె అందంలో కొంత భాగాన్ని మరుగుపరుస్తుందేమోననిపించినా ఆశ్చర్యం వుండదు. ఆమెకి ఇది పుట్టుకతో వచ్చిన మనస్తత్వమే అయ్యుంటొచ్చును మరి।

కాంతమ్మ సుజాతను చూడ్డంతోనే సంబంధాన్ని ఖాయంచేసుకుంది. గంగాధరంకి తన తరఫునించి అభ్యంతరం లేకపోయింది. పరస్పరం అంగీకారాలు కుదిరాయి. సంబంధం ఖాయమయ్యింది

ఓ శుభముహూర్తాన కరుణాకరం, సుజాతల వివాహం జరిగిపోయింది. ఇందులో సుందరమే ప్రముఖ పాత్ర వహించి, యేర్పాట్లన్నీ సక్రమంగా సాగేట్టు చూశాడు. కాంతమ్మ కోరిక నెరవేరింది. ఆమె కలలు ఫలించాయి. ఇప్పుడా ఇంట్లో గృహలక్ష్మిలా సుజాత కలకలలాడుతూ తిరుగుతోంది. ఎంతో మురిసిపోయింది కాంతమ్మ.

సుజాత మనస్తత్వంలో, ఓ ప్రత్యేకత ఉంది. ఆమె పుట్టింది సంపన్నుల కుటుంబంలో కాకపోయినా, ఆమె భావనమాత్రం అందుకు భిన్నంగా ఉంటుంది. చదివింది స్కూలుఫైనల్‌వరకే అయినా, తనో డిగ్రీ పుచ్చుకున్న వ్యక్తిలా కబుర్లు చెబుతుంది. వేష భాషల్లో అధునాతనంగా వుండాలన్న తాపత్రయం ఆమెలో ఉన్నట్టు ఇట్టే గ్రహించవచ్చు ఎవరైనాను.

ఎదుటివారితో తమని పోల్చి చూసుకోవడం. తైపారువేసుకోవడం, కొందరికి అలవాటు. ఆ అలవాటు సుజాతకీ వుంది. ఒకరికంటే తను యెందులోనూ కనిష్టంగా వుండకూడదన్న భావం, ఆమెలో నిబిడీకృతమై వుంది. అలా ఉండకుండా ఉండడానికి అవసరమైన వాతావరణాన్ని ఏర్పరుచుకుందుకు ప్రయత్నించడం ఆమెకి పరిపాటయ్యింది.

సుజాతా, సుమతి ఇంటికి రెండు మూడుసార్లు వెళ్ళొచ్చింది. సహజగుణం పోగొట్టుకోవడం, కష్టం కదూ? తన సంసారాన్ని సుమతి సంసారంతో ఓసారి త్రైపారువేసి చూసుకుంది మనోభావనలో. వాళ్ళకీ తమకీ, యెక్కడా సామ్యం లేదని పించింది. వాళ్ళింట్లో గ్రాడ్రెజ్ అలమారాలు, సోఫాసెట్లు, ఖరీదైన డోర్ కర్టెన్లు, రేడియోగ్రామ్, స్కూటరూ.... ఒకటేమిటి? సినీమాల్లో లక్షాధికారి ఇల్లులా వుంది. ఇక తమ విషయం చూసుకుంటే బట్టలు పెట్టుకోడానికి పాత పెట్టెను తప్పించి, కనీసం కర్ర బీరువా అయినాలేదు. రెండు పాత కుర్చీలు, ఓ పాత సైకిలూ వున్నయ్. ఆమెలో అప్పుడే ఓ విధమైన అసంతృప్తి, నిస్పృహ జనించాయి. తను కలలుగన్న జీవితం ఇది కాదనిపించింది. తన ఆశల రెక్కలు తెగినంతగా నిరుత్సాహ పడింది. అంతేగాని తన వివాహం కోసం తండ్రి యెన్ని ఇక్కట్టులు పడిందీ ఎవరెవర్ని ఆశ్రయించిందీ ఆమెకి అవసరం లేక పోయింది.

* * *

రోజులు ఒక్కొక్కటే గడిచి కాలగర్భంలో కలిసిపోతున్నయ్. సుజాత క్రమంగా వుత్సాహాన్ని కోల్పోతోంది. సాయంకాలపు వేళల్లో కనీసం చల్లగాలిలో తిరిగిరావడాని క్కూడా వీల్లేక పోతున్నందుకు అప్పుడప్పుడూ బాధపడుతూ వుంటుంది. ఎప్పుడూ ఇంటిపనులతో సతమతమైపోతుంటేనే సరిపోతుంది. భర్తకి ఆ దృష్టే లేకపోవడం, ఆమెను మరీ కలవరపర్చింది. ఎప్పుడూ తనొక్కడూ తిరిగిరావడం, వచ్చాక కాస్సేపు ఏదో బొమ్మ గీసుకోవడమూ తప్పించి తనతో సరదాగా కాలక్షేపం చేయడంగాని, అలా చల్లగాలిలో తిరిగివద్దాం రమ్మనిగాని, ఒక్కనాడూ అనలేదు. అది మరీ బాధని పించిందామెకి. ఈవేళ సినిమాకి వెళ్దామండి! ' అంది ఓరోజు ఆయనకి ఏ సరదాలు లేకపోవచ్చునుగాని, తన సరదాలు ఎందుకు మానుకోవాలన్న వుద్దేశంతో చొరవచేసి అంది.

''అలాగే వెళ్దాంలే సుజాతా! నేను ఆఫీసునించి వచ్చేసరికి తయారై వుండు.'' అన్నాడు కరుణాకరం. అప్పుడప్పుడూ అతనికి అనిపిస్తూవుంటుంది. తను సుజాత సరదాలేవీ పట్టించుకోవడం లేదేమోనని. కాని, ఏం చేస్తాడు? ఎన్నో ప్రతిబంధకా లున్నయ్. అవన్నీ యోచించే ఇప్పుడు సుజాత కోరినదే తడవుగా కాదనకుండా సరే నన్నాడు.

సుజాత చెప్పలేనంత సంబరంతో అయిదు గంటలకే ముస్తాబై భర్తకోసం ఎదురు తెన్నులు చూస్తోంది. ఆయన ఇంకేమైనా పనుల ఒత్తిడిలోపడి, రావడం ఆలస్యం చేస్తారేమోనన్న దిగులు ఓ ప్రక్క ఉండనే ఉంది. ఎలాగైతేనేం—ఆ రోజుమాత్రం

కరుణాకరం జాప్యం లేకుండా ఇల్లు చేరుకున్నాడు. ఇరువురూ సరదాగా మాట్లాడు కుంటూ బైలుదేరారు. కాంతమ్మ వాళ్ళిద్దర్నీ చూసి మురిసిపోయింది.

సినీమా చూసి బైటికి వస్తున్నపుడు, సుందరం సుమతికూడా అగుపించారు. వాళ్ళూ సినీమా చూసి బైటికి వచ్చినవాళ్ళే. కరుణాకరం దంపతుల్ని చూసి, సుందరం ఆశ్చర్యం ప్రకటించాడు.

"ఏమిటోయ్ కరుణా! సినీమాకి వస్తున్నట్టు నాతో మాటవరుసకయినా అనలేదే! చెప్పివుంటే బాక్సు రిజర్వుచేసి వుండేవాణ్ణి" అన్నాడు సుందరం సిగరెట్ వెలిగిస్తూ.

కరుణాకరం మెల్లగా మందహాసం చేశాడు.

"నువ్వటువంటివాడివనే నీతో చెప్పలేదు. బాక్సు టిక్కెట్టు కొనుక్కునే తాహతు నాకు వుండొద్దూ?"

"నువ్వు కొనాలా యేమిటి? స్నేహితుడిగా నేను తీసుకువెళ్ళకూడదా?" నవ్వుతూనే అన్నాడు సుందరం.

సుమతి అందుకుంది.

"ఔను సుజాతా! ముందుగా చెప్పివుంటే, అందరమూ ఆ టిక్కెట్లకే పోయుండే వాళ్ళంగా!" ఏదో మాట్లాడాలి గాబట్టి, అలా అందిగాని, తన ఆధిక్యతను వ్యక్తం చేసుకుందుక్కాదు.

సుజాత మొహం వాడిపోయింది. చాలా చిన్నతనమన్పించింది కూడాను. వాళ్ళతోపాటే తామూ ఆ సీట్లలో కూచుంటే యెంత బాగుండేది —అనిపించింది.

"నేనేం చేసేది సుమతీ! మావారి సమర్థన విన్నావుగా! దేనికయినా అదృష్టం వుండాలి మరి!" విస్పృహతో తనేదో అదృష్టాన్ని కోల్పోయినంతగా బాధపడుతూ అంది.

కరుణాకరం భార్యమాటలకు అంతగా బాధపడకపోయినా, పట్టించుకోకండా వుండ లేకపోయాడు.

"విన్నావా సుందరం! ఆడవారి దృష్టిలో ప్రతీదీ ఓ అదృష్టంగానే వుంటుంది. పెద్ద ఉద్యోగి భర్తగా లభించడం ఒక అదృష్టం కారుండటం అదృష్టం. ఖరీదైన చీరలు కొనడం అదృష్టం. చివరికి పెద్దక్లాసు టిక్కెట్టు కొనడంకూడా ఒక అదృష్టమే వాళ్ళకి" నవ్వుతూ అన్నాడు.

సుజాతకి యీ మాటలు చుర్రుమనిపించాయి.

"కార్లూ, ఖరీదైన చీరలు కావాలని యెవరన్నారండీ?" మూతి విగించుకుంది సుజాత. ఆమెలో అప్పుడే అసహనం చెలరేగింది.




సుందరం పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. ఈ చిటపట చినుకులు ఉధృతమై గాలి వానగా మారకూడదనుకున్నాడు.

''సుజాతా! అనవసరంగా వాగ్వివాదం పెంచుకోవద్దు. కరుణమాత్రం యేమన్నా డవి? సహజంగా స్త్రీలకు గల అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడంతే! ఆమాటకొస్తే, అతడి మాటలు మా ఆవిడకీ వర్తిస్తాయి. కారులేదని యెప్పుడూ చెవులు కొరుకుతూ, కారున్నవాళ్ళ అదృష్టాన్ని మెచ్చుకుంటూ వుంటుంది. అంటే ఆ అదృష్టం తనకి లేదని అర్థమేగా! ఈ మాత్రం దానికి అభిమానపడ్డం, ఆవేశం తెచ్చుకోవడం. శ్రేయస్కరం కాదు.'' సుజాత దగ్గరిబంధువు గాబట్టి, చనువుతో మెల్లగా మందలించ గలిగాడు.

సుమతి, చిరునవ్వు నవ్వి వూరుకుందే గాని, తనని విమర్శిస్తున్నారన్న ధ్యాసకు లోబడి, మొహం ముడుచుకోలేదు. ఒక్కో వ్యక్తి మనస్తత్వం ఒక్కోలా వుంటుంది మరి!

సుజాత మాట్లాడలేదు. కరుణాకరం సుందరం మందలింపుకి సంతోషించి లోలోన నవ్వుకున్నాడు.

"మేం వస్తాం సుందరం...." అంటూ తమ యింటికేసి త్రోవతీశాడు కరుణా కరం. సుజాతకూడా సుమతితో చెప్పి బైలుదేరింది.

సుందరం స్కూటర్ కదిలింది. సుమతి వెనుకసీట్లో కూచుంది.

"సుజాతకి బొత్తిగ సహనం లేనట్టుంది సుమతీ!" అన్నాడు సుందరం.

"అవునండీ! అదే నేనూ అనబోతున్నాను. అటువంటి మనస్తత్వం, యింటి సౌభాగ్యానికై తేనేం, సుఖశాంతులకై తేనేం మంచిది కాదు."

సుందరం ఓ నిట్టూర్పు విరిచాడు.

"రానురాను, వాళ్ళిద్దరి మధ్యా యే విధమైన అభిప్రాయభేదాలు రాకుండా వుండా లని నేను మనసారా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను సుమతీ! లేకుంటే కరుణాకరం నన్ను క్షమించడు. అతడి జీవితాన్ని నేనే చేతులారా నాశనం చేసినట్టవుతుంది. స్నేహితుడిగా సహకారానికి బదులు, శాస్తినే అందించినట్టవుతుంది." ఒకవిధమైన భయం అతణ్ణి ఆవరించేసరికి ఆ విధంగా వ్యక్తపరిచాడు.

"ఆబ్బే! అలా యెప్పుడూ జరగదు లెండి. మీరేం భయపడకండి. ఇటువంటి చిన్నవిషయాలు అప్పుడప్పుడూ తటస్థపడుతూ వుంటాయి మరి!" భర్తకి ధైర్యం చెప్పింది సుమతి.

అయితే, సుందరం మాత్రం అంత నిబ్బరంతో వుండలేకపోయాడు. ఓ నిశ్వాసం వదిలాడు.

"సరే? చూద్దాం" అని మాత్రం అనగలిగాడు.

ఇల్లు దగ్గరపడింది....స్కూటర్ వేగం తగ్గింది.

# 9

కరుణాకరం నీటిరంగులతో ఓ చిత్రాన్ని రూపొందిస్తున్నాడు. మూడురోజుల్నించీ ఆ చిత్రమే గీస్తున్నాడు గాని పూర్తికాలేదు. అందులో ఓ మేడ, దానికి అభి ముఖంగా ఓ చిన్నకొంప వున్నయ్. మేడ ఔన్నత్యం, చిన్నకొంప పేదరికం, ప్రతీ చోటా ప్రస్ఫుటమయ్యేలా చిత్రిస్తున్నాడు. లాస్ట్ టచెస్ యిచ్చేసి, ఆరోజే దాన్ని పూర్తిచేశాడు. శీర్షిక 'అంతస్తులు' అని పెట్టాడు. క్షణంసేపు దాన్ని చూస్తూ తన్మయత పొందుతూన్న తరుణంలో, సుజాత దగ్గరగావచ్చి చిత్రాన్ని చూసింది. ఆమెకి చిత్రకళలో ప్రవేశమేమీ లేదుగాని, కనీసం అభినందించే సహృదయమూ లేదు. ఆ అభిరుచి స్త్రీ అందరికీ వుండదు. భగవంతుని సృష్టి చాలా విచిత్రమైంది. శ్రావ్యంగా పాడగల స్త్రీకి, సంగీతమంటే కనీసం మృదుమధుర గానమంటే మోజు

పడే భర్త లభించడం దుర్లభం. నటనలో ఒక స్థాయిని అందుకుని, సర్వుల అభిమానాన్నీ సంపాదించే భర్తను చూసి మురిసిపోయి గర్వించే మనస్తత్వం కొందరు భార్యల్లో వుండదు. అది కేవలం వారి అజ్ఞానమే కావచ్చు. ఒక్కొకప్పుడు నటనకు స్వస్తిచెప్పమని బలవంతం చేసే భార్యలూ వుండొచ్చు. ఆ కోవకు చెందిన వ్యక్తే సుజాత. చిత్రకళతో భర్తకు గల అభిరుచిని ఆమె పంచుకోలేకపోయింది. ఆయన అనవసరంగా కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నట్టు భావించింది.

''ఎలా వుంది సుజాతా ?' అన్నాడు కరుణాకరం, భార్యకేసి మందహాసంతో చూస్తూ. తను వేసిన చిత్రాల్ని చూసి, యింతవరకూ యే ఒక్కటీ బాగుందని అనలేదామె అయినా సరే, యీ ఒక్క చిత్రంపై అతనికి గల ప్రగాఢ విశ్వాసం, అతని చేత మళ్లీ ఆ ప్రశ్న వేయించింది.

సుజాత పెదవి విరిచింది.

''ఏం బొమ్మలో పోనిద్దురూ ! ఎందుకిలా పిచ్చిగీతలు గీస్తూ కూచుంటారో, నాకు బోధపడదండీ! ఇలా వ్యర్థంచేస్తున్న కాలాన్ని, యే ట్యూషన్లు చెప్పటానికో వినియోగిస్తే, కొద్దో గొప్పో, ఆర్థికసహాయం పొందవచ్చు'' అంది నిరుత్సాహంగా,

భార్య మాటలు ఆశ్చర్యాన్ని గాని, కోపంగాని కలిగించలేదు కరుణాకరంకి. ఒకర్ని ప్రోత్సహించే మనస్తత్వం ఆమెది కాదని, యెప్పుడో తెలుసుకున్నాడు గనుక నిరుత్సాహపడలేదు.

''మనం చేసే ప్రతీ పనికీ, ఆర్థికప్రయోజనం దృష్టిలో పెట్టుకోవడం, మంచిది కాదు సుజాతా ! అలాగని నేను కేవలం ఆనందంకోసమే వేస్తున్నానని అనుకోకు. ఏ పత్రికకో పంపితే, వాళ్లు తృణమో పణమో ముట్టజెప్తారు. దానికి తోడుగా లలిత కళల్ని పోషిస్తున్నామన్న ఆత్మతృప్తి వుంటుంది కూడాను.''

''చివరికి ఆ తృప్తే మిగుల్తుంది లెండి మనకి. అదే మనకి చాలుననుకుని మురిసిపోతే యెట్లా ? పత్రికలవాళ్ళిచ్చే అయిదూ, పదులతో మన అవసరాలు తీరిపోతాయంటారా ? నలుగురొస్తే కూచోడానికి, మనింట్లో ఓ సోఫా సెట్టయినా లేదు. ఓ స్టీలు ఆల్మైరా కొనుక్కుంటే బాగనిపిస్తుందండీ ! అసలు, మనింట్లో ఫర్నిచర్ యేముందని ? ఇవన్నీ యోచించి యికనైనా యీ బొమ్మలు గీయడం మానేసి ట్యూషన్లు చెప్పడానికి ఉపక్రమిస్తే, ఆర్థికంగా మన పరిస్థితి బాగుపడొచ్చు'' అంది సుజాత.

కరుణాకరం మెల్లగా నవ్వేడు.

''అవన్నీ యిప్పుడు మనకి లేకపోతే, నష్టమేమిటి సుజాతా ? మన తాహతుని

అనుసరించి మన అవసరాలు తీర్చుకోవాలి గాని, పెద్దపరుగులు పోకూడదు. అందరూ మేడల్లోనే నివసిస్తామంటే, యిక చిన్నకొంపల్లో వుండేవాళ్ళెవరు? ఎక్కడికక్కడే తృప్తివుండాలి మరి!'' తన మనస్తత్వం యేవిటో, ఆమెకి విశదీకరించి చెప్పినట్టుగా చెప్పాడు.

సుజాతకి, ఆ సమర్థన అంతగా రుచించలేదు. నిజానికి, మనస్తత్వ దృష్ట్యా ఆమె కరుణాకరంకి పూర్తిగ భిన్నం. అందుకనే యేకీభవించడమన్న ప్రసక్తే వుండదు.

''బాగుంది. మీకిప్పుడు నేను చెప్పింది అర్థంకాదు. కుటుంబం పెరిగి, బాధ్యతల బరువు అధికమైనప్పుడు, మీరే విచారిస్తారు నామాట విననందుకు'' పెదవులు విరిస్తూ అంది చిరుకోపంతో.

ఎంతో అనుభవం వున్న వ్యక్తిలా ఆమె చెబుతూవుంటే, నవ్వొచ్చింది కరుణాకరంకి.

''నువ్వు భావించినట్టు, నేనెప్పుడూ విచారించను సుజాతా! ఉన్నదాంతో తృప్తి పొందుతాను. అందుబాటులో లేనిదానికోసం అర్రులు చాచను. అదే నా ధ్యేయం. నా అర్ధాంగివి గాబట్టి, నువ్వుకూడా యిదే మనస్తత్వాన్ని అలవర్చుకుంటే, నేనెంతో అదృష్టవంతుణ్ణనుకుంటాను'' భార్య మనస్తత్వాన్ని మార్చుకోమని గట్టిగా చెప్పకుండా సున్నితంగా యీ విధమైన ఉపదేశం చేశాడు.

అబ్బే! సుజాత అంత సులువుగా మారే మనిషి కాదుగా! ఆమెకి భర్తమాటలు సినీమా సంభాషణల్లా తోచాయేగాని, ఆయన దృక్పధాన్ని తనూ అలవర్చుకోవడం మంచిదన్న జ్ఞానం లేకపోయింది. మాట్లాడకుండా మొహం చిట్లించుకుని, అక్కణ్ణించి నిష్క్రమించింది.

* * *

కరుణాకరం రూపొందించిన రంగుల చిత్రం 'అంతస్తులు' ఓ పత్రికలో ముద్రింపబడింది. ఇంతవరకూ యేవో చిన్నచిన్న చిత్రాలు పడ్డాయిగాని, మంచి చిత్రం పత్రికాముఖంగా రావడం యిదే ప్రథమం. కాంప్లిమెంటరీ కాపీ అందుకుని, అందులోని చిత్రాన్ని చూసిన రోజు, కరుణాకరం ఆనందానికి అవధుల్లేకపోయాయి. తల్లికి చూపించాడు....ఆమె మురిసిపోతూ, తన కొడుకు, యింకా ప్రతిభావంతుడు కావాలని మనస్సులో భగవంతుని ధ్యానించుకుంది. భార్యకు చూపించాడు. ఇప్పటికయినా ఆమె తన ప్రయత్నాన్ని హర్షిస్తుందేమోనన్న అభిప్రాయంతో, ఆసక్తిగ ఆమె మొహంకేసి చూశాడు.

సుజాత యేమంత ఉత్సుకత కనబర్చలేదు, పైగా మొహం ముడుచుకుంది.



"ఆః వీటివల్ల వచ్చేస్తుం దొక అంతస్తు!" అంది వ్యంగ్యధోరణిలో.

కరుణాకరం మనస్సు చివుక్కుమంది.

"అంతస్తు వస్తుందని గాని, లేక అంతస్తు అవసరమని గాని, నేనీ ప్రయత్నం చెయ్యడం లేదు సుజాతా! ఏ కళాకారుడికి అయినా, ప్రచారమన్నది అవసరం. అందుకే యీ నా ప్రయత్నం" అన్నాడు యేదో చెప్పాలి గనుక.

కళ, కాంచనాల గురించి వివరించి చెప్పడం చాలా కష్టం. కళ, కళకోసమే అంటారు కొందరు. కాని, అవకాశాలు వచ్చేవరకే యీ ఆశయాలు. ఆ తర్వాత ఆర్థికప్రయోజనాలు చూసుకోవడమే చాలామంది విషయాల్లో జరుగుతుంది. అందుకే, నిశ్చయమైన ఓ అభిప్రాయాన్ని వెలిబుచ్చలేకపోయాడు, కరుణాకరం కూడాను.

'చెయ్యండి, చెయ్యండి ప్రచారం ...దాంతోనే కడుపు నిండుతుంది. కాంక్షలూ తీరుతాయి" తేలిగ్గా, యెకసక్కెం చేస్తున్నట్టుగా అంది సుజాత

భార్య ధోరణి కరుణాకరంకి యేమాత్రమూ నచ్చలేదు. ఆమె అభినందించకపోతే పోయె! తన అభిమానాన్ని రెచ్చగొట్టడం బావులేదనిపించింది. తనతో ఆమెకి యేకీభావం కుదరడం, యీ జన్మలో సాధ్యం కాదేమోననుకున్నాడు. గట్టిగా ఓ నిశ్వాసం

వదిలాడు.

"మరీ నిరుత్సాహపరిచే ధోరణిలో మాట్లాడ్డం ఏమీ బావులేదు సుజాతా! కాంక్షలు తీరడానికి, కడుపు నిండడానికీ, తమ ఆశయాల్ని వదులుకోవడం అందరికీ సాధ్య పడదు. అది గుర్తుంచుకుంటే చాలా సంతోషం." సీరియస్‌గా మొహంపెట్టి అన్నాడు.

"మొండి వాదన చేసేవాళ్లతో వాదనకి దిగడం నాదే తప్పు...." అంటూ అక్కణ్ణించి చరచరా వెళ్ళిపోయింది వంటగదికేసి.

సుజాత అంత మొండిగా మాట్లాడినందుకు, చాలా బాధపడ్డాడు కరుణాకరం. ఏం చెయ్యడం? ఒక్కొక్కరి మనస్తత్వాన్ని అలా భరించాల్సి వుంటుందేమోనని పరితపించాడు.

* * *

కరుణాకరం 'అంతస్తులు' ముద్రించిన పత్రికవారు యిరవై రూపాయలు పంపించారు. అంత పెద్దమొత్తం ప్రతిఫలం అందుకోవడం అదే ప్రథమం అతనికి. ఆ పైకాన్ని వృధా చెయ్యకుండా, సార్ధకంగ వుండేలా చూడాలనుకున్నాడు. ఆలోచించాడు. 'అంతస్తులు' జ్ఞాపకార్ధం, సుజాతకి ఓ చీర కొని యివ్వాలని నిర్ణయించుకున్నాడు. అదేరోజు బట్టలషాపుకి వెళ్ళి, తనకి నచ్చిన ఓ చీర తీసుకున్నాడు. అది పెద్ద ఖరీదుగలది కాకపోవచ్చు. కాని, తనకి నచ్చింది....భార్యకు బహుమతిగా యిస్తున్నదీను. అతనిలో ఓ విధమైన తృప్తి యేర్పడింది.

ఇల్లు చేరుకున్న తక్షణం సుజాతను కేకేశాడు.

"ఏవిటండీ అది?" భర్త చేతిలోని పేకెట్టు చూసి ఆసక్తితో అడిగింది.

"ఏవిటో చెప్పుకో చూద్దాం " నవ్వుతూ అన్నాడు.

"నేనెలా చెప్పగలను? నాకేం దివ్యదృష్టి వుంది గనుకనా?" అందామె.

'ఆ రోజు పత్రికలో పడిన చిత్రం 'అంతస్తులు' చూశావుగా! దానికి ప్రతిఫలంగా వారు యిరవై రూపాయలు పంపించారు. ఆ పైకాన్ని వృధాగా యింటి ఖర్చుల్లో పడేయటం యిష్టంలేక, జ్ఞాపకార్థం నీకో చీర తీసుకున్నాను" అంటూ పేకెట్టు అందించాడు.

సుజాత పేకెట్టు విప్పి చూసింది.

"ఎంతయ్యిందండీ?"

"సరిగ్గా పందొమ్మిది రూపాయల యాభై పైసలు." ఆమె మొహంకేసి పరికిస్తూనే అన్నాడు.

సుజాత మురిసిపోతుందని ఆశించాడు గాని, అటువంటి అనుభూతే ఆమె మొహంలో పొడజూపక పోయేసరికి విస్తుపోయాడు. నిరుత్సాహంతో నీరుగారి పోయాడు. ఆమెకేసే చూస్తున్నాడు.

"పది రూపాయలకు యేదేనా వుందేమో చూడలేక పోయారటండీ?" అంది వ్యంగ్యధోరణిలో. ఆమె మొహం కందగడ్డలా అయ్యింది.

కరుణాకరం మనస్సు చివుక్కుమంది. అతని ఉత్సాహమంతా మంచుగడ్డలా కరిగి పోయింది. తను యేవిఁట ఆశించాడు? ఏం జరిగింది?....అనుకుంటూ బాధపడ్డాడు.

"ఏవిఁటి సుజాతా నీ మాటలు? వచ్చిన ఆ పైకాన్ని, యీ విధంగా వినియోగించా లనుకున్నాను, వినియోగించాను. నాకు నచ్చిన చీర తీసుకొచ్చాను. ఎప్పుడూ ఖరీదు గల చీరలే తీసుకోగలమా?" అన్నాడు.

"ఆ! అన్నీ ఖరీదైన చీరలే తెచ్చి పడేస్తున్నట్టు చెబుతారేవిఁటండీ? అయినా, నా తెలివి తక్కువతనం కాకపోతే, యీ విషయంలో వాదించడం యేవిటి?" అను కుంటూ వెళ్ళబోయింది, చీర అక్కడే వదిలేసి.

"వెళ్ళిపోతున్నావేవిఁటి సుజాతా! చీర తీసుకుపో!" అన్నాడు తెల్లమొహం వేసి.

ఆగిపోయి వెనక్కి తిరిగింది సుజాత, మొహం ముడుచుకుపోయింది.

"తీసుకెళ్ళక చేసేదేముంది లెండి! తప్పుతుందా మరి? మీరేం తీసుకొస్తే అదే పదివేలనుకుని కళ్ళకద్దుకోవాలి. ఆ విధమైన తృప్తిని అలవర్చుకుంటేనే గాని, వీలు పడదు యీ యింట్లో' అనేసి చీరను తీసుకుని, విసురుగా వెళ్ళిపోయింది.

కరుణాకరం స్తంభించిపోయాడు. మంచికి పోతే చెడు యెదురైనట్టు, తను ఆ చీర తీసుకురావడమే పొరపాటయ్యిందేమో ననుకున్నాడు. ఆలోచనలేవో ఒక్కు మ్మడిగా వచ్చేసరికి తట్టుకోలేక యింటికప్పుకేసి చూస్తూ వుండిపోయాడు క్షణంసేపు.

కాంతమ్మ లోపల్నించి వచ్చింది.

"ఏమయ్యిందిరా అబ్బాయ్? కోడలు యెందుకలా రుసరుసలాడుతూ విసురుగా వచ్చింది?' అంది వస్తూనే.

ఆమెకి అప్పుడప్పుడూ యిదో పెద్ద సమస్యగా తోస్తోంది. వాళ్ళిద్దరూ చిలకా గోరింకల్లా, ఆడుతూ పాడుతూ హాయిగా తిరుగుతూవుంటే చూసి మనసారా ఆనం దించాలనే, ఆమె యెప్పుడూ ఆశిస్తూవుండేది. కాని, అదంతా ఒక ఊహలానే మిగిలి పోయింది.

కరుణాకరం జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అతని ప్రతీ మాటలోనూ బాధ యిమిడివుంది.

కాంతమ్మ బరువుగా నిట్టూర్పు విడిచింది.

''పోనీరా బాబూ! నువ్వేం బాధపడకు. సుజాత మనస్తత్వం నీకు తెలిసిందేగా! కొత్తగా బాధపడ్డం అనవసరమంటాను.'' అంతకంటె యింకేమీ చెప్పలేక, వెనక్కి తిరిగి వెళ్ళిపోబోయింది.

''కాస్త కాఫీ తీసుకురా అమ్మా!'' అన్నాడు కరుణాకరం.

మాతృహృదయం కరిగిపోయింది పగలంతా కష్టపడి యిల్లు చేరుకునే భర్తకి కాఫీ తెచ్చిచ్చే యింగితమైనా లేకపోయినందుకు సుజాతను క్షమించలేకపోయింది. అదీ మనసులోనే. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి భారంగా అడుగులు వేసుకుని వెళ్ళిపోయింది.

రెండు నిమిషాల్లో కాఫీ తెచ్చియిచ్చింది కొడుక్కి. కాఫీ తీసుకుని ఆలోచనల్లో పడ్డాడు కరుణాకరం. సుజాత యెందుకలా మారిపోతోంది? అదే అతనికి ప్రస్తుతం యెదురొక్కొన్న క్లిష్ట ప్రశ్న. తనని కించపర్చడంలో ఆమె ఆంతర్యం యేమిటి? చిత్రకళపట్ల తనకి విముఖత కలిగించడానికా? ఏమో! అయ్యుండొచ్చు. లేకుంటే అంత నిర్లక్ష్యంగా మాట్లాడగలదా? అనుకున్నాడు. నిజంగా అతని సహనాన్ని హర్షించవల్సిందే!

# 10

అందర్నీ ఓ సారి చూసి పోవాలన్న కాంక్షతో వస్తున్నట్టు ఉత్తరం రాసింది జానకి. కాంతమ్మ, కరుణాకరం యెంతో ఆనందించారు. ఆమె చాలా రోజుల తర్వాత వస్తుండటమే ఇందుకు కారణం.

''చెల్లాయి, చాలా రోజుల తర్వాత వస్తోంది సుజాతా! ఆమె రాసిన వుత్తరం చదివావుగా?'' అన్నాడు కరుణాకరం ఆ రోజు భోజనం చేస్తున్నప్పుడు.

''ఆ! చదివానండీ! వచ్చిన వాళ్ళందరికీ చాకిరీ చెయ్యడానికి నేనున్నానుగా? ఎవరైనా వస్తారు.'' అంది విసురుగా.

సాధారణంగా, ఇటువంటి కటువు మాటలు, ఏ ఇంటికోడల్నించీ ఎవ్వరూ ఆశించరేమో! అయితే, సుజాత మనస్తత్వరీత్యా, ఇందులో ఆశ్చర్యంలేదు

కాంతమ్మ, కరుణాకరం, పిస్తుపోయి మొహాలు చూసుకున్నారు పరస్పరం.

''మాట అనేముందు కాస్త ఆలోచించి అనడం మంచిది సుజాతా! జానకి పరాయి మనిషి కాదు. మా చెల్లాయి. అయినా, వాళ్ళువస్తే నువ్వేం చాకిరీ చెయ్యాల్సి వస్తుందో నాకు బోధపడ్డం లేదు. వచ్చిన బంధువుల్ని, అదీ స్నేహితుల్ని ఆదరించడ




మన్నది. చాకిరీ అనిపించుకోదు. అది సంఘ సాంప్రదాయం....'' మెల్లగా మందలించ డానికి ప్రయత్నించాడు కరుణాకరం.

''మరీ తొందరపడి మాట్లాడకమ్మా! మన ఇంటిపనిని మనం చేసుకోవడం తప్పేమీకాదు. చిన్నతనమూకాదు. జానకి స్వయానా నీకు ఆడబడుచు కాకపోయినా, వేలువిడిచిన ఆడబడుచుకదా! ఆడబడుచు ఇంటికిరావడం, మనకు శ్రేయస్కరమమ్మా! అదీగాక వాళ్లొచ్చినా, ఒకటి రెండు రోజులు మినహా యెక్కువరోజు లుండరు. ఆ ఆమాత్రందానికి నీలో ఇటువంటి భావన కలగడం నాకే ఆశ్చర్యం వేస్తోంది. ఎవరు విన్నా హర్షించరు.'' అంది కాంతమ్మ. అంతకంటే కటువుగా మందలించడం ఆమెకి చేతనవ్వలేదు.

ఎదుటివారి మాటల్ని వొంటబట్టించుకునే అలవాటు సుజాతకు లేదు. వీళ్ళిద్దరి మందలింపులు ఆమెను ఇసుమంతయినా మార్చలేకపోయాయి. పైగా వాళ్ళు తనని రాచి రంపాన పెడుతున్నంతగా ఫీలయ్యి ఉక్రోషంతో మొహం చిట్లించుకుంది.

''ఔన్లెండి. మీ రలానే అంటారు. అక్కడికి నేనే చెడ్డదాన్నయినట్టు నలుగురూ

అనుకోవద్దూ? చివరికి ఆ చెడ్డతనమే నాకు మిగుల్తుంది లెండి. ఏది ఎలావున్నా నేను ఇంకెవ్వరికీ చాకిరీ చెయ్యలేను.'' నిష్కర్షగా అనేస్తూ భర్తకేసి తిరిగి ''చాలారోజులై మావాళ్ళింటికి వెళ్ళలేదండీ! నన్ను అక్కడికి పంపించండి....కొద్ది రోజులు వుండి వస్తాను'' అంది.

సుజాత మాటలు, ఆమె మొండితనం, సహనశీలి కరుణాకరంని కూడా రెచ్చ గొట్టాయంటే ఆశ్చర్యం లేదు.

''కాస్త వొంటిమీద తెలివుంచుకొని మాట్లాడు సుజాతా!'' అన్నాడు చిరుకోపంతో.

సుజాత తొణకలేదు.

''తెలివితప్పి మాట్లాడ్డం లేదండీ! పూర్తిస్పృహతోనే చెబుతున్నాను. మీ చెల్లెలు వచ్చేసరికి నేనిక్కడ వుండటం నా కిష్టంలేదు. ఎవరు ఏమనుకున్నా లెక్కచెయ్యను'' మొండిగా అంది మళ్ళీ.

నిజానికి ఆమె అలా అనడానికి ప్రత్యేక కారణమంటూ ఏమీ లేదు. అయితే జానకి అంతస్తు ఆమెను యీర్ష్యతో జ్వలింపజేస్తోంది. తన పెళ్ళి తర్వాత ఓసారి తమ ఇంటికి వచ్చినప్పుడు ఆమె కట్టుకునే చీరలు, కళ్ళకు మిరుమిట్లు గొల్పుతూ వుండేవి. ఆమె ముంజేతికి మెరుస్తుండే రవ్వల గాజులు, మెళ్ళో మంచి ముత్యాలహారం, చేతికి వాచీ. ఇవన్నీ ఇప్పటికీ మర్చిపోలేక పోతోంది సుజాత. ఆమె సమక్షంలో, తను ఎందుకూ కొరగాని వ్యక్తిగా తనని తనే వూహించుకుని కృంగిపోయింది. జానకి తనని ఓ పురుగును చూసినట్టుగా చూస్తోందేమోనని భ్రమపడింది. ఈ కారణాలే ఇప్పుడీవిధమైన పరిస్థితిని సృష్టించి ఉంటాయి.

కరుణాకరం సహనం పూర్తిగా నశించింది. దేనికయినా ఓ హద్దుండాలి మరి! ఆ రోజు తనెంతో ఆప్యాయంతో తీసుకొచ్చిన చీర విషయంలో విరసనగా, వెట కారంగా మాట్లాడినా అతను అంతగా పట్టించుకోలేదు. కాని, ఇప్పుడు అర్థంలేని పట్టుదల వహించడం. అదీ తన తల్లి సమక్షంలోనే నిర్లక్ష్యంగా మాట్లాడ్డం. సహించలేకపోయాడు. అతనికోపం ఒక స్థాయిని అందుకుంది.

''నువ్విక్కడ వుండటమూ, వెళ్ళటమూ, అన్నది నీ ఇష్టంకాదు సుజాతా! ఇక్కడ వుండి తీరాలి. నువ్వు నాకు అర్థాంగివన్న విషయాన్ని విస్మరిస్తున్నావల్లే వుంది'' విసురుగా అన్నాడు.

ఎప్పుడూ కోపం రానివాళ్ళకు కోపంవస్తే అది వింతగా వుండొచ్చుగాని అర్థరహి తంగా వుండదు. అంతేకాదు. ఆ కోపాగ్నిని చల్లార్చడం అతికష్టం. అది గుర్తెం చుకునే కాంతమ్మ భయపడింది. ఈ వాగ్వివాదం పెరిగి పెద్ద తుఫానుని సృష్టించు

తుందేమోనన్న భయంతో చలించి పోయిందామె. అటువంటిదేమీ రాకుండా చూడ్డం తన కర్తవ్యంగా భావించింది.

"అబ్బాయ్ యెందుకురా అనవసరం ఆవేశం తెచ్చుకుంటావు?" ఆ కోపం ఆ క్షణంలో అసహజంకాదని ఆమెకి తెలిసినా కొడుకుని శాంతపర్చడానికే అలా అంది.

"ఆవేశం అనవసరం కాదమ్మా! ఊరుకుంటూంటే మరీ రెచ్చిపోతోంది. లేక పోతే చెల్లాయి వస్తే తను వుండననడమేమిటి? ఏమిటా నిర్లక్ష్యం? పెళ్ళయిన కొత్తలో మా ఓ సారి యిలానే ప్రవర్తించింది...." రుసరుసలాడాడు.

కాంతమ్మ మెల్లగా నిట్టూర్చింది.

"సరేలేరా! నవ్వూరుకో!" అని మెల్లగా మందలించి సుజాతకేసి తిరిగింది. "సుజాతా! నీకో విషయం చెబుతున్నానమ్మా! ఇది ఇప్పుడేకాదు. ఎప్పటికయినా గుర్తుంచుకోవల్సిందే. ఎవరిమీదైనా ద్వేషంగాని, అసూయగాని, నీలో ఏకోశానవున్నా దాన్ని చప్పున బైటపెట్టకమ్మా! ఈ సభ్యతా ప్రపంచంలో కొంత ఇంగితం అవసరం. జానకి రావడం నీకు యిష్టంలేకపోవచ్చు. దానికి కారణాలు నేను అడగను. అయితే నీలా మేం ప్రవర్తించలేం కదమ్మా! మాలో అనుబంధం వుంది. ఆ అనుబంధాన్ని తెంచుకోవడం అంత తేలికకాదు. కోడలుగా యీ ఇంట్లో నీకుగల స్థానాన్ని నువ్వు గుర్తుంచుకోవాలి.' అంది

ఆఖరి వాక్యం సుజాతకు అంకుశంలా తగిలి, బాధించింది. కోపంతో మొహం అరుణకాంతిని పులుముకుంది.

"ఆ విషయాన్ని గుర్తుంచుకోకుండా మాట్లాడానికి నేనేం పల్లెటూరి దానను కాదు అత్తగారూ. ఇహపోతే జానకిపట్ల నాకు అసూయగాని, ద్వేషంగాని, లేదు. అలా ఎవరైనా భావిస్తే, అది వాళ్ళ పొరపాటే అంటాను. మావాళ్ళింటికి వెళ్ళడానికి నాకు బుద్ధి పుట్టింది ...వెళ్తానంటున్నాను. అంతే!" మొహం పక్కకి తిప్పుకుని అనేసింది సుజాత.

"ఆ బుద్ధి యిప్పుడే పుట్టాలా యేమిటి?" ప్రశ్నించాడు కరుణాకరం.

"వాటికీ ఆంక్షలు విధిస్తే సరి! మనసులో ప్రవేశించడం మానుకుంటాయి." తనూ వెటకారపు మాటల్లో తీసిపోదన్నట్టు యెదురు జవాబిచ్చింది.

"మాటకి మాట జవాబివ్వడం మంచిదికాదు సుజాతా! ఆడవానికి ఇంత అహం పనికిరాదు " తీక్షణంగా చూస్తూ అన్నాడు

కాంతమ్మ ఇరకాటన పడింది ఆ వివాదాన్ని అక్కడితో అంతం చెయ్యకపోతే పర్యవసానం బాషండదనపించింది. "అబ్బ! ఏమిట్రా అబ్బాయ్ ఇది? ఎవరో

ఒకరు వెనక్కి తగ్గకపోతే యెట్లా? పోనీ సుజాత వెళ్తానంటోంది కదా తీసుకెళ్ళి దిగవిడిచిరాకూడదూ?'' చివరికి అదే పరిష్కార మార్గంలా తోచిందామెకి. కోడలు మారదని తెలుసుకున్నాక ఆమెలో వచ్చిన మార్పు యిది.

కరుణాకరం తల్లికేసి తెల్లబోయి చూశాడు. ఆమె చప్పున ఆ నిర్ణయానికి రావడం ఆశ్చర్యం కలిగించింది.

''ఏవిటమ్మా నువ్వంటున్నది?'' ఆశ్చర్యంగా అన్నాడు.

''అవున్రా కరుణా! ఈ మనస్పర్ధలు వెర్రితలలు వెయ్యకుండా చూడాలిగాని, పట్టుదలలు పెంచుకుని, మరింత కలుషిత వాతావరణాన్ని సృష్టించుకోవడం శ్రేయస్కరం కాదు. నన్నర్థం చేసుకోరా!''

జీవితం తనకి నేర్పిన పాఠాల్ని దృష్టిలో వుంచుకొని, అందిస్తోన్న సలహాలా వున్నాయామె మాటలు.

కరుణాకరం తల్లిమాటకు యెప్పుడూ యెదురు చెప్పలేదు. అటువంటి సంస్కారం అబ్బింది మొదట్నుంచీను. అందుకే యేమీ అనలేక ఓ నిట్టూర్పు విడిచాడు. సామరస్యపు మనస్తత్వం కొరవడినవారితో పరిష్కారం యిలానే వుంటుంది గామోసు... అనుకున్నాడు.

''సరే సుజాతా! నీ యిష్టమే కానీయ్. రేపే ప్రయాణం కట్టు. మీ నాన్నగారికి టెలిగ్రామ్ యిస్తాను. స్టేషనుకి వస్తారు ..'' అనేసి, విసురుగా బైటికి నడిచాడు.

కాంతమ్మ మరేమీ కలిగించుకోకుండా అక్కణ్ణించి లోపలికి నిష్క్రమించింది. తన పంతం నెగ్గినందుకు లోలోన సంబరపడిపోయింది సుజాత. అంతేగాని, తనపట్ల భర్తలో కలిగిన యేహ్యభావాన్ని ఊహించుకోలేకపోయింది. తాత్కాలిక ప్రయోజనాన్నే దృష్టిలో వుంచుకుంటోంది గాని, శాశ్వతంగా తను యే స్థానాన్ని సంపాదించుకుంటోందో అవగాహన చేసుకోవడం లేదు. పెట్టె సర్దుకుందుకు తన గదికేసి నడిచిందామె.

జానకి ఆధిక్యత తనమీద ప్రసరించదనుకుని తృప్తిజెందింది.

కరుణాకరం ఆ వెళ్ళడం నేరుగా టెలిగ్రాఫ్ ఆఫీసుకు వెళ్ళి, మామగారికి టెలిగ్రామ్ యిచ్చాడు. అక్కణ్ణించి బీచ్‌కి నడిచాడు. అతని మనస్సులోని అశాంతిలా సముద్రకెరటాలు ఒకటే రొద చేస్తున్నాయి. ఒంటరిగా కూచున్న అతని మెదడు నిండా, సుజాతను గురించిన ఆలోచనలే ఆమెతో జీవితాంతం యిల్లాంటి సమస్యల్నే యెదుర్కోవాలా? ఎప్పుడూ ఏదో ఒక సంఘర్షణ వుంటేనేగాని, ఆమెకి సంతృప్తి వుండదేమో మరి! ఆమె మనస్తత్వాన్ని యెలా మార్చడం? ఎంత ఆలోచించినా



పరిష్కారమార్గం ఊహకి అందలేదు. ఆలోచిస్తున్నకొద్దీ అశాంతి పెరుగుతుందే తప్పించి ఒక్కక్షణంపాటు ప్రశాంతంగా కూచోలేకపోయాడు. లేచి యింటికి తిరుగుముఖం పట్టాడు.

ఆరోజు రాత్రి చాలాసేపటివరకూ అతనికి నిద్రపట్టలేదు. ఆ కాలాన్ని వృధాగా పోనివ్వకుండా ఇండియన్ ఇంక్‌తో ఓ చిత్రాన్ని పూర్తిచేశాడు. సముద్రగర్భం యెంత ప్రశాంతంగా వున్నా. ఉపరితలంలో మాత్రం కెరటాలు ఒకదాని వెంబడి మరొకటి వచ్చి అలజడిని కలిగిస్తూనే వుంటాయి. 'కెరటాలు' అన్న శీర్షిక పెట్టాడు. ఆ క్షణంలో ఆ చిత్రాన్ని తన పరిస్థితులకు అన్వయింపజేసుకున్నాడో యేమో మరి!

పన్నెండు కొట్టింది గడియారం. అప్పుడు మంచంమీద మేనువాల్చాడు కరుణాకరం.

## 11

స్త్రీలకు ప్రత్యేకింపబడిన పెట్టెలో, కిటికీదగ్గర కూచుంది సుజాత. కరుణాకరం బైట నుంచున్నాడు. ఇరువురూ మౌనముద్ర దాల్చారు. ఏం మాట్లాడాలో

వారికి అర్థం కాలేదేమో!

గార్డు జండా ఊపడం చూశాడు కరుణాకరం. తను చెప్పాలని నిశ్చయించుకున్న దేదో నాలుగుముక్కల్లో చెప్పేయాలనుకున్నాడు. అంతలోనే ఇంజను కూతకూసింది.

"వెళ్ళొస్తానండీ!" అంది సుజాత.

"మంచిది. వెళ్ళు ఎప్పుడు నీకు రావాలన్న సంకల్పం కలిగితే అప్పుడు రావచ్చు సుజాతా! నేను రమ్మని రాస్తాననిమాత్రం యెదురుచూడకు. ఈ సందర్భంలో మరో మాటకూడా చెప్పదల్చుకున్నాను అణకువను అలవర్చుకుని వచ్చిననాడే నువ్వు మారి నట్టు భావిస్తాను. మీ నాన్నగారు తప్పకుండా స్టేషనుకి వస్తారన్న నమ్మిక వుంది. నువ్వింత హఠాత్తుగ బైలుదేరడానికి కారణం యేమిటో తెలీక ఆయన తికమక పడొచ్చు. నిజం చెప్పేసెయ్. ఇప్పుడు అబద్ధం చెప్పినా, నిజం తెలిసిననాడు నీమీద నమ్మకం పాడవుతుంది, అది గుర్తుంచుకో." మామూలు ధోరణిలో అతను చెప్పినా, ఆ మాటల మాటున నిశితమైన విమర్శ వుందని యిట్టే తెలిసిపోతుంది.

సుజాత అర్థం చేసుకుంది భర్త భావాల్ని. ఆ మాటల వెనుకవున్న తృణీకారం కూడా గ్రహించగలిగింది. ఆమె అభిమానం మరింత దెబ్బతింది.

"మీ మాటలు బాగా గుర్తుంచుకుంటాలెండి' తొణక్కుండా అంది.

రైలు కదిలింది. మెల్లగా వేగాన్ని అందుకుంది కరుణాకరం సుజాత యాంత్రి కంగా చేతులుమాత్రం గాలిలో ఊపుకున్నారు. బండి కనుచూపుమేర దాటినంతవర కయినా ప్లాటుఫారమ్మీద వుండలేదు కరుణాకరం. చరచరా బైటికి నడిచాడు.

సుజాత భారంగా ఓ నిట్టూర్పు విడిచి, ఆలోచనల లోకంలోకి అడుగిడింది తను తొందరపడినటు భావించడం తప్పించి, మిగతా విషయాలన్నీ ఆలోచించసాగింది.

* * *

కరుణాకరం ఆఫీసుకి వెళ్ళడం అరగంట ఆలస్యమయ్యింది. రిజిష్టరులో సంతకం పెడుతూవుంటే, హెడ్‌గుమస్తా అన్నాడు. "మీకోసం మేనేజరుగారు యిప్పుడే కబురు పంపారు. ఇంకా రాలేదని చెప్పాననుకోండి ఓసారి వెళ్ళి కలియండి" అని. ఆ మాటల్లో యేదో వ్యంగ్యం ధ్వనించినట్టుంది.

"సరే లెండి, వెళ్తాను" అంటూ తన సీటుకేసి వెళ్ళబోతూవుంటే ఆయన మళ్ళీ అన్నాడు.

"ఇంకెప్పుడో వెళ్తే యెలా చెప్పండి? మీ రొచ్చాక చెప్పానుకాదని, నన్ను నిందిస్తే నేనేం జవాబు చెప్పను? దయచేసి యిప్పుడే వెళ్ళొచ్చేయండి."

కరుణాకరంకి హెడ్‌గుమస్తా ధోరణి యేమీ నచ్చలేదు. చిరుకోపం వచ్చింది.

అయినా ఏం చెయ్యగలడు? ఇప్పుడంటే సుందరం వున్నాడు మేనేజరుగా. అతడు ఎప్పుడూ ఇక్కడే వుంటాడన్న నమ్మకంలేదు. కాని, తనుమాత్రం యిక్కడే వుండాలి... ఇవన్నీ ఆలోచించి శాంతపడి సుందరం గదికేసి నడిచాడు.

"గుడ్‌మార్నింగ్ సుందరం" అన్నాడు, గదిలోపల అడుగుపెడుతూనే.

"గుడ్‌మార్నింగ్, కూచోవోయ్...."

"రావడం కాస్త ఆలస్యమయ్యింది. కూచుంటే యింక పనిచేసుకోవడమెప్పుడు చెప్పు? ఏవిఁటి సంగతి?" నుంచునే అన్నాడు కరుణాకరం.

"ఇవ్వాళ సుమతి పుట్టినరోజు. సాయంత్రం అలా కాఫీ తీసుకుందుకు నువ్వూ, మీ ఆవిడ వచ్చేయండి. అక్కణ్ణించి సినిమాకి వెళ్దాం." ఉత్సాహంగా అన్నాడు సుందరం.

కరుణాకరం క్షణం బదులు చెప్పలేదు, ఆశ్చర్యపోయాడు సుందరం.

"ఏవిఁటలా ఆలోచనలో పడ్డావు?" అన్నాడు సుందరం,

"అబ్బే! ఏం లేదు. మా ఆవిడ, యివ్వాళే ఊరికెళ్ళిందోయ్...." తడబడకుండా జవాబివ్వడానికి ప్రయత్నించాడు గాని, ఆ జవాబు యెంతో పేలవంగా వుందని కరుణాకరంకి తెలీదు.

సుందరం స్నేహితుడి మొహంకేసి తదేకదృష్టితో పరికించాడు.

"సుజాత యింత హఠాత్తుగా వెళ్ళడమేవిఁటి?"

సుందరం తన మొహంలోకే పరికిస్తూండటం భరించలేక మొహం దించుకున్నాడు కరుణాకరం.

"వాళ్ళ నాన్న ఉత్తరం రాస్తేనూ, హఠాత్తుగా బైలుదేరి వెళ్ళింది" జవాబిచ్చాడు.

సుందరం స్నేహితుడి మాటలు కటికసత్యంగా నమ్మలేదు.

"నువ్వు నిజం చెబుతున్నావన్న నమ్మకం, నాకు కలగడంలేదు కరుణా! నా దగ్గర దాపరికమేవిఁటి చెప్పు? నీకు తెలీదుగాని, యీ క్షణంలో నీ మొహంలో యెన్ని రంగులు మారాయో చెప్పలేను. తట్టుకోలేని బాధ యేదో, నిన్ను తపనలో ముంచివేసినట్టనిపిస్తుంది, చెప్పు ... ' చనువుగా అన్నాడు.

సర్వదా, తన శ్రేయస్సునే కోరే స్నేహితుడు అంత ఆప్యాయతతో అడుగుతూ వుంటే, నిజాన్ని యింకా దాచడానికి ప్రయత్నించడం, అసభ్యంగా తోచింది కరుణాకరంకి. బాధగా ఓ నిశ్వాసం విడిచాడు, జరిగిందంతా క్లుప్తంగా చెప్పి.

"నువ్వెలా నా బాధను గ్రహించగలిగావో అర్థం కావడంలేదు సుందరం" అన్నాడు.

జరిగినదానికి సుందరం విపరీతంగా బాధపడ్డాడు. ఒకప్పుడు తను యే విషయంలో భయపడ్డాడో, అదే యిప్పుడు నిజంగా జరిగింది.... అనుకున్నాడు.

"మొహం మనస్సుకి ప్రతిబింబమని నీకు తెలీదా కరుణా? నీ మొహం యెంత కళావిహీనంగా వుందో, ఒక్కసారి అద్దంలో చూసుకుంటే నీకే అర్థమౌతుంది. మనస్సులో చెలరేగిన తుఫాను మొహాన్ని వికృతంగా మారుస్తుంది. ఈ మార్పేమీ లేకుండా, తుఫానుని మనసులోనే అణచుకోవడం అసాధ్యం. నేను గ్రహించ గలగడానికి యిదే కారణం. నిజం చెప్పాలంటే, యిటువంటి పరిస్థితి యెప్పుడో ఓసారి తటస్థిస్తుందని, నా హృదయాంతరాళంలో యెక్కడో ఓమూల అనిపిస్తూవుండేది. అయితే, అది యింత త్వరగా సంఘటిల్లుతుందని మాత్రం ఊహించుకోలేకపోయాను. ఆమెను పంపించే ముందు, నాతో ఓ మాటగా చెప్పలేకపోయావా? నాలుగు చీవాట్లుపెట్టి, నమ్రత నేర్చుకోమని బుద్ధి చెప్పేవాణ్ణే! ఆమె నాకు పరాయి వ్యక్తి కాదని, నీకూ తెలుసునుగా!"

సుందరం చెప్పినదంతా విని, అదోలా నవ్వేడు కరుణాకరం ఆ నవ్వులో ఎక్కడా జీవంలేదు. "లాభం లేదు సుందరం. చెప్పిన మాటల్ని మనసుకి పట్టించుకునే సహృదయతగాని, సభ్యతగాని, ఆమెలో వుంటే, పరిస్థితి ఇంతమేరకు రాదు. నువ్వేకాదు—ఆమెను సృష్టించిన బ్రహ్మ దిగివచ్చి నచ్చజెప్పడానికి ప్రయత్నించినా సరే, స్వతహాగా పశ్చాత్తప్తురాలై నవాడు తప్పించి, తన తత్వాన్ని మార్చుకోదేమో! అనుభవ పూర్వకంగా నేను తెలుసుకున్న సత్యమిది" ఒక్కోపదం పట్టిపట్టి అన్నాడు కరుణాకరం. ప్రతి పదంలోనూ నిస్పృహ ధ్వనిస్తోంది.

"ఒకవేళ నువ్వామె ప్రయాణానికి అంగీకరించకపోతే?"

"ఔను. ఆ వూహ నాకూ తట్టింది. అయితే, అమ్మ అభిమతం వేరు. మా చెల్లాయి సరదాగా రెండు దినాలు ఇక్కడ వుండి వెళ్ళిపోదామన్న ఆశతో వస్తోంది. అల్లాంటప్పుడు సుజాతను బలవంతంగా అట్టే పెట్టి రోజూ రభసపడ్డ మెందుకనిపించి ఆటంక పర్చలేదు."

సుందరం క్షణం మౌనం వహించాడు. కరుణాకరాన్ని యెదురున్న పరిస్థితిని తానే ఎదుర్కొన్నట్టు ఓసారి వూహించుకుని అనుభూతిని పొంది ఎంతో బాధపడ్డాడు. అతని హృదయం ద్రవించిపోయింది. అతని ఆలోచనలు, సంఘర్షణలకు లోనయ్యాయి. ఇందులో తను ఎంతవరకూ బాధ్యుడు? ఔనుమరి! ఈ వివాహాన్ని ఏర్పరిచింది తనేగా! అయితేమాత్రం తనకేం తెలుసు ఆ అమ్మాయి మనస్తత్వపు లోతులు? ఎంత సమర్థించుకోవాలనుకున్నా కొంతమేరకు కరుణాకరంకి జరిగిన అన్యాయంలో




బాధ్యత తీసుకోవలిసిందే తను.... అనుకున్నాడు. ఓ నిట్టూర్పు విడిచాడు.

''కరుణా! నీ బాధను నే నర్థంచేసుకున్నానోయ్. ఇటువంటి పరిస్థితిలో నువ్వు అశాంతికి గురయ్యావంటే ఆశ్చర్యంలేదు. నువ్వు నిజంగా దురదృష్టవంతుడివే! అయితే ఒక్క విషయాన్ని నువ్వు జ్ఞాపకముంచుకోవాలి. మనుష్యులందరూ ఒకేలా వుండరని, నీకూ తెలుసు. ఒకరిలో జీర్ణించుకున్న సహనం మరొకరిలో వుండక పోవచ్చు. ఒకరిలో పేరుకున్న క్రూరత్వం మరో వ్యక్తిలో కనిపించక పోవచ్చు. నీలో వున్న సహనం, మంచితనం సుజాతకి కొరవడినయ్. అలాగని నీ మంచితనాన్ని కోల్పోయి పట్టుదల వహించడమెందుకు చెప్పు? ఆమె మనస్తత్వాన్ని అర్థం చేసుకున్నావు గనుక ఆమె తెలివిలేమిని క్షమించి మీ చెల్లాయి వచ్చి వెళ్ళేకయినా తీసుకొచ్చేయ్'' అన్నాడు. మనస్పర్థలు యింకా విజృంభించకుండా చూడాలన్న సదుద్దేశంతో.

అయితే, కరుణాకరం స్నేహితుడి మాటలకు కరిగిపోలేదు.

''సుందరం నా మనస్తత్వపు లోతులు నీకు తెలుసు. నా మంచితనం నన్నే వెక్కి

రిస్తుందేమోనన్న భయం పట్టుకుంది. ఆ కారణంవల్లనే యీ పాటి నిబ్బరంతోనైనా వుండగలిగానంటే నువ్వు నాతో యేకీభవిస్తావనుకుంటాను.'' అన్నాడు బాధ పడుతూ.

కరుణాకరం యెంత సహృదయుడైనా, ఎంత సహనశీలి అయినా, ప్రస్తుతానికి స్వాభిమానపుపాళ్ళు అతనిలో అధికమై అతడ్ని తాత్కాలికంగా మార్చిందేమోననిపించింది సుందరానికి.

''సరేలే కరుణా! నువ్వు వెళ్ళొద్దు. గంగాధరంగారికి నేనే వుత్తరం రాస్తాను.'' సానుభూతితో అన్నాడు సుందరం.

''వద్దు సుందరం. వుత్తరమేమీ రాయొద్దు. నేను నీ చేత ఉత్తరం రాయించాననే భావం వారిలో కలగకూడదు.''

''రాసినందువల్ల తప్పులేదు కరుణా! నువ్వే రాయించావని, వాళ్ళెందుకు అనుకోవాలి? విషయాన్ని సమగ్రంగా ఆయన అవగాహన చేసుకుందుకు నా ఉత్తరం తోహదం చేస్తుంది.''

కరుణాకరం మెల్లగా మందహాసం చేశాడు.

''అవగాహన చేసుకుని కూడా ఆయన చేయగలిగింది యేమీ వుండదు సుందరం. ఆ ఇంట్లో ఆయనకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేవన్న సత్యాన్ని నువ్వింకా గ్రహించలేదా!''

అది అక్షరాలా నిజమనిపించింది సుందరానికి. గంగాధరం భార్య చేతిలో కీలుబొమ్మని అతనికి ముందే తెలుసు.

''అయినా సరే నేను మాటుగా ఓ వుత్తరం రాస్తాలే! నీకెందుకు కరుణా నువ్వూరుకో! నువ్వు మాత్రం సాయంత్రం మా ఇంటికి రావాలి సుమా! అక్కణ్ణించి సినిమాకి పోదాం.''

''చెప్పానుగా....'' నసిగాడు కరుణాకరం.

సుందరం చిన్నగా నవ్వేడు.

''మరేం చెప్పొద్దోయ్. శ్రీమతి లేకపోతే షికార్లకి, సినిమాలకి వెళ్ళొద్దన్న నియమం యెక్కడా లేదు....వెళ్ళక....'' అన్నాడు. అదే ఖచ్చితమైన నిర్ణయమన్నట్టు.

కరుణాకరం మరేం మాట్లాడకుండా అక్కణ్ణించి వచ్చేశాడు.

వెళ్ళిపోతున్న కరుణాకరంకేసి జాలిగా చూశాడు సుందరం. 'నీ జీవితంలో చెలరేగిన యీ అశాంతికి బాధ్యుణ్ణి నేనే కరుణా!' అని మనస్సులో భావించకుండా ఉండ

లేక పోయాడు.

ఆ రోజు సాయంత్రం ఆఫీసునించి వెలుపలికి వస్తున్నప్పుడు టెలిగ్రాఫ్ ప్యూన్ వచ్చి ఓ టెలిగ్రామ్ అందించాడు కరుణాకరంకి అతని హృదయం అల్లల్లాడి పోయింది. టెలిగ్రామ్‌కి ఉన్నంత మహత్తు మరే ఇతర కాగితానికీ లేదేమో, అందులోని విషయం తెలుసుకున్నంతవరకూ మనస్సు ఏదో విపత్తును శంకిస్తూనే వుంటుంది కరుణాకరం మెదడు ఎన్నో వూహలకు గురయ్యింది. గబగబా కవరు విప్పి అందులోని టెలిగ్రామ్ చదివాడు. తమ ప్రయాణం ఆగిపోయినట్టు జానకి భర్త తెలియజేశాడు. మనస్సు కుదుటబడిందతనికి. అయితే చెల్లాయి రాకపోతు న్నందుకు బాధపడ్డాడు. పరిస్థితులు అనవసరంగా అస్తావ్యస్తంగా తయారయినందుకు పరితపిస్తూ ముందుకు సాగిపోయాడు సుందరం ఇంటికేసి.

## 12

ఇల్లు చేరుకున్నాక గంగాధరం కూతుర్ని ప్రశ్నించాడు.

"ఏమిటమ్మా సుజాతా! ఉత్తరం ముక్కయినా ముందుగా రాయకుండా హఠాత్తుగ పిడుగుపడినట్టు టెలిగ్రామ్ ఇచ్చేసి నిన్ను పంపించేశాడేమిటి అల్లుడు?' అని. అతని ప్రశ్నలో ఎన్నో సందేహాలు దాగున్నయ్.

తండ్రి సూటిగా ఆ ప్రశ్న వేసేసరికి సుజాత కంగారుపడింది. భర్త మాటలు ఆమె చెవుల్లో గింగురు పెట్టినయ్. నిజం చెప్పడమా, మానడమా, అన్న సందిగ్ధం ఆమెను క్షణం మౌనంలో వుంచింది

"జవాబు చెప్పవేం సుజాతా? అంత ఆలోచనేమిటి?" ఆతృతతో మళ్ళీ అన్నా డాయన.

సుజాత జవాబు చెప్పడానికుద్యుక్తురాలవుతున్నంతలో రత్నం అందుకుంది కూతురు తరపున వకాల్తా పుచ్చుకున్నట్టుగ.

"ఏముందండీ! అక్కడ అత్తగారు, భర్తగారు, రాచి రంపాన పెట్టి వుంటారు. అల్లారుముద్దుగా పెరిగిన మన అమ్మాయి, ఆ వేగింపుకి తట్టుకోలేక యెదిరించి వుంటుంది. అంతే! వాళ్ళకి కోపంవచ్చి ప్రయాణం కట్టమనుంటారు. లేకుంటే, అతడే స్వయంగా టెలిగ్రామ్ ఇస్తాడా?" తన మామూలు వాగ్ధాటితోనే అంది.

సుజాతకి తల్లి మాటలు ఎంతో బలాన్నిచ్చాయి. ధైర్యం కూడగట్టుకుంది. పూర్తిగా నిజం కాకపోయినా పరిస్థితిని వెల్లడి చెయ్యాలనుకుంది.

"పూర్తిగా అంత అధ్వాన్నం కాదు గాని నాన్నా, ఆ ఇంట్లో స్వేచ్ఛగాని, సుఖంగాని లే పోవడం మాత్రం ఖాయం. ఏమన్నా అంటే, అణకువ లేదంటారు. ఈ విషయంలోనే మాటకి మాటా పెరిగింది. అంతేకాదు ఆయన చిన్నాన్న కూతు రొకామె వుందిలెండి. ఆమె స్వంత చెల్లాయి కాకపోయినా, అంతటి స్థానాన్ని ఆక్ర మించుకుంది. ఆమెకున్న స్వతంత్రం ఇంటికోడల్ని నాకు లేదేమోననిపిస్తుంది. ఆమె భర్తతోపాటు వస్తున్నట్టు ఉత్తరం వచ్చింది. వాళ్ళు వచ్చారంటే, వాళ్ళకి చాకిరీచేస్తూ వాళ్ళ ఆధిక్యతను చూస్తూ పడుండాలి. నా మనస్తత్వం అందుకు సరిపడదు. అదే కారణంతో నే నిక్కడ ఉండనన్నాను. కోపం వచ్చి ఆయన ఆయన నాతో రావడానికి బదులు టెలిగ్రామ్ ఇచ్చారు" అంది. చాలామట్టుగా జరిగింది చెప్పినట్టే అయ్యింది.

గంగాధరం ఏం జరిగివుంటుందో ఒక్కసారి వూహించుకున్నాడు. కూతురు చాలా తొందరపడిందనే భావించాడు.

"ఈ మాత్రందానికే నువ్విట్లా తొందరపడాలా సుజాతా?" అన్నాడు తను. సమర్థించినట్టు వ్యక్తం చేస్తూ.

రత్నం చప్పున కలిగించుకుంది. కూతురు మంచిపనే చేసిందని ఆమె భావన.

"మీకేం తెలీదు వూరుకుందురూ! ఇందులో తొందరపాటేమిటండీ? భర్తకి చాకిరీ చేస్తుందిగాని, ఇంటికి వచ్చిపోయే బంధుజనానికి చాకిరీ చెయ్యమంటే ఏమన్నా అర్థం వుందీ? పోనీ స్వంత ఆడబడుచు అయితే కొంత అర్థముంది. వేలు విడిచిన ఆడబడుచు ఆమె ఆధిక్యత యేమిటీ అంటాను. ఆ మాటకొస్తే సుజాత చాలా మంచి పని చేసిందంటాను." సమర్థించింది రత్నం.

ఇనుప కవచంలాంటి తల్లి సమర్థన, సుజాత భీతిని పోగొట్టింది.

"మా ఆడబడుచు అత్తవారు కాస్త ఉన్నవాళ్ళమ్మా! అందుకే, ఆమె మరీ మిడిసి పడిపోతుంటుంది. ప్రతీ విషయంలోనూ తన అంతస్తు వ్యక్తం చేసుకోడానికి నా సమక్షంలోనే ప్రయత్నిస్తుందమ్మా! అది యెంత బాధగా వుంటుందో నువ్వే ఆలోచించు"

నిజంగానే తను బాధపడిపోతున్నట్టు స్వరం మార్చి చెప్పింది.

"ఔనమ్మా! చాలా బాధగా వుంటుంది. మీ నాన్నగారికేం తెలుసులే! అటువంటి చోట వుండటం దుర్భరమే! అయినా, నీ దురదృష్టంగాని, నువ్వుమాత్రం కలవారి కోడలివి కాకపోయుందువా? ఏమిటో తొందర పడిపోయాం...." కూతురికి కలవారి సంబంధం దొరక్కపోవడానికి యింకెవరో బాధ్యులన్నట్టుగ విస్పృహతో అంది.

భార్య ధోరణి గంగాధరానికేమీ నచ్చలేదు.




"పోనీ రత్నం! జరిగిందేదో జరిగింది. ఇప్పుడవన్నీ యెందుకు తలచుకోవడం? ఆర్థికంగా అంతస్తు లేదన్నమాటే గాని, అబ్బాయికేం? విశేషంలాంటివాడు" అన్నాడు.

రత్నం మూతి విరుచుకుంది.

"ఆ! మీరే చెప్పాలి. ఆ సుందరం సంప్రదింపులు చెయ్యడానికి, మీరేమో మురిసిపోయి సంబంధాన్ని నిశ్చయించడానికీ సరిపోయింది. మీకేం పోయింది గనుక. ఇప్పుడు అది అనుభవిస్తోంది" అంది విరసనగా.

"అక్కడికి నీకే అభిమానమున్నట్టు చెబుతావేమిటి రత్నం? ఇప్పుడేం జరిగిందని అంత విరసనగా మాట్లాడుతున్నావు?" అన్నాడు, కాస్తంత చొరవ తీసుకుని.

"ఇంకేం జరగాలండీ? దాని మనస్సు యెంత నొవ్వకపోతే, విరక్తితో మనింటికి వచ్చేస్తుంది చెప్పండి? బాగా ఆలోచించండి."

"ఆలోచించాను. నాకు మాత్రం అనిపిస్తోంది, అమ్మాయే తొందర పడిందని."

రత్నం మొహం కందగడ్డలా అయ్యింది.

"మీకు అనిపించడం యెవరిక్కావాలండీ? అయినా, నా తెలివిగాని, మీతో వాదించడమేమిటి? ఇక్కడితో మీ ఆరాతీయడాలు చాలించి, మీ పనేదో మీరు చూసుకోండి" అంది నిష్కర్షగా

ఆమెకి కోపం వస్తే, ఆ ధోరణిలోనే మాట్లాడ్డం అలవాటు.

గంగాధరం మరి మాట్లాడలేదు.

ఇక తను యెంత వాదించినా, ఓటమి నిశ్చయంగా తనదేనని అతనికి తెలుసు. మెల్లగా జారుకున్నాడు.

"లేవమ్మా. స్నానం చేద్దువుగాని. రైలు ప్రయాణం....మరీ బడలిగ్గా వుంటుంది" అంది రత్నం. కూతుర్ని ఉద్దేశించి

సుజాత, టవలు తీసుకుని ఉత్సాహంగా బాత్‌రూమ్‌కేసి నడిచింది.

* * *

సుజాత వచ్చి పదిహేనురోజులు గడిచాయి. తను చేరినట్టు సుజాత ఉత్తరం రాసినా కరుణాకరం దగ్గర్నించి జవాబు రాలేదు. గంగాధరం తప్పించి, మిగతావాళ్ళెవ్వరూ అందుకు ఓగులుపడలేదు కూడాను.

ఓరోజు గంగాధరం యింటికి తిరిగివెళ్తూ, కూతురు తీసుకురమ్మన్న వారపత్రికను కొన్నాడు. కొట్టువాడు చిల్లరడబ్బులిచ్చేలోగా, పుస్తకాన్ని ఓసారి తిరగేశాడు. మధ్య పేజీ తర్వాత పేజీలో 'కెరటాలు' అన్న శీర్షికతో ఓ చిత్రం చూశాడు. అది అతణ్ణి బాగా ఆకర్షించింది చిత్రకారుని పేరు చూశాడు. ఆశ్చర్యపోయాడు. 'కరుణాకరం-విశాఖపట్నం' అనుంది. తప్పకుండా అల్లుడే అయ్యుంటాడన్న నమ్మకం యేర్పడింది. కొట్టువాడిచ్చిన చిల్లరడబ్బులు జేబులో పడేసుకుని, గబగబా అడుగులు వేస్తూ కొంప చేరుకున్నాడు.

"అమ్మాయ్ సుజాతా!" ఆత్రుతగా కేకవేశాడు.

ఏమిటోనని, తల్లీకూతుళ్ళు ముందుగదిలోకి వచ్చారు.

"ఏం నాన్నా?" అంది సుజాత ఆమెలోనూ ఆత్రుత ఉద్భవించింది.

"ఇదిగోనమ్మా నువ్వు తెమ్మన్న పత్రిక" అంటూ అందించాడు.

"ఓస్, యింతేనా?" అన్నట్టుగా ఓ నిర్లక్ష్యపు నిట్టూర్పు విడిచించి సుజాత, పుస్తకాన్ని చేతిలోకి తీసుకని.

రత్నంకి వొళ్ళు మండిపోయింది.

"ఈపాటిదానికి. యేదో కొంప మునిగినట్టు, అలా గావుకేకలు వేసుకుని పిలవాలటండీ? ఇవతలివాళ్ళు యెంత కంగారుపడతారో అర్థంచేసుకునే యింగితం లేకపోయింది" ఆయనేదో పెద్ద తప్పు చేసినట్టుగ వర్ణించింది.

"కొంప మునిగిపోవడం కాదు రత్నం! కరుణాకరం వేసిన చిత్రం ఒకటి యిందులో వేశారు చూడు. అది చెప్పాలనే నా ఆత్రుత. దాన్నేమో నువ్వు గావు

కేకవి సున్నితమైన పదం వాడావు. ఏం చెయ్యను ? చూడమ్మా సుజాతా, మధ్యపేజీ తర్వాత పేజీలో వుంది'' అన్నాడు.

సుజాత, అనుకోకుండా చప్పున ఆ పేజీ తెరిచింది. చిత్రంలో యెంతో గంభీరత నిండివుంది తెరచిచూస్తే యెన్నో భావాలున్నట్టనిపించా యామెకి. అయినా హర్షించ లేదు ఆమె హృదయం రత్నం చూపింది. మొహం చీదరించుకుంది.

''పిచ్చిగీతలు గీస్తే సరా ? దానికో అందం, చందం వుండొద్దూ ? వేసుకున్న పత్రికలవాళ్ళకి బుద్ధిలేదు గామోను '' విరసనగా అంది.

కొందరు పుస్తక సమీక్షకుల్లా, రత్నంకూడా తనకి నచ్చని ప్రతి వస్తువునూ, ఏహ్యభావంతోనే చూస్తుంది ఇది కొందరికి పుట్టుకతో వచ్చిన బుద్ధి మరి ! వాళ్ళ 'కువిమర్శ' పదేపదే మననం చేసుకుని, వాళ్ళే ఆనందాన్ని పొందుతారు తామింత గొప్పవాళ్ళం కదా అని.

గంగాధరం మాట్లాడలేదు ఏం మాట్లాడతాడు ? భార్య మనస్తత్వం తెలిసిందేగా!

''ఆఫీసు పని, యీ బొమ్మలు గీయడం తప్పించి, మరో వ్యాపకం లేదమ్మా ఆయనకి. ఏవో నాలుగు ట్యూషన్లు చెప్పండీ అని యెంతగానో మొత్తుకున్నాను. అబ్బే, వినిపించుకుంటేనా ? నా కంఠశోషే మిగిలింది ' అంది సుజాత

''ఆ ! ట్యూషన్లు చెప్పుకుంటే, ఈ పేరుప్రతిష్టలు వస్తాయా ఏవిఁటి ?'' అన్నాడు గంగాధరం వుండబట్టలేక.

''పేరు ప్రతిష్టలతో కడుపు నిండుతుందా నాన్నా ? ఈ రోజుల్లో డబ్బుకి ఉన్న విలువ మరి దేనికీ లేదని మీకుమాత్రం తెలీదూ ?''

''అది నీ వ్యక్తిగత అభిప్రాయం సుజాతా ! అందరూ అదే అభిప్రాయాన్ని కలిగి వుంటారనుకోవడం చాలా పొరపాటు ప్రతి వ్యక్తీ కేవలం డబ్బుకోసమే తాప త్రయ పడి సవాలక్ష మార్గాలు వెదికితే, యింక యీ లలితకళలు అడుగంటి పోవల్సిందే !'

భర్త మాటలు యెప్పుడూ యే ఒక్కటీ నచ్చవు రత్నంకి,

''చాల్లెండి, మహాతెలిసినట్టు ఉపన్యాసమిస్తున్నారు అమ్మాయి అభిమతంతో నే నేకీభవిస్తాను ఈ లలితకళలు కడుపు నింపుతాయా యేమిటి ? ఆ మధ్య వాళ్ళింటికి నేను వెళ్ళినపుడు గమనించాను. ఎవరైనా వస్తే కూచోడానికి మంచి కుర్చీలు రెండు లేవు మిగతా విషయాలు వదిలేయండి ఆ పాటి తాహతు లేకపోతే, యింకెందుకండీ యీ లలితకళలు ?'' విసురుగా అంది.

గంగాధరంకి కోపం రాలేదు నిజానికి కోపమన్న పదం యేనాడో మర్చిపో

యుంటాడు. అందుకే విసుగు జనించింది.

"నీ మన స్తత్వమే అమ్మాయికి అబ్బింది రత్నం. ఇంక దానికో మార్పు రావా లంటే యెట్లా వస్తుంది? ఎంత చెప్పినా అర్ధమవ్వదు కూడాను నాకేం? ఎవరి తప్పిదానికి వాళ్లే యెప్పుడో ఓసారి పశ్చాత్తాపపడతారు, తప్పదు" అనేసి బైటికి వెళ్లిపోయాడు.

రత్నం రుసరుసలాడుతూ భర్తకేసి చూసింది. అప్పటికే అతను దూరంగా వెళ్లిపోయాడు సుజాత మెల్లగా నవ్వుకుని ఆ పుస్తకం పట్టుకుని లోపలికి వెళ్లిపోయింది.

# 13

కరుణాకరం నిత్యజీవితంలో యెవ్వరూ ఊహించలేని మార్పు వస్తోంది క్రమంగా. మునుపటిలా ఉత్సాహంగా లేడు. ఎప్పుడూ యేవో ఆలోచించుకుంటూ, యేవేవో జ్ఞప్తికి తెచ్చుకుని పరితపిస్తున్నట్టు వుంటున్నాడు తీరికవేళల్లో చిత్రలేఖనంలో లీనమైపోతూ ఊహాలోకంలో పయనిస్తున్నాడు. అతి వాస్తవిక చిత్రాలు గీయడం అలవర్చుకుంటున్నాడు

సాయంకాలపు వేళల్లో యింతకుముందు సుందరంతో కలిసి తిరుగుతూ వుండేవాడు. ఇద్దరూ కలిసి బీచ్‌కి వెళ్లేవారు సినిమాలు చూసేవారు. పార్కుల్లో కూచుని కబుర్లు చెప్పుకునేవారు అటువంటిది యిప్పుడు కరుణాకరం ఒంటరిగా తిరగడానికి ప్రయత్నిస్తున్నాడు బీచ్‌లో ఒంటరిగా ఓచోట కూచుని, తదేకదృష్టితో సముద్రంకేసి చూస్తుంటాడు. అతడికి యేవేవో భావాలు కలుగుతూ వుంటయ్ ఒక్కడే సినిమాకి పోయి సగం ఆట చూసి, తిరిగివస్తూ వుంటాడు. ఏమిటో, అతని మనస్సుకి నిశ్చలత లేకపోతోంది,

కరుణాకరంలో కనిపిస్తున్న యీ పరిణామం సుందరంని, కాంతమ్మని కలవర పర్చింది. కాంతమ్మ దిగులుతో దిగజారిపోతోంది క్రమంగా. కొడుకు జీవితం ఆనంద మయంగా వుండాలని ఆమె సర్వదా వాంఛిస్తో వుండేది. అటువంటి ఆమె వాంఛ, ఒక రూపానికి రాకపోయినందుకే ఆ దిగులంతాను. కొడుకులో యింకా యెటువంటి మార్పు వస్తుందోనని భయంలో తల్లడిల్లిపోయింది. ఆమెలో తలెత్తిన భయాందోళనలు ఆమెను శారీరకంగా, మానసికంగా కృంగదీశాయి ఫలితంగా మంచం పట్టింది

కాంతమ్మ అనారోగ్యంతో మంచం పట్టిందని తెలియగానే సుందరం యెంతో బాధపడ్డాడు భార్యను తీసుకుని ఆమెను చూడ్డానికి వచ్చాడు.

"ఒంట్లో యెలా వుంది పిన్నీ?" అన్నాడు సుందరం.

"వయస్సు మీదపడుతుంది కదా బాబూ! బలహీనత అధికమవుతోంది " అని శుష్కమందహాసంతో చెబుతూ, "బాబూ సుందరం, మావాడి సంసారజీవితం యింక చక్కబడదంటావా? ఏదో మార్గంచూసి, నువ్వే సరిదిద్దు నాయనా!" అంది రుద్ధస్వరంతో. ఆ స్వరంలో నిరాశ తొణికిసలాడింది.

"అంత దిగులుపడకు పిన్నీ! అన్నీ సర్దుకుపోతాయి క్రమంగా. ఆవేశాలు, పట్టుదలలూ కలకాలం కాపురం పెట్టుకుని వుంటాయి గనుకనా? నువ్వేం కంగారుపడకు. సుజాత నాన్నగారికి ఉత్తరం రాస్తానంటే కరుణాకరం అప్పట్లో వద్దన్నాడు. ఇప్పుడు తప్పకుండా రాస్తాను" అన్నాడు సుందరం.

కరుణాకరం మళ్ళీ అడ్డు తగిలాడు.

"సుందరం అటువంటి ప్రయత్నమేమీ చెయ్యకు. అది నా వ్యక్తిత్వానికి స్వాభిమానానికి దెబ్బ తీస్తుంది" అన్నాడు కరుణాకరం.

"వాడి మాటలకేంలే నాయనా! నువ్వు వుత్తరం రాద్దూ! ప్రపంచానుభవం పుష్కలంగాలేని యువతీ యువకులు ఆవేశాల్ని అంతం చేసుకోకపోవచ్చు. కాని పెద్దవాళ్ళు కూడా వాళ్ళ ఆవేశాల్ని సమర్పిస్తే యెలా? నిజం చెప్పాలంటే యీ విషయంలో నే నెంతగా కుమిలిపోతున్నానో, నీకు తెలీదు సుందరం మావాడు హాయిగా సంసార జీవితం గడుతూవుంటే కళ్ళారా చూసి ఆనందించడమే ఆశగా పెట్టుకున్న నాకు, ఈ పరిస్థితులు కృంగదీశాయి బాబూ! నా మనస్సుకి ప్రశాంతత కరువయ్యింది. ఆ ప్రశాంతతని ప్రసాదించే భారం నీదే మరి" అంటూవుంటే కాంతమ్మ కళ్ళల్లో నీటి బిందువులు జ్యోతుల్లా మెరిశాయి

సుందరం చిన్నగా మందహాసం చేశాడు. ఆమెకి ధైర్యం చేకూర్చాలనే అతని వాంఛ.

"ఈ పాటిదానికే నువ్వింతగా అధైర్యపడకూడదు పిన్నీ! సంసార జీవితంలో ఇటువంటి చిన్నచిన్న సంఘటనలు అప్పుడప్పుడూ తటస్థపడుతూ వుంటాయి. ఇది ఎవ్వరికీ కొత్తకాదు. ఈ అభిప్రాయభేదాలు నీటి బుడగల్లాంటివి. నీటిబుడగ ఎంత కాలం వుంటుందని? కొద్ది రోజుల్లో అన్నీ చక్కబడేలా నేను చూస్తానుగా!"

సుందరం మాటలు, కాంతమ్మకి వేయి యేనుగుల బలాన్నిచ్చాయి.

"ఏదో నాయనా! వాడిని నువ్వే స్వంత అన్నలా ఆదుకుంటున్నావు. నువ్విన్న ధైర్యమే నన్నిలాగయినా వుంచగలిగింది." కాస్తంత తృప్తితో అంది కాంతమ్మ.

మరి కాస్సేపటి అనంతరం సుందరం దంపతులు వెళ్ళిపోయారు.

కరుణాకరం చాలాసేపటివరకూ మౌనంగా కూచున్నాడు. అతనికి భవిష్యత్తుమీద నమ్మకం సన్నగిల్లుతోంది. ఒకప్రక్క తల్లినిగురించి కూడా ఆవేదన పట్టుకుంది.

"నా గురించి, నువ్వెందుకమ్మా బాధపడతావు? నాకేం—హాయిగానే వున్నాను" అన్నాడు తల్లికి దగ్గరగా పోయి.

పొడిగ నవ్వింది కాంతమ్మ. వాడి, శుష్కించిన ఆమె పెదవులు పేలవంగా నవ్వాయి.

"నన్ను సంతృప్తిపర్చాలని కృత్రిమంగా నువ్వు తెచ్చిపెట్టుకుంటోన్న హాయిరా బాబూ అది. నిజానికి నీ హృదయంలో అగాధం యేర్పడింది. అదెవ్వరూ తెలుసుకోలేరు. అందరి సుఖంకోసం, అందరి మంచికోసం పాటుపడేవాడివి. చివరికి నీ సుఖమే నీకు దూరమయ్యిందిరా! అదే నా బాధంతాను." మనస్సులోని ఆవేదన ఆ విధంగా వ్యక్తంచేసింది.

"అనవసరంగా నువ్వు బాధపడుతున్నావమ్మా! నేను సుఖంగా లేనని నువ్వు భ్రమపడుతున్నావంతే! సుందరం అన్నట్టు, సంసార జీవితంలో యేవో యిటువంటి ఒడుదుడుకులు అప్పుడప్పుడూ తటస్థపడుతూ వుంటాయి. వాటిమట్టుకి అవే మళ్ళీ సర్దుకుపోతాయి." తల్లిని అనునయపర్చడానికే అలా అన్నాడుగాని, పరిస్థితులు అంత సుళువుగా చక్కబడతాయన్న నమ్మకం అతనికి లేదు.

కాంతమ్మ ఆసక్తిగా కొడుకుకేసి చూసింది.

"ఒరేయ్ అబ్బాయ్, యిటువంటి అభిప్రాయభేదాలు అప్పుడప్పుడు రావడం సహజమని నువ్వే ఒప్పుకుంటున్నావు. కోడలు తెలివితక్కువతనంవల్ల, మొండి పట్టుతో వెళ్ళిపోయిందే అనుకో! నువ్వూ అలాగే వుంటే యెట్లారా? ఆవేశం, పట్టుదలలు వద్దని అందరికీ చెబుతావు. మరి, నీకీ పట్టుదల యెందుకు చెప్పు? నామాట విని, నువ్వయినా ఓ ఉత్తరం రాయకూడదూ?" అంది సూటిగా.

చెప్పడం సుళువేగాని, చెప్పింది సదా ఆచరిస్తూ వుండటమన్నది, యే మహానుభావులకో గాని సాధ్యం కాదన్న విషయం తల్లికి తెలీదేమోననుకుని మెల్లగా నవ్వుకున్నాడు కరుణాకరం. తనకి గొప్ప సహనముంది. కాని, దానికో పరిమితీ వుంది. మంచి మనస్సుంటే ఆత్మాభిమానం వదులుకోవాలా? ఈ ప్రశ్న తల్లిని అడగడం అనవసర మనిపించింది.

"సుందరం ఉత్తరం రాస్తానన్నాడుగా! ఏం జవాబు వస్తుందో చూద్దాంలే అమ్మా!" అనేసి అక్కణ్ణించి జారుకున్నాడు కరుణాకరం.

కాంతమ్మ బరువుగా నిట్టూర్చింది. కొడుకు మనస్తత్వాన్ని చూచాయగా గ్రహించ




గలిగింది. వాడి మనస్సుకి బాగా ఘాతం తగిలిందేమోనన్న అనుమానం కలిగింది. ఆ అనుమానం కలగడంతో ఆమె మొహం వాడిపోయింది. దగ్గర్లో యెక్కడా ఆశా జ్యోతి అగుపించలేదు. ఏం జరుగనున్నదో అన్న ఆతృత, ఆరాటం, భయం ఆమెను కలతపెట్టేయి. మెల్లగా కళ్లు మూసుకుంది, యేవేవో తలచుకుంటూ.

## 14

సుందరం రాసిన ఉత్తరం చదువుకుని, గంగాధరం చాలా ఖేదపడ్డాడు. కాంతమ్మ మంచం పట్టిందంటే అతను ఊహించగలిగాడు, ఆమె అనుభవిస్తున్న ఆవేదన యేమిటో; పెద్దలు తమ పిల్లల వివాహాన్ని యెందుకు కాంక్షిస్తారు? వాళ్ళు సుఖపడతారని ఆనందంగా కలిసిమెలిసి మసలుతారని. వాళ్ళ ఆనందమే తమ ఆనందంగా భావించుకుని తాము తృప్తిపడాలని. కాని, ఆ తృప్తే లేనినాడు, ఆవేదన తప్పించి మరింకేముంటుంది? అనుకుంటూ, ఆ ఉత్తరాన్ని కూతురికి అందించాడు.

సుజాత ఉత్తరాన్ని చదువుకుంది.

"అర్థం చేసుకున్నావు కదమ్మా పరిస్థితిని ?" ప్రశ్నించాడు గంగాధరం కూతుర్ని ఉద్దేశించి.

"అర్థం చేసుకోడానికేముంది నాన్నా! అత్తగారు అసలే వృద్ధాప్యంలో వున్నారు. ఇంటిపనులు చేసుకోలేక నీరసించి మంచమెక్కి వుంటారు. అది విస్మరించి కేవలం నేను వచ్చివేయడంవల్లనే ఆమె కృంగిపోయి మంచమెక్కారని ఊహించడం, వట్టి భ్రమంటాను. సుందరం అలా రాస్తున్నారంటే, అది ఆయన అభిప్రాయమై వుండదు. మీ అల్లుడుగారే అలా రాయించి వుంటారు" అంది సుజాత, తన పొరపాటువల్ల యీ పరిణామాలు కలుగలేదని సమర్థించుకుంటూ.

సుజాత పరిస్థితిని అర్థం చేసుకుందుకు, తన తప్పును తెలుసుకుందుకు యే మాత్రమూ ప్రయత్నించనందుకు చింతించాడు గంగాధరం.

"నువ్వు పొరబడుతున్నావమ్మాయ్. కరుణాకరం అలాంటి మనిషి కాడు. అతడి మనస్తత్వాన్ని నేను యేనాడో ఆకళింపు చేసుకున్నాను. నిష్కల్మష హృదయుడు" అన్నాడు, కరుణాకరం పట్ల తనకి గల అభిమానాన్ని, సదభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ.

తండ్రి మాటలు, దొంకతిరుగుడుగా సుజాత అభిమానాన్ని రెచ్చగొట్టాయి. ఏడుపుమొహం పెట్టింది.

"బాగ్లెంది నాన్నా! నన్నెప్పుడు మాత్రం మీరు మంచిగా గుర్తించారు? అది నా దురదృష్టం" యేడుపుమొహం పెట్టి అంది.

రత్నం అంతవరకూ మౌనంగా వూరుకుని వింటోంది గాని, యింక ఉండబట్టా లేకపోయింది.

"వయస్సు మళ్లిన కారణంవల్ల ఆమె మంచంపడితే, మనమ్మాయిమీద యేడు పెందుకండీ? ఏ నింద మోపడానికయినా కోడలు తేరగా దొరుకుతుందిగా! అయినా, మీరెందుకీ విషయంలో యింత యిదై పోతున్నారో నాకర్థం కాకుండా వుంది. మీ మానాన మీరు వూరుకోవడం మంచిది. అల్లుడే యెప్పుడో ఓసారి 'దేహీ' అనుకుని వస్తాడు' రుసరుసలాడుతూ అంది.

గంగాధరంకి, కళ్లవరకూ కోపంవచ్చి ఆగిపోయింది అతనికి, అది అలవాటే మరి.

"అయితే, యీ ఉత్తరానికి యేం జవాబు రాయమంటావు రత్నం?" అన్నాడు.

"అసలు, జవాబు యెందుకు రాయాలీ అంట? మధ్య యీ సుందరం యెవరు? అతడు మనకు పాఠాలు నేర్పేపాటివా డయ్యాడా? బోడి పెద్దరికం గాకపోతే యేవిటీ

ఉత్తరం? ఏ జవాబూ లేదు ...గమ్మున వూరుకోండి ...''

''అంతే అంటావా?'' అన్నాడు, యేంచెయ్యాలో తోచక. భార్య సలహా బొత్తిగా నచ్చలేదు. అలాగని, స్వతంత్రించి, తన నిర్ణయానుసారంగా ప్రవర్తించే ధైర్యమూ లేకపోయింది.

భర్తకేసి తీక్ష్ణంగా చూసింది రత్నం.

''ఏ భాషలో చెప్పాలండీ? అసలు, మీకేదీ ఒకంతట అర్థమై చావదు గదా! ఏదీ ఆ ఉత్తరం యిలా యివ్వు సుజాతా!' అంటూ కూతురు చేతిలోని ఉత్తరాన్ని విసురుగా తీసుకుని, ముక్కముక్కలుగా చించేసి బైటికి విసిరేసింది రత్నం.

గంగాధరం నిరుత్తరుడయ్యాడు. సమయం వచ్చినపుడు వాళ్లే అర్థం చేసుకుంటారని వూరుకున్నాడు.

* * *

గంగాధరంగారి దగ్గర్నించి ఉత్తరం లేకపోవడం, సుందరంకి అమితాశ్చర్యాన్ని కలిగించింది. మరో ఎక్స్‌ప్రెస్ ఉత్తరం రాశాడు. దానికీ జవాబు లేదు. బహుశా, భార్య ఒత్తిడికి లోనై మౌనం వహించి వుంటాడన్న నిశ్చయానికి రాక తప్పలేదు.

కాంతమ్మ పరిస్థితి కలవరపాటు కలిగిస్తోంది. ఆమె క్రమంగా క్షీణించిపోతున్నట్టు తెలిసిపోతోంది. ఆమె మొహం వాడిపోతూ, మృత్యువుదగ్గర పడుతున్న వ్యక్తిని గుర్తుచేస్తోంది. కరుణాకరంకి యేంచెయ్యాలో పాలుబోలేదు.

''కరుణా! అతి ముఖ్యమైన రెండుత్తరాలు అందుకుని కూడా మీ మావఁగారు జవాబు రాయలేదంటే, నాకే వింతగా తోస్తోంది. నేనే ఓసారి వెళ్లిరావడం శ్రేయస్కరంగా తోస్తోంది'' అన్నాడు ఓరోజు సుందరం. అతనికి పరిస్థితి భీతిని కలిగించింది. సుజాత వచ్చేస్తే కాంతమ్మ తప్పకుండా కోలుకుంటుందన్న నమ్మకం అతనికుంది.

కాని, ఆ నమ్మకం కరుణాకరంకి లేదు. అంత సుళువుగా సుజాత రాదని అతని భావం.

''వద్దు సుందరం. నువ్వు వెళ్ళొద్దు. నువ్వు రాసిన రెండు ఉత్తరాలకు జవాబు రాయకపోవడంలో, వాళ్ళ నిర్లక్ష్యం గ్రాహ్యమౌతూనే వుంది. అటువంటి చోటికి వెళ్ళినా, అవమానానికి గురికావల్సి వస్తుందేగాని, మరో ప్రయోజనం యేమీ వుండదు'' అంటూ వారించాడు కరుణాకరం.

''కాని, మీ అమ్మగారి పరిస్థితి ఆందోళన కలిగిస్తోంది కరుణా!''

''ఫరవాలేదులే సుందరం! కోలుకుంటుంది'' విర్లిప్తంగా అన్నాడు కరుణాకరం.

అతని మాటల ధోరణి వేదాంతిమల్లె కనిపిస్తోంది.

సుందరం ఓ నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు. కరుణాకరం సమ్మతి లేనిదే, అతనికి యేం చెయ్యడానికీ పాలుపోవడం లేదు.

పై సంభాషణ జరిగిన మూడోరోజు రాత్రి తొమ్మిదింటికి, కాంతమ్మ మాట్లాడుతూ మాట్లాడుతూ, కొడుకు చేతిని తనచేతిలోకి తీసుకుని, కళ్ళల్లో నీరు నింపుకుని చివరిచూపు అన్నట్టుగా కొడుకుకేసి తదేకంగా పరికించి కళ్ళు మూసింది. ఆమె చేతులు నిర్జీవంగా మంచంమీద పడినయ్.

కరుణాకరం కర్రగట్టిపోయాడు.

"అమ్మా!" అంటూ బావురుమన్నాడు. అతని కళ్ళల్లో నీరు యింకిపోయిందేమో నన్నట్లుగ, కళ్ళు వెలవెలబోయాయి.

కాంతమ్మ యీ లోకం విడిచిందని తెలిసిన మరుక్షణం బైలుదేరి వచ్చాడు సుందరం. సుందరం భుజంమీద వాలిపోయి కుమిలిపోయాడు కరుణాకరం. అతని కన్నీరు సుందరం చొక్కాని తడిపేసింది.

సుందరం, కాంతమ్మ భౌతికదేహాన్ని చూస్తూ, నిర్లిప్తంగా ఓ నిట్టూర్పు విడిచాడు. అతని నయనాలు కన్నీటి బిందువుల్ని రాల్చినయ్ స్నేహితుడికి తనే యేదో అన్యాయం చేసినట్టుగ ఫీలయ్యాడు. సుజాతపై వల్లమాలిన కోపం వచ్చింది, కాని, యేం చెయ్యగలడు?

"మీ మావఁగారికి వైరిస్తాను ..." ముక్తసరిగా అన్నాడు.

"వద్దు సుందరం ..మా చెల్లాయికి వైరియ్యి. అడ్రసు టేబిలుమీదున్న డైరీలో వుంది" జవాబిచ్చాడు కరుణాకరం. సుజాతను రప్పించడంకూడా యిష్టం లేకపోయిందా క్షణంలో అతనికి.

సుందరం, మరేం మాట్లాడలేదు. ఆరోజే కాంతమ్మ భౌతికదేహానికి అంత్యక్రియలు జరిగాయి.

ఇప్పుడా యింట్లో ఏకాకి అయ్యాడు కరుణాకరం, తల్లి ఫోటోకేసి దృష్టి నిలుపుతూ అచేతనంగా కూచున్నాడు. అతనిలో ఆలోచనలు ముమ్మరంగా ముంచెత్తుతున్నయ్. ఇంతవరకూ తను సాగించిన జీవితం వేరు. ఇకముందు తను సాగించవల్సిన జీవితం వేరనిపించింది. ఈ రెండింటికి యెంతో తారతమ్య ముంటుందని అతనికి తెలుసు, అయితే యింతవరకూ తల్లి తనకు అండగా వుండి, నిరాశను తనలో రానివ్వకుండా ధైర్యాన్నిచ్చేది. ఏ చింతా వుండేది కాదు. కాని, యిప్పుడు ఆ ధైర్యమే కొరవవుతుందేమోనన్న దిగులు పట్టుకుంది.

మూడోరోజుకి జానకి, సుదర్శనం వచ్చారు. ఆఖరుసారిగా పిన్ని భౌతిక దేహాన్నయినా చూడలేకపోయిన తన దురదృష్టానికి యెంతగానో విలపించింది జానకి. ఆ యింటి పరిస్థితులు యిలా పరిణమించినందుకు, అన్నయ్య ఒంటరివాడైనందుకు ఆమె హృదయం పరితాపంతో తల్లడిల్లిపోయింది. ఈ స్థితిలో అన్నయ్యను ఒంటరిగ వదిలివెళ్ళడం యిష్టం లేకపోయింది. పన్నెండోరోజు కాంతమ్మ ఆత్మశాంతికై జరుపవల్సిన విధులన్నీ జరిపించేశారు. జానకి అంతవరకూ వుంది.

మరుచటిరోజు అన్నయ్యతో అంది.

"అన్నయ్యా, ఈ పరిస్థితుల్లో నువ్వు ఒంటరిగ యిక్కడ యెట్లా వుండగలవు? మాతోపాటు వచ్చి కొద్దిదినాలు అక్కడ వుంటే కొంత మనశ్శాంతి యేర్పడుతుందేమో!"

"ఔను బావగారూ! మాతో రండి. ఒంటరిగా వుంటే, యేవేవో ఆలోచనలు మస్తిష్కాన్ని చిందరవందర చేస్తాయి—ముఖ్యంగా యీ పరిస్థితుల్లో. కాదనకండి...." సుదర్శనంకూడా తన అభిప్రాయాన్ని వెల్లడిచేశాడు.

కరుణాకరం ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఏం ఫరవాలేదు బావగారూ! జీవితంలో ఇంతటి క్లిష్టపరిస్థితిని యెన్నడూ యెదుర్కోలేదు నిజమే! కాని, దీనికి నేను కృంగిపోతానని గాని, ఆలోచనలు పెంచుకుని విరక్తి జెందుతాననిగాని భావించకండి. నా జీవితం మొదట్నుంచీ, సాఫీగా సాగడంలేదు. ఏదో ఒక అవరోధం, ఆవేదన తటస్థిస్తూనే వుంది. వాటిని అధిగమించడానికి చేసే ప్రయత్నాలకు బాగా అలవాటుపడ్డాను. ఫలితంగా నాలో ఓ విధమైన మొండితనం యేర్పడింది" అన్నాడు, తను యెక్కడికీ వెళ్ళనన్న దృఢనిశ్చయాన్ని వెల్లడిచేస్తూ.

కరుణాకరం మాటల్లో, గట్టి ఆత్మవిశ్వాసం వున్నట్టు తోచింది సుదర్శనంకి. అది తెలుసుకునికూడా అతణ్ణి బలవంతం చేయడం, తత్ఫలితంగా అతనిలో విసుగుని కలిగించడం మనస్కరించలేదతనికి,

"సరే, మీ యిష్టం బావగారూ!" అనేశాడు,

జానకిమాత్రం అంత సులువుగా విడిచిపెట్టలేదు.

"ఏమిటోనన్నయ్యా పరిస్థితులు యిలా రూపొందుతాయని నేను కలలోకూడా ఊహించలేదు. ఇప్పుడు నువ్వు ఒంటరివాడివయ్యావు ఒంటరితనం మామూలు మనిషినే నిశ్చలంగా వుండనీయదు. ఇంక ఆవేదనలతో నిండిన నీ హృదయాన్ని యెట్లా మారుస్తుందో యెవరికి తెలుసు? నాకెందుకో భయంగా వుందన్నయ్యా! నా

యీ అభ్యర్ధనని మన్నించు. మాతో వచ్చి కొన్నాళ్ళపాటు వుండి వచ్చేద్దువుగాని. అవసరమైతే సుందరంగారితో మీ బావగారు మాట్లాడతారు'' అంది యెంతో ఆప్యాయతతో.

కరుణాకరం సన్నని మందహాసం చేశాడు.

''మీ యింటికి రావడానికి నాకేదో అభ్యంతరముంది. ఇలా చెబుతున్నా ననుకుంటున్నావేవిఁటమ్మా జానకీ? అటువంటిదేమీ లేదు. నేనెక్కడికీ వెళ్ళదల్చలేదు. నేను ఒంటరివాణ్ణయ్యానని యెవరన్నారు? నాకు తోడునీడగా నా కుంచెలు, రంగులు, కాగితాలు వున్నాయిగా! ఎప్పుడైనా నాకు ఒంటరితనపు బాధ వీపు చరిస్తే, అప్పుడు తప్పకుండా మీ యింటికే వస్తాను. నాకు మాత్రం ఇంకెవరున్నారు చెల్లాయ్....'' అంటూ వుంటే అతని కళ్ళు చెమర్చాయి.

జానకికి యేడుపొచ్చింది. అన్నయ్య మాటల్లో యెంత గంభీరత వుందో, అంత పరితాపమూ వున్నట్టు తోచిందామెకి. ఓ నిశ్వాసం విడిచింది.

''సరేనన్నయ్యా! నీకు చెప్పవల్సినదానను కాదు. ఆ విషయం వదిలేయ్. వదిన మాట యేం జేశావు? మళ్ళీ యీ ప్రస్తావన తీసుకువచ్చానని బాధపడకు. భార్యాభర్తల్లో యే ఒక్కరు తొందరపడినా, మరొకరు సర్దుబాటు చేసుకోవాలి మరి! అది నీకుమాత్రం తెలీదా? పోనీ, నేనూ మీ బావా, వెళ్ళి నచ్చజెప్పి ఆమెను తీసుకొచ్చేదా.'' చివరిసారిగా యీ ప్రయత్నం సాగించింది జానకి.

కరుణాకరం సూటిగా చెల్లెలి మొహంలోకి చూశాడు. తల్లి గుర్తుకొచ్చింది. అతని కళ్ళు చెమ్మగిల్లాయి మళ్ళీ. సుజాత తనతో యెవరి విషయంలో వాగ్వివాదం పెంచుకుని, ముందూ వెనుకా చూడకుండా వెళ్ళిపోయిందో, జానక్కి ఏం తెలుసు? తమ అభిప్రాయభేదాలకు పరోక్షంగా తనే కారణమన్న నిజాన్ని తెలుసుకుంటే, చెల్లాయి నిలువునా కృంగిపోదూ? అనుకున్న కరుణాకరం, ఆమెకి ఆ వైనం తెలియజెయ్యకుండా వుండడమే మంచిదనుకున్నాడు.

''వద్దు చెల్లాయ్. నువ్వేమీ అటువంటి ప్రయత్నం చెయ్యొద్దు. అది నాకే శ్రేయస్కరం కాదు. సర్దుబాటు చేసుకుందుకు, నేను సర్వవేళలా సంసిద్ధుణ్ణే! నా మనస్తత్వం నీకు తెలీంది కాదు. ఎటొచ్చి, వ్యక్తిత్వంలేని వ్యక్తిగా మారిపోవటం నాకు సాధ్యం కాదు'' గంభీరంగా అన్నాడు.

అన్నయ్య మాటల వెనుక దాగివున్న భావం గ్రహించుకోగలిగింది జానకి. మరి మాట్లాడలేకపోయింది. తను కలిగించుకోవడంకూడా మంచిది కాదేమోనన్న




సందేహం కలిగింది.

ఆ మరునాడే జానకి, సుదర్శనం వెళ్లిపోయారు.

## 15

ఆఫీసుకి వేళకాలేదింకా. భోజనం యెలాగూ మధ్యాహ్నమే హోటల్లో చేస్తాడు గాబట్టి, కాఫీ తీసుకుని తీరిగ్గా కూచున్నాడు కరుణాకరం. ఒక్కొక్కప్పుడు అతనికి అనిపిస్తూ వుంటుంది. తన జీవితానికి అర్థం యేమిటని? ఆ అభిప్రాయం మెదిలినప్పుడంతా, అతనికి కుంచెలు, రంగులు, గుర్తుకొస్తాయి. చప్పున టేబిలు ముందు కూచుని, యేదేనా చిత్రంగీయడానికి ఉపక్రమిస్తాడు. ఇదోరకమైన ఇన్స్పిరేషనేమో మరి.

ఆరోజు కూడా అదే జరిగింది. అతనిలో పేరుకున్న నిస్పృహ, యెన్నో భావాల్ని మొలకెత్తించింది. ఫలితంగా, అతనివూహల లోకంలో ఒక చిత్రం మెదిలింది.

చప్పున పెన్సిలుతీసి నమూనా వేసుకున్నాడు. మూడు రోజులు ఉదయమూ, రాత్రి శ్రమపడి, ఆచిత్రాలన్ని రంగుల్లో పూర్తిచేశాడు. అదో యెడారి. కనుచూపు మేర చుట్టూ యెక్కడా జనసంచారంగాని, ఇళ్లుగాని, జంతువులుగాని, చెట్లుగాని, యేవీ అగుపించవు. అటువంటి స్థలంలో బిక్కచిక్కిన ఓ వ్యక్తి దిగాలుపడి, నీరసంగా యెటోచూస్తూ వుంటాడు. అతని కళ్ళల్లో ఒకవిధమైన నిస్సహాయత నిస్పృహా, వ్యక్త మౌతూవుంటాయి. తను ముందుకు సాగిపోగలడా! లేక తన జీవితం, ఇక్కడే అంతం కావాల్సివుందా? ఈ దిగులు అతని చూపుల్లో స్పష్టంగా కనిపిస్తున్నట్టు వుంటాయా కళ్లు. అయినా, యేదో ఆశ, యెవరో కనిపిస్తారనే ఆశ, తను ముందుకు పోగలనన్న విశ్వాసం కూడా అతనిలో యేకోశానో వున్నట్టు, నిశ్చలమైన భావమూ స్ఫురిస్తుందా మొహంలో. కరుణాకరం పులిమిన రంగుల్లోనే యీ సంఘర్షణ కనిపిస్తుంది. అ చిత్రం కరుణాకరంకి అమితానందాన్నిచ్చింది ఇన్నాళ్ళకి తను ఆశించిన చిత్రాన్ని రూపొందించ గలిగానన్న సంతోషం, అతణ్ని వుత్తేజపర్చింది పదేపదే, ఆచిత్రాన్ని పలుకోణాల్లో చూసుకో సాగాడు. తృప్తి జెందాడు అతనిలోని కళాకారుడు, సగర్వంగా నవ్వుకున్నాడు. ఆ చిత్రానికి 'ఆశాజీవి' అని పేరు పెట్టాడు.

ఆ చిత్రం పూర్తిచేశాక, అతనికి ఆమధ్య చూసిన ప్రకటన గుర్తుకొచ్చింది. గబగబా పాత వార్తాపత్రికల్ని తిరగేశాడు. ప్రకటన దొరికింది మద్రాసులో చిత్రకళా ప్రదర్శన యేర్పాటు చేయబడింది. అయితే అది మామూలు ధోరణిలో కాకుండా వివిధ చిత్రకారుల చిత్రాలు ప్రదర్శించ బడతాయి. బహుమతి కూడా వుంది. కరుణాకరంకి తను రాసిన 'ఆశాజీవి' చిత్రాన్ని పంపించాలన్న వాంఛ కలిగింది. పంపించవల్సిన ఆఖరు తేదీకి ఇంకా వారంరోజులు వ్యవధి వుండటం అతని వుత్సాహాన్ని యినుమడింప జేసింది. మరుచటి రోజే దాన్ని పంపివేశాడు.

*  *  *

కరుణాకరం, జీవితం పట్ల విరక్తిభావాన్ని పెంచుకోకుండా వుండడానికి వీలుగా, సుందరం పలు ప్రయత్నాలు చేస్తున్నాడు. సాయంత్రపు వేళల్లో వీలున్నప్పుడంతా, తనతోపాటు కరుణాకరంని బీచ్‌కి తీసుకుపోతున్నాడు. ఒక్కోరోజు సినిమాకి పోతున్నారు, ఆఫీసులో మరో ఆలోచనకు అవకాశం లేనట్టు చేస్తూ, యేదో ఒకపనిని పురిగొల్పుతున్నాడు. ఇన్నీ చేసినా, కరుణాకరంలో నిరాశలేదని యెవ్వరూ చెప్పలేరు. అలాగని, పూర్తిగా దిగ జారిపోలేదు కూడాను. ఇటీవల అతను గీస్తున్న చిత్రాలు మరీ వాస్తవంగానూ, ఒక్కో సందర్భంలో అతివాస్తవంగానూ, వుంటున్నయ్.

పెను తుఫానుకి పెద్దపెద్ద చెట్లూ, భవనాలు కూలిపోయిన దృశ్యాలు, నదులు పొంగి ప్రకృతి జనావళికి నష్టం కలిగించిన దృశ్యాలు, అగ్నిదేవుడి కోపాగ్నికి ఆహుతి అయిన పూరిళ్ళూ, మొదలైన చిత్రాలు కొన్ని, వరద వెల్లువలో యీవలి ఒడ్డునుంచి ఆవలి వొడ్డుకు యీదుకుపోతున్న వ్యక్తి, పర్వత శిఖరాలని చేరుతున్న మనిషి-చంద్రలోకాన్ని సమీపిస్తూన్న రాకెట్టూ మొదలగు చిత్రాలు మరికొన్ని, అప్పుడప్పుడు పత్రికల్లో పడుతూనే వున్నయ్. కొన్ని నిరాశను స్ఫురింపజేస్తే, మరికొన్ని ఆశను రేకెత్తిస్తున్నయ్. కరుణాకరంకి, ఇప్పుడు ఆత్మవిశ్వాసమూ, ఆత్మతృప్తి ఏర్పడ్డాయి. ఎటొచ్చీ, సుందరం మాత్రం కంగారు పడ్డాడు

"కరుణా ఇటీవల నువ్వు వేస్తున్న చిత్రాల్లో చాలావరకు నిరాశ నిండుకొని వుంటోంది. మరికొన్ని భీభత్సాన్ని స్ఫురింప జేస్తున్నయ్ నాకెందుకో వాటిని చూస్తుంటే, భయంగా వుందోయ్. నీ మనస్తత్వం యెందుకిలా పరిణామం జెందుతుందా అని కలవరపడుతున్నాను. ఉత్సాహాన్నిచ్చే చిత్రాలు గీస్తుంటే కాదూ? నా మాటవిని నువ్వు మామూలు మనిషివికా——" అన్నాడు సుందరం ఓరోజు.

స్నేహితుడు అంతగా కంగారుపడి తన భయాన్ని వ్యక్తం చేస్తుంటే, అదేమీ పట్టించుకోకుండా, చాలా తేలిగ్గా నవ్వేడు కరుణాకరం.

"సుందరం, బొమ్మలు గీసినంత మాత్రాన, నాలో నిరాశ నిండుకొని వుందని, జీవితంపట్ల జుగుప్స కలిగిందనిమాత్రం భావించకు. నిజం చెప్పాలంటే నే నెప్పుడూ ఆశావాదినే భవిష్యత్తుపట్ల నాకు గొప్ప విశ్వాసంవుంది. ఈ తరహా బొమ్మలూ కొన్నివేశాను. చూశావుగా ఎటువంటి పరిస్థితుల్లో వున్నా, మంచిరోజులు ముందుముందు రాకపోతాయా అన్న భావన ఒక ఆశ నాలో మెదుల్తూనే వుంటుం దెప్పుడూ. అంచేత నువ్వేమీ కంగారు పడకు.' అంటూ నచ్చజెప్పాడు కరుణాకరం.

సుందరం మనస్సు కొంతమేరకు కుదుటబడింది. కరుణాకరం వంటి సహృదయుడికే ఇన్ని సమస్యలు యెందుకు చుట్టుముట్టుకుంటాయోనని అప్పుడప్పుడు తనలో తనే ప్రశ్నించుకుంటూ వుంటాడు సుందరం. కాని, సరైన జవాబు దొరకదు. భగవంతుని సృష్టికి ఒక పద్ధతి అంటూ లేదేమోనని అతను ఓ నిశ్చయానికి వచ్చాడు.

"సరేగాని, మీ మావఁగారికి యెన్ని వుత్తరాలు రాసినా జవాబు రావడంలేదు. నేను వెడతానంటే, వారిస్తున్నావు ఇలాగే రోజులు గడిచిపోతుంటే, సమస్య పరిష్కారమయ్యేదెట్లా చెప్పు? పోనీ, ఇద్దరం వెళ్దాం పద——" మరోసారి ప్రయత్నిస్తున్నాడు సుందరం. నిజం చెప్పాలంటే, సుందరానికి రాత్రిళ్ళు కంటికి నిజంగా నిద్రపట్టడం లేదు. అతని మెదడులో స్వవిషయాలకి చోటు లేదుగాని, కరుణాకరం·

సమస్యేగింగురు పెడుతోంది. ఒక నేరస్థుడిలా భావిస్తూ విశ్రాంతిగా వుండలేక పోతున్నాడు. అందుకే మళ్ళీ యీ ప్రయత్నం.

సుందరం ప్రతిపాదనని, కరుణాకరం ఆమోదించలేదు. ఎంత సమాధాన పడాలన్నా, అంతరాత్మ ససేమిరా అంటోంది.

"సుందరం నా మనస్తత్వం నీకు కొత్తకాదు. నేను యే విషయాన్నీ అంతగా పట్టించుకోను. సుజాతవస్తే సంతోషంతో ఆహ్వానిస్తాను. గతాన్ని మర్చిపోతాను. అంతేగాని, నేనుగా అక్కడికి వెళ్ళను నా వ్యక్తిత్వాన్ని అవమాన పర్చను. విపులంగా చెప్పకపోయినా, నువ్వు అర్థం చేసుకుంటావన్న నమ్మకముంది' అన్నాడు.

సుందరం, క్షణం మాట్లాడ లేదు. స్నేహితుడి మాటల్లో కొంతయినా నిజంలేక పోలేదనిపించింది. అతడిలో పట్టుదల లేదుగాబట్టి, తనే యేదో యేర్పాటుచేసి సుజాతను రప్పించాలి. అంతవరకూ తను నిశ్చితంగా వుండలేడు.

"నీ అభిప్రాయం 'తప్పు' అని నేనను కరుణా! కాని, తరుణోపాయం ఏదో ఆలోచించాలిగా!" ఆలోచనలో పడ్డాడు సుందరం అతని వూహకి చప్పున యేదీ తట్టలేదు.

"పదవోయ్ యీ సినిమాకి వెళ్లొద్దాం." అటూ కరుణాకరంని తీసుకొని వెళ్ళిపోయాడు.

సుందరం యెంతో ఆలోచించిన మీదట గంగాధరం పేర ఓ ఉత్తరం, సుజాత పేర మరో ఉత్తరంరాసి, విడివిడిగ పోస్టు చేయాలనుకుని, వాటిని సుమతికి చదవమని యిచ్చాడు.

సుమతి ఆ ఉత్తరాల్ని చదువుకొని, నిర్ఘాంత పోయింది. కరుణాకరంకి మరో వివాహం చెయ్యాలన్న ప్రయత్నంజరుగుతోందని,తరుణం మించకముందే, తమస్సునుండి బైటపడ్డం తక్షణ కర్తవ్యమని హెచ్చరిస్తూ రాసిన వుత్తరాలవి.

"ఏమిటండీ యీ వుత్తరాలు? ఇదేం చిన్నపిల్లల ఆట అనుకొంటున్నారా? వాళ్ళెంతగా కంగారు పడతారని?" ప్రథమంగా తనే కంగారుపడుతూ ప్రశ్నించింది సుమతి

మెల్లిగా మందహాసం చేశాడు, సుందరం. 'ఆ కంగారు కలిగించడానికే, యీ అబద్ధాల సృష్టి సుమతీ! నూరు అబద్ధాలాడి అయినా, ఓ యింటిని నిలబెట్ట మన్నారు. అప్పటికైనా వాళ్ళు దారికి వస్తారో, లేదో, గమనించు మరి."

"ఇది వట్టి బెదిరింపేనని వాళ్లు వూహించారను కోండి. అప్పుడేం చేస్తారు?"

"అంతదూరం వస్తే, వుండనే వుంది అస్త్రం. అది పాశుపతాస్త్రంలా పని

చేస్తుంది.'' నిబ్బరంగా అన్నాడు సుందరం

''ఏమిటండీ అది?'' ఆ భాష ఆమెకి అర్థంకాలేదు.

''అది, ఇప్పుడు చెప్పను సుమతీ! ఆడవాళ్లు రహస్యాన్ని దాచలేరు. ఆరహస్యం. నా మనస్సులోనే పదిలంగా వుండటం మంచిది. తర్వాత చెబుతాగా! ఇంతవరకూ కరుణాకరంకి కూడా చెప్పలేదు. నిజానికి నేనీ విషయంలో ఇంతశ్రద్ధ వహించడానికి కారణం నీకూ తెలుసు.'' అన్నాడు మందహాసంతో.

''సరే! మీ రహస్యం, మీరే దాచుకోండి. ఎప్పటికైనా బైటపడక పోతుందా?'' మూతి విర్చుకుంటూ, ఆయన సంకల్పం యేమిటో చెప్పనందుకు వుడుకు మోత్త నంతో, అక్కణ్నించి వెళ్ళిపోయింది సుమతి.

సుందరం నవ్వుకున్నాడు. ఉత్తరాల్ని కవరుల్లో పెట్టి అంటించేశాడు. మరుచటి రోజు పోస్టుచేశాడు వాటిని

# 16

హఠాత్తుగ ఓరోజు టెలిగ్రామ్ వచ్చింది కరుణాకరంకి. ఏమిటోనని అతని హృదయం ఆరాటపడింది. టెలిగ్రామ్ చదువుకున్నాక, అతని ఆనందానికి అవధుల్లేకపోయాయి. వాడివుండే మొహం అప్పుడే విరబూచిన పుష్పంలా వికసించింది. అతను పంపిన 'ఆశాజీవి' చిత్రానికి ప్రథమ బహుమతి వచ్చిందని టెలిగ్రామ్ ద్వారా తెలియజేశారు. ఉత్తరం త్వరలో అందుతుందన్నారు. అంత నిరుత్సాహంలోనూ, ఆవేదనలోనూ తను జీవితంలో గొప్ప విజయాన్ని సాధించానన్న తృప్తి, అతనిలో అమితోత్సాహాన్ని నింపింది. తక్షణం ఆ టెలిగ్రామ్ తీసుకుని. సుందరం దగ్గరికి వెళ్ళాడు.

సుందరం టెలిగ్రామ్ చదువుకుని అమాంతంగా స్నేహితుణ్ణి కౌగలించుకున్నాడు. అశాంతితో నిండిన అతని జీవితానికి ఇదో ఆశాజ్యోతిలా పనిచేసి, శాంతిని ప్రసాదిస్తుందని ఆశించాడతను. అది కొంతవరకూ నిజమేనేమో! కరుణాకరంలో నిజంగానే ఆనందం వెల్లివిరిసింది. అంత గౌరవం తనకు లభిస్తుందని, అతను కలలో కూడా యెప్పడూ అనుకోలేదు మరి.

''నా హృదయం, ఆనందంతో ఉప్పొంగిపోతోంది కరుణా. నువ్వు నా స్నేహితుడవని చెప్పుకుందుకు గర్విస్తున్నాను కూడాను. నీ శ్రమకు తగిన ఫలితం లభించిందోయ్. అప్పట్లో నేను భయపడ్డాను, నువ్వీ తరహా చిత్రాలు వేస్తున్నందుకు. కాని, వాటి ఔన్నత్యాన్ని నేను గుర్తించలేకపోయాను. అయినా, నాకేం ప్రవేశముందిలే

చిత్రకళలో....అయితే, నువ్వు అక్కడికి వెళ్ళాలి గామోసు?''

''ఉత్తరం వస్తుందన్నారుగా! ఎప్పుడు బహుమతిప్రదానం యేర్పాటుచేసిందీ తెలుసుకుని వెళ్ళొచ్చు. ఈ చిత్రకళా ప్రదర్శనకు ఒక ప్రత్యేకత వుంది సుందరం? బహుమతులు రజితపాత్రలే కాకుండా, నగదుకూడా ఇవ్వడం అ ప్రత్యేకత. చిత్రకళా ప్రదర్శనని యింత పెద్ద స్థాయిలో జరపడం, మన దేశంలో ఇదే ప్రథమం.'' ఉత్సాహంగా చెప్పుకుపోయాడు కరుణాకరం.

''ఇంత పెద్దస్థాయిలో జరుపుతున్న యీ ప్రదర్శనలో, ప్రథమ బహుమతి పొందిన ఘనత ఒక ఆంధ్రుడికి లభించడం, యావదాంధ్రదేశానికే గర్వకారణం, కరుణా! నీ జీవితపుటలో సువర్ణాక్షరాలతో రాయవల్సిన సంఘటన ఇది'' మురిసిపోతూ అన్నాడు సుందరం.

''సుందరం అడుగడుగునా నాకు చేయూతనిస్తూ, నా శ్రేయస్సుకే ప్రయత్నించే నీవంటి సుస్నేహితుడు లభించడం నా అదృష్టం. ఈనాడు నాకీ అదృష్టం పట్టిందంటే, ఇందులో నీకూ భాగం వుంది. లేకుంటే యెప్పుడైనా ఆశించానా యీ బహుమతి? ఇది కేవలం అదృష్టమే!'' స్నేహితుడిపట్ల కృతజ్ఞత ప్రకటిస్తూ అన్నాడు కరుణాకరం.

''అదృష్టం లేనిదే, ఏ అవకాశమూ రాదు కరుణా! నీ ఒక్కడి విషయంలోనే కాదు. ఎవరి విషయంలోనైనా యింతే! నువ్వు మద్రాసు వెళ్ళి బహుమతి అందుకుని వచ్చాక, నేనో పార్టీ యేర్పాటు చేస్తానోయ్....నువ్వు కాదనకేం?'' నవ్వుతూ అన్నాడు సుందరం.

కరుణాకరం మందహాసం చేస్తూ మొహం దించుకున్నాడు. అ క్షణంలో అతనికి మాతృమూర్తి జ్ఞప్తికొచ్చింది. కళ్లు చెమర్చాయి.

''అమ్మ సజీవంగా వుండివుంటే, యెంత సంతోషించి వుండేదో సుందరం!'' అన్నాడు కరుణాకరం. అతని గొంతు బొంగురుపోయింది.

సుందరంకూడా బాధపడ్డాడు. నిజమే! పిన్ని బ్రతికివుంటే, పట్టలేని ఆనందంతో మురిసిపోయేది....బాధగా ఓ నిట్టూర్పు విడిచాడు.

''ఏం చేస్తాం కరుణా? నీ ఔన్నత్యం చూసి, అన[illegible]ంచే అదృష్టం అమెకి లేకపోయింది. అయితేనేం—నీ చుట్టూ పరిభ్రమిస్తోన్న [illegible] ఆత్మ తప్పక సంతోషిస్తూ వుండాలి'' అన్నాడు అనునయపరిచే ధోరణిలో.

కరుణాకరం చెమ్మగిలిన కళ్ళను వొత్తుకొని [illegible] వెళ్ళిపోయాడు.

* *




అయిదురోజులు సెలవు తీసుకుని, మద్రాసు ప్రయాణం కట్టాడు కరుణాకరం. వాళ్ళు ఉత్తరంలో రాసిన అడ్రసుకి చేరుకున్నాడు. తను ఫలానా అని చెప్పుకోవడంతో అతనికి ఆ సంస్థవారిచ్చిన గౌరవం ఇంతా అంతా కాదు.

సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది. చిత్రకళాప్రదర్శన యేర్పాటుచేసిన హాల్లోకి ప్రవేశించాడు కరుణాకరం. అదో పెద్ద హాలు. చుట్టూ గోడలకు చిత్రాలు తగిలించారు. ఒక్కొ చిత్రానికీ దిగువ ఇంగ్లీషులో శీర్షిక, చిత్రకారుని పేరు అతికించారు. చాలామంది కళాభిమానులు, కళాకారులు వచ్చి ఇంకా చిత్రాన్ని చూస్తూనే వున్నారు. తను రాసిన చిత్రందగ్గర క్షణంసేపు నుంచుని చూస్తూ, తన్మయత్వంలో పడిపోయాడు కరుణాకరం. నిజంగా తను యెంత అదృష్టవంతుడు? పూర్వజన్మలో ఏదో సుకృతం చేసుకుని వుండాలి. లేకుంటే, అనుకోకండా యీ అదృష్టం పట్టేది కాదు అనుకుంటూ మురిసిపోతున్నంతలో, సంస్థకు చెందిన ఓ వ్యక్తి అతనికి దగ్గరగావచ్చి వేదికమీదికి రమ్మని కోరాడు. కరుణాకరం వేదికవేపు నడుస్తూవుంటే, అతనికి కాళ్ళు వణికాయి. అడుగులు తడబడ్డాయి. వేదికమీదికొచ్చి ప్రేక్షకులకు సవినయంగా నమస్కరిస్తూ, ఆసీనుడయ్యాడు. అతని ప్రక్కనే ద్వితీయ బహుమతి పొందిన మహారాష్ట్రానికి చెందిన వ్యక్తి, మూడవ బహుమతి పొందిన తమిళ రాష్ట్రీయుడూ, ఇంకా మరికొందరూ వరుసగా కూచున్నారు. బహుమతులిస్తూ వుంటే,

హాలంతా హర్షధ్వానాలతో కరతాళధ్వనులతో ప్రతిధ్వనించింది. కళాభిమానులు, కళాకారులు చాలమంది వచ్చి కరుణాకరంని అభినందించారు. అటువంటి ఘడియ తన జీవితంలో మళ్ళీ రాదనిపించింది కరుణాకరంకి ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు.

ఒక కళాభిమాని కరుణాకరం దగ్గరికి వచ్చి సవినయంగా నమస్కరించాడు. ఆయన వేషభాషల్నిబట్టి మాంచి హోదాలోవున్న వ్యక్తిగా తోచింది. అటువంటి వ్యక్తి తనలోని కళాకారుడికి ఇస్తున్న గౌరవాన్ని గమనించి మురిసిపోయి ప్రతి నమస్కారం చేశాడు.

"మీరు రూపొందించిన 'ఆశాజీవి' చిత్రం నాకు బాగా నచ్చిందండీ! అది నా హృదయంలో మరువలేని ముద్రను వేసింది. అందుకే, దాన్ని నా స్వంతం చేసుకోవాలని అభిలషిస్తున్నాను. దానికి ఖరీదుకట్టే తాహతు నాకు లేకపోయినా, చంద్రునికో నూలుపోగులా వెయ్యిన్నూటపదహార్లు సమర్పించుకుంటాను. నా కోరికను మన్నిస్తారనే నమ్మకం వుంది" అన్నాడాయన.

ఇంతటి సుముఖమైన పరిస్థితులు తన జీవితంలో చోటుచేసుకోవడం ప్రథమంగా చూస్తున్న కరుణాకరం ఇంకేమీ ఆలోచించలేదు. ఆ కళాభిమానికి నిరాశ కలిగించడం కళకే అవమానంగా తోచింది కాదనలేకపోయాడు.

"తప్పకుండా స్వీకరించండి సార్! మీవంటి అభిమానుల ఆదరణే, ఆశీస్సులై నన్ను ముందుకు నడిపిస్తుంది .." ఉత్సాహంగా కృతజ్ఞత ఉట్టిపడుతూవుంటే అన్నాడు.

ఆ కళాభిమాని వెయ్యిన్నూట పదహార్లకు చెక్కు రాసిచ్చి, ఆ కళాఖండాన్ని అమృతభాండం అందుకున్నంత ఆనందంతో తీసుకుని వెళ్ళిపోయాడు.

చిత్రకళాప్రదర్శనాన్ని యేర్పాటుచేసిన సంస్థ వారికి తన హృదయపూర్వక కృతజ్ఞతలు వ్యక్తం చేసుకుని, తిరుగుముఖం పట్టాడు కరుణాకరం. తన 'ఆశాజీవి' చిత్రం మూడువేల నూటపదహార్లు సంపాదిస్తుందని యెన్నడైనా ఊహించాడాతను? అన్న ఆలోచన వచ్చి నవ్వుకున్నాడు లోలోన.

ఇంతదూరం వచ్చి జానకి ఇంటికి వెళ్ళకుండా, వాళ్ళ ఊరుమీదుగా వెళ్ళిపోవడం బావుండదనిపించింది కరుణాకరంకి. మరోవిధంగా చెప్పుకోవాలంటే, అది సాధ్యపడలేదతనికి. చెల్లాయితో తనకు లభించిన గౌరవంగురించి చెప్పుకోకండా యెలా వుండగలడు?

అన్నయ్య హఠాత్తుగా రావడం చూసి ఆశ్చర్యపోయింది జానకి. ఆమె మొహంలో ఆరాటం ద్యోతకమయ్యింది.

"ఏమిటన్నయ్యా, హఠాత్తుగ ఇలా దిగబడ్డావు? ఇప్పుడేబండి వుందని?" అతని మోహంలోకి పరిశీలనగా చూస్తూ అంది. ఆమె ప్రతీ పదంలోనూ ఆతృత ధ్వనించింది.

కరుణాకరం మందస్మితవదనుడై అంతా చెప్పాడు. జేబులోవున్న రెండు చెక్కులూ తీసి చూపించాడు. జానకి మొహంలో వేయిసూర్యుల వెలుగు నిండింది. విస్పారమైన అన్నయ్య బ్రతుకులో, యీ ఒక్క సుక్షేత్రమూ చాలనిపించింది.

"ఇన్నాళ్ళకి నీ శ్రమ ఫలించిందన్నయ్యా! నువ్వీ బొమ్మలు గీస్తుంటావనేగా, వదిన -యెంతో నిరసనగా మాట్లాడేది? ఇప్పుడు వెళ్ళి చెప్పు. చిత్తయిపోయి, సిగ్గుతో మొహం ముడుచుకుంటుంది. అన్నట్టు తెనాలి వెళ్తావా?"

కరుణాకరం ఓ క్షణంపాటు మౌనంగా వుండిపోయాడు.

"వెళ్ళను చెల్లాయ్, నేనుగా అక్కడికి వెళ్ళదల్చలేదు. అలాగని, నాలో పట్టుదల, కోపం, కరడుగట్టి వున్నాయనుకోవద్దు. సుజాత వస్తే నేను కాదనను" అన్నాడు.

అన్నయ్య పాత నిర్ణయానికి యీ షణ్మాత్రమూ చలనం లేనందుకు ఓ నిట్టూర్పు విడిచింది. మరింక బలవంతపర్చడం యిష్టం లేకపోయింది.

"లే అన్నయ్యా, స్నానం చేద్దువుగాని యింతలో భోజనం ఏర్పాటు చేస్తాను" అందామె.

"బావగారు ఆఫీసుకెళ్ళారనుకుంటాను ..."

"ఔనన్నయ్యా! నువ్వు స్నానానికి లే. భోజనంచేసి కాస్సేపు విశ్రాంతి తీసుకుందువుగాని" అంటూ పెరట్లోకి నడిచింది జానకి.

* * *

ఆ రోజు రాత్రి చాలాసేపటివరకూ సుదర్శనం, కరుణాకరం, జానకి యేవేవో కబుర్లు చెప్పుకున్నారు.

"పిన్ని బ్రతికివుంటే, యీ తరుణంలో యెంత మురిసిపోయేదో అన్నయ్యా!" అంది జానకి, కాంతమ్మను గుర్తుకు తెచ్చుకుంటూ.

కరుణాకరం కళ్ళల్లో పలుచని నీటిపొర యేర్పడింది. నిజమే! బహుమతి అందుకుంటున్న క్షణంలో తల్లి గుర్తుకొచ్చిందికూడా.

"నిజం చెల్లాయ్. అమ్మ ఆనందాన్ని కళ్ళారాచూసే అదృష్టం నాకు లేకపోయిందన్న బాధమాత్రం మిగిలిందిప్పుడు" నిస్పృహతో అన్నాడు.

"ఇప్పుడు, అవన్నీ గుర్తుకు తెచ్చుకోవడం మంచిదికాదు బావగారూ! కాల

గర్భంలో కలిసిపోతున్న గతాన్ని మననం చేసుకోవడం మానేసి, అలా అలా మర్చిపోవడమే శ్రేయస్కరం'' అంటూ ఆ ప్రస్తావనకి మలుపుతిప్పాడు సుదర్శనం.

''అంతేలెండి బావగారూ! అంతకంటె మానవమాత్రులు చేయగలిగిందేముంది గనుక. '' వేదాంతంలోకి దిగిపోయాడు కరుణాకరం.

జానక్కి మళ్లీ భయం పట్టుకుంది, అన్నయ్యలో యింకేమార్పు వస్తుందోనని.

''సరేగాని, యెన్నాళ్ళు సెలవు పెట్టావన్నయ్యా?'' అంది.

''ఎల్లుండే డ్యూటీలో చేరాలి చెల్లాయ్, రేపు బైలుదేరి వెళ్ళిపోతాను ''

''అదేమిటి బావగారూ! రాకరాక యెన్నాళ్ళకో వచ్చారు. నాలుగైదురోజులు వుండి వెళ్ళండి'' సుదర్శనం అన్నాడు.

''లేదు బావగారూ? ఆఫీసులో పని ఒత్తిడి అధికంగా వుంది. అదీగాక, నేను వుండి యేంచేస్తాను చెప్పండి? చెల్లాయిని, మిమ్మల్ని చూసిపోవాలని వచ్చాను. చూసేశాను. ఇంతకంటె నాకు కావల్సిందేమిటి చెప్పండి?'' నవ్వుతూ అన్నాడు కరుణాకరం.

''అయితే బావగారూ, మీరిలా యెన్నాళ్లిలా ఒంటరి జీవితాన్ని గడుపుతారు చెప్పండి? సుజాత తొందరపడిందే అనుకోండి. మీవంటి సహృదయులు, సహన శీలురు ఆమెను క్షమించలేరూ?'' ఎప్పుడూ యీ విషయంలో కలుగజేసుకోని సుదర్శనం, ఆరోజు కలుగజేసుకుంటూ అన్నాడు.

''క్షమించడానికేముంది బావగారూ? అసలు ఆ ప్రసక్తే వుండదు. ఆమె ఎప్పుడు వచ్చినా ఆదరించడానికి సంసిద్ధుణ్ణే! అయితే, నేనుగా ఆమెను రమ్మని అర్థించను. అది నా ఆత్మాభిమానానికి సంబంధించిన విషయం కదా! అందుకే!'' కరుణాకరం మామూలు ధోరణిలోనే చెప్పాడు. అతని మాటల్లో యెక్కడా కోపంగాని, ద్వేషం గాని, పట్టుదలగాని వెదికినా అగుపించవు.

కాస్త మెదడుకి పని కల్పించినమీదట, సుదర్శనంకీ అది సమంజసంగానే తోచింది.

''అయితే యింకేం? మీమీద బాధ్యత లేదు. సుజాతే ఆలోచించాలిప్పుడు. అది ఆమెకే వదిలేద్దాం '' న్యాయమూర్తి తీర్పు చెప్పినట్టుగా వున్నా యతని మాటలు.

''నా అభిప్రాయమూ అదే బావగారూ! నాకు యెవ్వరిమీదా యెప్పుడూ కోపం వుండదు. ఒకవేళ పరిస్థితులననుసరించి కోపం వచ్చినా, అది తాత్కాలికమైనదే. అసూయగాని, ద్వేషంగాని పట్టుదలగాని అంతకంటె ఉండవు. ఇది అర్థం చేసుకున్న వాళ్ళు, నన్ను పూర్తిగా అర్థం చేసుకున్నట్టే!''

సుదర్శనం మాట్లాడలేదు.

"చాలా వేళయ్యింది. పడుకో అన్నయ్యా!" అంటూ లేచింది జానకి.

"గుడ్‌నైట్ బావగారూ!" సుదర్శనంకూడా లేచాడు.

"గుడ్‌నైట్...." మంచంమీద ఒరిగాడు కరుణాకరం.

జానకి, సుదర్శనం వెళ్ళిపోయారు. కరుణాకరంకి ఏవేవో మధురస్వప్నాలు వచ్చాయి.

# 17

రోజులు గడుస్తున్నయ్. ఎవరి పట్టుదలల్ని వారు పదిలంగా దాచుకున్నారు.

హఠాత్తుగా ఓరోజు గంగాధరంకి ఓ శుభలేఖ అందించిపోయాడు పోస్టుమాన్. యథాలాపంగా దాన్ని విప్పి చదువుకున్న గంగాధరం స్తంభించిపోయాడు. అతని గుండెలు జోరుగా కొట్టుకోసాగాయి. శరీరం ముచ్చెమటలు పోసింది.

"రత్నం ఏమేవ్ రత్నం .." ఆరాటంతో లోపలికి కేక వేశాడు.

రత్నం కంగారుగా అక్కడికి వచ్చింది లోపల్నించి. ఆమెవెంట సుజాత వుండనే వుంది.

"ఏవిటండీ? ఏదో ముంచుకుపోతున్నట్టే గావుకేక వేస్తారెందుకూ?" సహజ ధోరణిలో చిరాగ్గా అంది. ఆమె మొహం జేవురించిందంతలోనే,

"నిజంగానే ముంచుకుపోయింది రత్నం! ఈ శుభలేఖ చూడు" అంటూ చేతిలోని శుభలేఖను భార్యచేతికిచ్చాడు.

రత్నం ఆ శుభలేఖ చదివింది. తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. ఆమె మొహం మరింత యెర్రబారింది కోపంతో. కళ్ళు చింతనిప్పులే అయ్యాయి.

"ఏవిటీ? కరుణాకరంకి పునర్వివాహమా?" కోపంతో అన్నా, ఆ స్వరంలో ఆశ్చర్యమూ యిమిడివుంది.

సుజాత బ్రమ్మన్పడిపోయిందా మాట వినగానే. నెత్తిమీద పిడుగు పడినట్టయ్యింది. తల్లి చేతిలోని శుభలేఖ అందుకుని ఆత్రంగా చదివింది. చదువుతూవుంటే కళ్ళు బైర్లు కమ్మాయి. చేతులు వణికాయి. మెదడు పనిచెయ్యడం మానేసింది.

"అమ్మా!" అంటూ బావురుమని తల్లి భుజమ్మీద వాలిపోయింది సుజాత. ఆమెలో కరడుగట్టిన అహం, పట్టుదల, ఆధిక్యత అన్నీ ఒక్కసారి కరిగిపోయి, కన్నీరుగా వెలికి రాసాగినయ్. ఆమె మొహంలో ఆరాటమూ, ఆవేదన ప్రస్ఫుటమయ్యాయి.

రత్నం మొదట్లో కంగారుపడినా చప్పున ధైర్యాన్ని చిక్కబట్టుకుంది. ఈ పరిస్థితిలో కంగారుపడ్డం తెలివితక్కువతన మనిపించింది.

"నువ్వేమీ అధైర్యపడకమ్మా! ఈ పెళ్లి యెట్లా జరుగుతుందో నేను చూస్తాను. శుభలేఖలు పంచినంతమాత్రాన పెళ్ళి జరిగిపోతుందనుకుంటున్నాడు గామోసు కరుణాకరం! ముప్పతిప్పలు బెట్టి మూడుచెరువుల నీళ్లు త్రాగించనూ? భార్య సజీవంగా వుండగా పునర్వివాహం చేసుకోవడమంటే, అంత సుళువుగా తేలిపోయే వ్యవహార మనుకుంటున్నాడు గామోసు!" రుసరుసలాడుతూ అంది.

గంగాధరం నిస్సహాయంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"తొందరపడకు రత్నం! నువ్వనుకునేంత సుళువుగా జరిగేపని కాదు. అమ్మాయి, వాళ్ళ యిష్టానికి వ్యతిరేకంగా యిక్కడికి వచ్చేసిన వైనం చాలామందికి అక్కడ తెలిసే వుంటుంది. అమ్మాయి సంసారాన్ని చక్కదిద్దే బాధ్యత మనమీద వున్నా, మనం యేమీ పట్టించుకోలేదు. అంతేగాకుండా, సుందరం మన శ్రేయస్సుకోరినవాడిగా మూడు నాలుగు ఉత్తరాలు రాసినా మనం జవాబివ్వలేదు. కనీసం వాస్తవ పరిస్థితుల్ని తెలుసుకునే ప్రయత్నమైనా మనం చెయ్యలేదు. ఎలా చూసినా అశ్రద్ధ మనవేపే కనిపిస్తోంది. ఈ విషయాలన్నీ యెవరు విన్నా మనల్నే నిందిస్తారు గాని, కరుణాకరంని పల్లెత్తుమాట అనలేరు. నలుగురిలో మనం మొహమెత్తుకోలేని పరిస్థితి యేర్పడుతుంది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకునే, మొదట్నుంచీ నేను పోరుతూనే వున్నాను. అబ్బే! వినిపించుకుంటే కదూ? ఆడపిల్లవాళ్ళం, మనం కాస్త అణిగిమణిగి వుండాలంటే ససేమిరా కాదన్నావు. మంచిచెడ్డల్ని ఆలోచించకుండా అమ్మాయినే వెనకేసుకొచ్చావు. ఇప్పుడెలా సమర్థిస్తావో సమర్థించు" అన్నాడు. భార్యను నిందించడానికి దొరికిన సదవకాశాన్ని దుర్వినియోగం చేసుకోదల్చలే దతను.

భర్తకేసి తీక్ష్ణంగా చూసింది రత్నం. ఇంతకుముందు యెప్పుడలా చూసినా, భర్త మొహం దించుకోవడమో, పక్కకి తిప్పుకోవడమో జరిగేది. కాని, యీసారి అందుకు భిన్నంగా భార్యకేసి చూశాడు.

రత్నంకి ఆశ్చర్యం కలిగింది. అయినా, తన ఆధిక్యతను జారవిడుచుకునే ఉద్దేశం కలగలేదామెకి. భర్తచూపులు, ఆమెను వెక్కిరించినట్టుగా తోచాయి. ఆమెలో ఉక్రోషం యినుమడించింది.

"సమర్థిస్తాను సమర్థిస్తాను చూస్తారుగా! ఈ రత్నం సంగతి, అతడికి బాగా తెలీదింక. అదేదో అనుభవమైతేనే గాని, అతడి తిక్క కుదరదు." తీక్ష్ణంగా అంటూ కూతురికేసి ఆప్యాయంగా చూసి, అనునయపరుస్తున్నట్టు భుజం తట్టి "నువ్వేమీ

 యువ

కంగారుపడకమ్మా! నేనుండగా నీకేం భయంలేదు" అంది నిబ్బరంగా.

గంగాధరంకి వొళ్ళు మండిపోయింది. భార్య కొత్తగా బాధ్యత తెలిసిన మనిషిలా మాట్లాడుతూ వుండటం, ఆశ్చర్యం కలిగించడమే గాకుండా, అతని కోపాన్ని రెచ్చ గొట్టింది. ఇన్నాళ్ళూ యే విషయాన్నీ అంతగా పట్టించుకోకండా, సామరస్యంగా కాలాన్ని వెళ్ళబుచ్చుదామన్న ఉద్దేశంతో తను ఊరుకోవడంవల్లనే, రత్నం తనని మట్టిబొమ్మను జేసి, మరింత మిడిసిపడుతుందేమో ననుకున్నాడు. తన కూతురు సంసారం విచ్ఛిన్నమైతే, యీ సంఘం యెవర్ని నిందిస్తుంది? తననే! రత్నం మిడిసిపాటుగాని, సుజాత తొందరపాటుగాని, యెవరూ పట్టించుకోరు. సుజాత తండ్రిగా, యింటి యజమానిగా, తననే ప్రతి ఒక్కరూ నిందిస్తారు, తన చేతగాని తనాన్ని ఆపహసిస్తారు. ఈ విమర్శల్ని తనెందుకు యెదుర్కోవాలి? అతనిలో ఒక విధమైన నూత్న చైతన్యం చోటు చేసుకుంది. రత్నం నోరు కట్టించేసి, యేదో విధంగా కరుణాకరం పెళ్ళి తప్పించి, కూతురి సంసారాన్ని చక్కదిద్దాలనుకున్నాడు. అది తన కర్తవ్య మనుకున్నారు.

"ఇక నీ పెద్దరికం చాలించు రత్నం. ఇంతవరకూ నువ్వు చూపిన ప్రతాపాల్ని ఓ మూలకి నెట్టు. నీ అడుగుజాడల్లో నడిచింది గాబట్టే, అమ్మాయికీ కళ్ళు నెత్తి కెక్కాయి. విచక్షణజ్ఞానం నశించింది. లేకపోతే యేవిఁటి? కరుణాకరంవంటి వాణ్ణి యెదిరించి వస్తుందా? పోనీ తొందరపాటు వల్ల యేదో పొరపాటు జరిగిందే అను కుందాం, దాన్ని సరిదిద్దు కోవడానికి, పరిస్థితిని అనుకూల పర్చుకోడానికి ప్రయత్నిం చాలి గాని, గోరంత కొండంతచేసి, వాతావరణాన్ని కలుషితం చేసుకుంటే, యిదిగో యిలాంటి సమస్యలే యెదురవుతాయి. ఎల్లుండే వివాహం గాబట్టి, రేపే ప్రయాణం కట్టాలి తప్పదు మరి. ఇక్కడవుండి మనం చేయగలిగింది యేమీ లేదు." చకచక నాలుగు మాటలు గట్టిగా అనేసరికి, రత్నం నిర్ఘాంతపోయి, భర్తకేసి అదోలా చూసింది. 'భర్తేనా తనెదుట మాట్లాడుతోంది ...' అన్న సందేహం కూడా ఆమెకి కలిగిందంటే. ఆశ్చర్యం లేదు.

సుజాతకీ, తండ్రిమాటలు కొత్తగా వున్నా. ఆమె ఇప్పుడవేమీ పట్టించుకునే స్థితిలోలేదు. ఆమె ధ్యాసంతా, భర్త పునర్వివాహం గురించిన ఆలోచనల్లోనే వుంది. ఆమె హృదయం కల్లోలిత మయ్యింది.

"నేను అన్నదీ అదేకదండీ! రేపే బైలుదేరాలి మనం. మహాపెద్ద సమస్యల్ని పరిష్కారం చేసినట్టు కబుర్లు చెబుతారేవిఁటి?" అంది పరిధిని దాటిపోతున్న భర్తను అదుపులోకి తీసుకోవడానికి ప్రయత్నిస్తూ.

గంగాధరం, వాడిగా చూశాడీసారి. ''అదిగో ఆనోటివాడినే తగ్గించమంటున్నాను. గతాన్ని పూర్తిగా మర్చిపోయి, కొత్త జీవితాన్ని ప్రారంభించు. అణకువ అనే గుణం. నీలో లేకపోయినా, తెచ్చిపెట్టుకో! లేకపోతే, ఫలితాన్ని నువ్వే అనుభవిస్తావు. ఇప్పుడే చెబుతున్నాను—మనం విశాఖ వెళ్ళాక, నువ్వేమీ మాట్లాడానికి వీల్లేదు. తగుదునమ్మా అని. ఆధిక్యత చూపించకు. ఆవ్యవహారమేదో నేనే చూసుకుంటాను. ఇది నీకు సమ్మతమైతేనే నాతోరా! లేదంటే, యిక్కడే వుండిపో!'' అంటూ ఖచ్చితంగా చెప్పాడు. వెంటనే కూతురుకేసి తిరిగి ''ఏవమ్మా సుజాతా, యిప్పుడైనా నీ స్థితి యేవిటో, అర్థం చేసుకున్నావా? ఒకవేళ మన ప్రయత్నాలు విఫలమై, శుభలేఖలో పేర్కొన్న విధంగానే కరుణాకరం వివాహం జరిగితే. నీ బ్రతుకు యేమౌతుందో, ఒక్కసారి వూహించమ్మా! అమ్మచెంగు బట్టుకుని, యిప్పుడు తిరుగుతున్నంత హాయిగా వుండదమ్మా అప్పుడు. సంఘానికి తక్కువై పోతావు. లోకుల విమర్శకు గురి అవుతావు. మీ అమ్మలా, అర్థంలేని మాటలు నేను చెప్పనమ్మా. చెప్పే మాటల్ని ఆచరణలో పెట్టగలమా. లేదా అన్న తర్కంతో ఆలోచించి. నిర్ణయానికొచ్చి మరీ మాట్లాడతాను'' అన్నాడు గంగాధరం. అతని స్వరంలో యెప్పుడూ లేని గంభీరత, నిశ్చలత, ధ్వనించాయా క్షణంలో.

రత్నం, మూతి విర్చుకుంది. భర్తలో హఠాత్తుగ వచ్చిన మార్పు, ఆమెకి భీతిని కలిగించిందనే చెప్పాలి. అందుకేనేమో, తన స్థితిని గ్రహించుకుని, మౌనం దాల్చింది.

సుజాత మొహం దించుకుని. ఆలోచనల్లో పడింది. ఏం జరుగనున్నదో. వూహించుకో లేక పోయింది. ఏదో భయం, ఆరాటం, ఆమెను ఆవహించాయి. ఆమె చేతిలోవున్న శుభలేఖ, చేతి కంపనకు రెపరెప లాడుతోంది. కళ్ళల్లో నీరు గిర్రున తిరుగుతూవుంటే. యింక అక్కడ వుండలేక. నిర్జీవంగా అడుగులు వేసుకుంటూ, లోపలికి వెళ్ళిపోంది. దుఃఖం పెల్లుబకగా, వెక్కి వెక్కి యేడుస్తూ మంచం మీద ఒరిగిపోయింది.

కూతురు యేస్థితిలో లోపలికి వెళ్ళినదీ గమనించాడు గంగాధరం.

''అమ్మాయి, యిప్పుడు పశ్చాత్తాప పడుతున్నట్టుంది రత్నం! మొదటే జ్ఞానం వుండివుంటే పరిస్థితి ఇంతదూరం వచ్చేదికాదు. కొంతనయం—ఇప్పటికయినా నిజాన్ని గ్రహించింది. అసలు పరిస్థితి యింతమేరకు వచ్చిందంటే, దీనికి బాధ్యులెవరో తెలుసా రత్నం? నువ్వే!'' విసురుగా అన్నాడు.

రత్నం, ఈసారి జవాబివ్వలేదు. 'హుఁ' అంటూ నిర్లక్ష్యంగా హుంకరించి.

విసురుగా అక్కణ్నించి వెళ్ళిపోయింది లోపలికి.

గంగాధరం, ఓ నిట్టూర్పు విడిచాడు. తను, ఇప్పటికయినా కళ్ళుతెరవడం, మంచిదయ్యిందనుకున్నాడు. అతని మస్తిష్కంలో యేవేవో ఆలోచనలు యెడతెరిపి లేకుండా స్వైరవిహారం చేస్తున్నయ్.

రివ్వున గాలివీస్తోంది. కిటికీ రెక్కలు కొట్టుకుంటున్నయ్. ఇవేమీ పట్టించుకోనే లేదు గంగాధరం. ఆలోచనలు సాగిస్తూనే వున్నాడు.

# 18

విశాఖపట్నం సమీపిస్తున్న కొద్దీ, సుజాతకి హృదయ స్పందన అధికమౌతూవుంది.

స్టేషన్లో రైలు ఆగింది. గంగాధరం, రత్నం, సుజాత దిగారు. ప్రయాణీకుల హడావిడి గందరగోళంగా వుంది. సుజాత చుట్టూ ఓ సారి కలయజూసింది. యధాలాపంగా, అకస్మాత్తుగ, అల్లంత దూరంలో జానకి కనిపించేసరికి, ఆమెకి ఆశ్చర్యం కలిగింది. ఆమె పక్కనే సుదర్శనమూ వున్నాడు. వాళ్లూ, తాము వచ్చిన బండిలోనే వచ్చినట్టు గ్రహించింది. బహుశా, వారికీ శుభలేఖ అంది వుంటుంది గామోసు— అనుకుంది. ఆమె ఆతృత రెట్టింపయ్యింది. వాళ్ళకి తప్పకుండా వివరాలు తెలిసి వుంటాయన్న నమ్మకం కలిగింది. జానకి పట్ల అంతవరకూ ఆమెలో వుంటూ వచ్చిన ద్వేషభావం, అప్పుడే సమసిపోయింది. "వదినా" అంటూ పిలుస్తూ, అక్కడికి గబగబా నడిచింది.

జానకి ఆ పిలుపును, అంతగా పట్టించుకోలేదు. ఆ పిలుపు తనకేనని ఆమె అనుకోలేదు. అందుకే, వెనుదిరిగి చూడలేదు కూడాను. అయితే, సుజాత దగ్గరగా వచ్చి పలుకరిస్తే ఆశ్చర్యపోయింది. సుదర్శనమూ విస్తుపోయాడు.

"నువ్వెప్పుడొచ్చావు వదినా?" అంది జానకి, ఆశ్చర్యం ప్రకటిస్తూ, సుజాతకేసి దీక్షగా చూపి.

"ఈ బండిలోనే వస్తున్నాను వదినా!" అంది, సుజాత. ఆమె స్వరంలో వుత్సాహం లోపించింది. ఎందుకోమరి—జానకి మొహంలోకి సూటిగా చూళ్ళేక పోయింది. ఆ పరిస్థితిలో అది సహజమే మరి.

"ఇంతవరకూ యెక్కడా అగుపించలేదే! అసలు. తెనాలిలో నీగురించి చూడాలన్న ధ్యాసే లేకపోయింది వదినా. నువ్వూ బైలుదేరతావని, వూహించలేక పోయాను. నువ్వు ఒంటరిగా వచ్చావా?" అంది, జానకి.

"అమ్మా, నాన్న కూడా వచ్చేరు. అదిగో యిటే వస్తున్నారు" అంటూ సుజాత వాళ్ళకేసి చూపించింది. గంగాధరం, రత్నం, ఆసరికే దగ్గరికి వచ్చేశారు. వాళ్ళిద్దర్నీ పలుకరించింది జానకి. సుదర్శనమూ పలుకరించాడు. రత్నం పెదాలపై కృత్రిమమైన చిరునవ్వు మెదిలింది.

"మీకూ శుభలేఖ అందిందేవిఁటమ్మా జానకీ?" మామూలు ధోరణిలోనే అంది రత్నం. ఆ విషయంలో ఆమెకి యేవిధమైన భయంగాని, ఆరాటంగాని, లేదన్న సంగతి ఆమె మాటల్లో స్పష్టమౌతోంది.

"ఔను అత్తయ్యా!" అందింది. దాన్ని చూడగానే ఆశ్చర్యపోయాం మేం. మాకేమీ అర్థంకాలేదు. వెంటనే బైలుదేరాం." జవాబిచ్చింది జానకి.

"అయితే, మీకూ యీ సందర్భంలో వివరాలు తెలీవన్నమాట." ఆశ్చర్యపోతూ అడిగాడు, గంగాధరం.

"ఏ వివరాలూ తెలీవు మావఁగారూ. అసలు, ఇంతకుముందు చూచాయగా ఎటువంటి వుత్తరమూ లేదు." అంది జానకి.

తమకి సుందరం ఓ వుత్తరం రాసిన వైనం, వెల్లడి చెయ్యలేదు గంగాధరం. అది చెబితే, నింద తమమీదే పడుతుందన్న సందేహం వల్ల వూరుకున్నాడు.

"ఆశ్చర్యంగా వుందమ్మా, యీ హఠాత్పరిణామానికి." అన్నాడు.

"అదే మేమూ అనుకుంటున్నాం. ఓ వారం రోజులక్రితమే అన్నయ్య, మా వూరొచ్చి వెళ్లాడండీ? అప్పుడైనా, యీ ప్రసక్తే తీసుకురాలేదు" అంది మళ్ళీ జానకి.

"కరుణాకరం మీ వూరొచ్చాడా?" మరింత ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అన్నాడు. గంగాధరం.

సుజాత, ఆసక్తిగా వింటోంది. రత్నం కళ్ళల్లో అప్పుడే యెరుపుదనం గూడు కట్టుకుంటోంది. తమ వూరి మీదుగా వెడుతూకూడా తమ యింటికి రానందుకు,కరుణాకరంపై పట్టరాని కోపంవచ్చింది. అయితే, గంగాధరంకి కోపం రాలేదుగాని బాధ కలిగింది.

గంగాధరం ప్రశ్నకు, జానకి జవాబిస్తున్నంతలో సుదర్శనం అందుకున్నాడు.

'ఔనండీ! ఈమధ్య మద్రాసులో భారీయెత్తున చిత్రకళా ప్రదర్శనానికి, బావగారు కూడా ఓ చిత్రాన్ని పంపించారుట. అయితే, అదృష్టవశాత్తూ, బావగారి చిత్రానికే ప్రథమ బహుమతి లభించిందట. ఆ బహుమతిని స్వీకరించడానికి మద్రాసు వెళ్ళి, తిరిగివస్తున్నపుడు, మా యింటికొచ్చారు. అర్ధరాత్రివరకూ యేవో కబుర్లు చెప్తూ




కున్నాం గాని, యీ వివాహ ప్రసక్తే రాలేదండీ. ఇది మాకూ అబ్బురంగానే వుంది. అంతటి సహృదయుడు, సహనశీలి, ఇంత తొందరపడి, ఇటువంటి నిర్ణయాన్ని తీసుకుంటాడని, మేమూ వూహించ లేకపోయాం!"

'నాకూ మొదట్నుంచీ అనుమానంగానే వుంది. అతని మనస్తత్వం గురించి, పైటికి అగుపించినంత మెత్తనివాడేంకాదు కరుణాకరం.'' అంది గుసగుసలాడుతూ.

గంగాధరం, భార్యకేసి తీక్షణంగా చూశాడు. ''రత్నం, నేనేం చెప్పానో మర్చిపోయావా? నువ్వు నోరుమూసుకో!'' అని మందలిస్తూ, సుదర్శనం కేసి తిరిగాడు.

''చూడు బాబూ సుదర్శనం, మనుషులందరూ ఒకే రీతిగ వుండరన్న సంగతి, లోక విదితమే. వారి మనసులూ ఒకేలా వుండవు. మా సుజాత మనస్తత్వం అదో తరహాకు చెందింది అని చిలిపితనంగా మాకు తోచింది. వివాహ మయ్యాక, మనస్తత్వంలో పూర్తి పరిణామం వస్తుందనుకున్నాం, కాని, మావూహ తప్పయ్యింది. ఏది యెలా వున్నా, యీ పరిస్థితులు యింతమేరకు రావడానికి కొంతకారణం మా అవిడే! ఇప్పుడవన్నీ తర్కించుకోవడం కంటె, ప్రస్తుత కర్తవ్యం ఆలోచించాలి. కోర్టులవెంట కాళ్ళు అరిగేలా తిరగడం, అడ్డమైన వాళ్ళందర్నీ అర్థించి, సాక్ష్యాన్ని

సేకరించడం, పుష్కలంగా డబ్బు గుమ్మరించడం—యివన్నీ తల్చుకుంటేనే భయం వేస్తోంది. ఇన్నీచేసినా ఫలితం సుముఖంగా వుంటుందా అంటే, అదీ వుండదు. అటువంటి గొడవలకు వీలేకముందే, కరుణాకరంకి జరగబోయే ఈ వివాహాన్ని ఎలాగైనా తప్పించే మార్గం చూడాలి బాబూ! నువ్వు చిన్నవాడివయినా, నీ సహకారాన్ని అర్థిస్తున్నాను. ఈ ప్రయత్నం బాహాటంగా జరగకూడదు. బైటికిపొక్కితే, నలుగుర్లో తలవంపు మనకే కదా! అంచేత, యీ ప్రయత్న భారాన్ని నువ్వూ, జానకీ తీసుకోవాలని, నాకోరిక. సుజాత, తన తొందరపాటుకి పశ్చాత్తాప పడుతున్నట్లు చెప్పాలి" అన్నాడు, గంగాధరం కాస్తంత ప్రాధేయపడుతూ.

సుదర్శనంకి, అతనిపట్ల ఎంతో జాలికలిగింది. "అలాగేనండీ; తప్పక ప్రయత్నిస్తాం." అంటూ భార్యకేసి చూశాడు సుదర్శనం.

జానకి, గంగాధరం వేపు చూసింది.

"మావఁగారూ! సుజాత జీవితం నాశనమవ్వడం, మాకు మాత్రం ఆనంద మనుకుంటున్నారా? అన్నయ్యవంటి వ్యక్తి, పునర్వివాహానికి పూనుకున్నాడంటే, అందుకు దోహదమైన కారణం యేవిఁటో పూర్తిగా తెలుసుకోవాలి కదా! అది తెలుసుకున్నాక, శక్తి వంచనలేకుండా ప్రయత్నిద్దాం పదండి. ప్లాట్‌ఫారమ్ మీదే చాలాసేపు మట్లాడేశాం. పదండి పోదాం." అంది జానకి.

కూలీలచేత సామాన్ను పట్టించుకుని, అంతా బైలుదేరారు.

# 19

వాళ్ళంతా ఇల్లు చేరుకునే సరికి, కరుణాకరం యింట్లోనే వున్నాడు. ఆ ఇంట్లో యేవిధమైన సందడిగాని, హడావిడిగాని, అలంకరణగాని అగుపించలేదు వాళ్ళకి. ఈ వాతావరణం, మరింత ఆశ్చర్యంలో ముంచింది వాళ్ళని.

గుమ్మంలో హడావిడి చెవులపడి, బైటికి వచ్చిన కరుణాకరం, యింతమందీ ఒకేసారి రావడానికి కారణాన్ని వూహించుకో లేక, విస్తుపోయాడు.

"ఏవిఁటి చెల్లాయ్, వుత్తరం రాయకుండా వచ్చేశావు?" జానకిని వుద్దేశించి అంటూ, మిగతావాళ్ళను కూడా మామూలు ధోరణిలో పలుకరించాడు. ఒక్క సుజాతను తప్పించి. ఆమెను పలుకరించడానికి అతని మనస్సు అంగీకరించలేదు.

సుజాత మనస్సు, చివుక్కుమంది. అయినా, ఆమె చేయగలిగిందేముంది గనుక, లోలోన యెంతో బాధపడింది.

కరుణాకరంకేసి అందరూ ఆశ్చర్యంగా చూశారు. జానకి, అన్నయ్య మొహం లోకి పరిశీలనగా చూసింది.

"ఏమిటి నువ్వంటున్నదన్నయ్యా? పరిహాసం కాదుకదా?" గంభీరంగా ప్రశ్నించింది,

"పరిహాసమా? ఎందుకు? ఇవ్వాళ వింతగా మాట్లాడుతున్నా వేమిటి చెల్లాయ్." అన్నాడు రెట్టిన సంభ్రమంతో. తనకేసి వాళ్ళందరూ యెందుకట్లా వింతగా, విచిత్ర వ్యక్తిని చూస్తున్నట్లుగా చూస్తున్నారో అర్థంగాక తెల్లబోయాడు కూడాను.

సుదర్శనం, పరిస్థితిని ఆకళింపు చేసుకున్నాడు. శుభలేఖ విషయంలో యేదో రహస్యం యిమిడివుందన్న సందేహం, అతనికి కలిగింది. అంచేత, చప్పున నిజం చెప్పడం శ్రేయస్కర మనిపించింది.

"బావగారూ, మీ చెల్లాయి వింతగా మాట్లాడ్డం లేదు కాని, మాకు అందిన వార్త మాత్రం వింతగానే వుంది." అన్నాడు.

"అంటే? ఏమిటో ఆవార్త చెప్పండి మరి!" ఆతృతగా అడిగాడు, కరుణాకరం.

"మీరు మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నట్లు, మాకు శుభలేఖ అందింది." అన్నాడు సుదర్శనం.

కరుణాకరంకి పెద్ద షాక్ తగిలినట్లయ్యింది. స్తంభించిపోయాడు. ఏదో చెప్పలేని అయోమయావస్థలో పడిపోయాడు.

"నాకు మళ్ళీ పెళ్లా!" అతని గొంతు, పూడుకుపోయి నట్లయ్యింది. అర్థంకాని ఆశ్చర్యంతో, అతని కనుబొమలు ముడిపడ్డాయి.

"ఔను బావగారూ, మాకు పంపిన ఈ శుభలేఖ చూడండి." అంటూ ఫేంటు జేబులోంచి శుభలేఖ తీసి అందించాడు. సుదర్శనం. అదే సమయంలో గంగాధరం కూడా తనకి వచ్చిన శుభలేఖ అందించాడు.

కరుణాకరం ఆరెండు శుభలేఖల్ని అందుకుని, ఆత్రంగా చదువుకుని, తెల్ల మొహం వేశాడు. క్షణంసేపు నోట మాటరాక, అచేతనంగా వుండిపోయాడు. సుందరం యీ శుభలేఖ యెందుకు అచ్చువేయించి, వీళ్ళకి పంపాడో, ఓ పాళాన అతనికి అర్థం కాలేదు.

అల్లుడు ఆలోచనల్లో పడ్డట్లు యిట్టే గ్రహించాడు, గంగాధరం.

"ఏమిటిబాబూ, అలా తెల్లబోయి చూస్తున్నావు? మళ్లీ పెళ్లి చేసుకోవాలని నువ్వు ప్రయత్నించడం లేదూ? లేక, నీ నటనతో మమ్మల్ని మభ్యపెట్టాలని చూస్తున్నావా?" అన్నాడు గంగాధరం వుండబట్టక.

విషయమేమిటో తెలియని కరుణాకరం, నిస్సహాయంగా ఓ నిట్టూర్పు విడిచాడు ఈ ప్రయత్నంలో సుందరం యేదో ఫలితాన్ని ఆశిస్తున్నాడేమో ననిపించింది

"అటువంటి ప్రయత్నం యేదీ లేదు మావఁగారూ। ఒకవేళ అలాంటిదేదో వుండి వుంటే, యెవరికి తెలియజేసినా, మానినా, మా చెల్లాయికి తెలియ జెయ్యకుండా వుంటానా చెప్పండి" అన్నాడు కరుణాకరం

"అదే నా అభిప్రాయం కూడాను అన్నయ్యా।" అంది జానకి

"అయితే చెల్లాయ్, యిప్పటికీ నీకు నమ్మకం కలగడం లేదా?" అన్నాడు, ఆమె కేసి అమాయకంగా చూస్తూ

"అయితే, యీ ఆశాదేవి యెవరో నీకు తెలీదంటావు? అంతేనా అన్నయ్యా?"

"నిజంగా నాకు తెలీదు చెల్లాయ్ అసలు, ఆ పేరుగల అమ్మాయిని నే నెరుగను అటువంటిది యెట్లా వధువుకాగలదు? సుందరం యెందుకిలా చేశాడో, నాకే బోధ పడ్డం లేదు, ఈ గొడవ యేదీ నాకుతెలీదు నాకు తెలిసినంతవరకూ, యివ్వాళ సాయంత్రం మా ఆఫీసు హాల్లో నన్ను సన్మానించాలన్న వుద్దేశంతో ఓ చిన్న పార్టీ యేర్పాటు చేశాడు సుందరం ఇవ్వాళ ఆఫీసు సెలవుగా? ఇంతకుమించి, మరే వివరాలూ నాకు తెలీవు"

అన్నయ్య మాటల్ని, జానకి సంపూర్ణంగా విశ్వసించింది ఆమెకి బాగా తెలుసు, అన్నయ్య అబద్ధం చెప్పడని తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచింది, మిగతావాళ్లు కూడా శంగారును పోగొట్టుకున్నారు సుజాత హృదయం తేలికపడింది ఆమెలో చెలరేగిన తుపాను, అంతమయ్యింది అయితే, రత్నం మాత్రం వూరుకోలేదు

"అయినా, ఇటువంటి లేనిపోని సంఘటనలు సృష్టించి, మనల్ని హడలు కొట్టించడమే గాకుండా, అభం శుభం యెరుగని మా అమ్మాయి మనస్సుని నొప్పించడానికి, ఆ సుందరంకి యెన్ని గుండెలుండాలి? ఎవరిచ్చారీ అధికారం అతడికి? ఇదేదో తేల్చుకోవల్సిందే" అంది రుసరుసలాడుతూ

గంగాధరంకి వొళ్ళు మండిపోయింది భార్య మళ్లీ పాతధోరణి ప్రారంభించడం అతనిలో అసహ్యం రేపింది అయితే, అంతలోనే సుందరం వచ్చాడు స్కూటర్ మీద

"సమయానికి నువ్వొచ్చావు రావోయ్ సుందరం మీ పిన్ని నీమీద కారాలు మిరియాలు నూరుతోంది" అన్నాడు గంగాధరం,

సుందరం మందహాసంతో ముందుకువచ్చి "అందరూ యిక్కడే నుంచుండిపోయారేవిఁటి? లోపలికి పదండి" అన్నాడు




"లోపలికి వెళ్లొచ్చు లేవోయ్. ఈ శుభలేఖ తతంగం పూర్తికానీయ్ ముందు. ఈ సందర్భంలో అటో, ఇటో తేల్చుకోవల్సిందే నంటుంది మీ పిన్ని." వెటకారంగా అన్నాడు గంగాధరం.

రత్న మొహం చిట్లించుకుంది.

"చెప్పండి, నాకేం భయమా? తేల్చుకోవల్సిందే అన్నాను. తప్పా? అయినా. నువ్విలా అబద్ధపు శుభలేఖ అచ్చుకొట్టించి, మమ్మల్ని యెందుకిలా హడలు కొట్టించావు సుందరం?" అంది కోపంగానే.

ఈ ప్రశ్న యెలాగూ వస్తుందని, సుందరంకి ముందే తెలుసు. అంచేత, ఆమె ఆవేశానికి హడలిపోలేదు. తను వాంఛించిన అవకాశం దొరికినందుకు మురిసిపోయాడు.

"హడలు కొట్టించానా? ఎవర్ని పిన్నీ? మిమ్మల్నా? అబద్ధం! అసలు, భయమన్నది మీ యింట్లో యెవరికయినా వుందా పిన్నీ? అహఁ.... నేనిలా అంటున్నందుకు మరేం అనుకోవద్దు. నేను అన్నానని కాదుగాని, మనస్ఫూర్తిగ మీరు ఆలోచించండి. సుజాత యేవో కారణాలవల్ల మీ ఇంటికి వచ్చేసి వుండిపోతే, ఆమె సంసారంలో ఏం తుఫాను రేగిందోనని భయపడ్డారా? ఆమె భవిష్యత్తు యేమవుతుందన్న భయం, మీలో యెప్పుడైనా మెదిలిందా? పెళ్లయిన కూతురు, భర్తకి దూరమై మీ యింట్లో

కూచుంటే, లోకులు యేమనుకుంటారోనన్న భీతి, మీలో యెప్పుడైనా ఉద్భ వించిందా? పరిస్థితులు చక్కబర్చకపోతే కరుణాకరం పునర్వివాహం చేసుకునే ప్రయత్నంలో ఉన్నాడని, నేను స్వయంగా ఉత్తరం రాస్తే, మీలో యెవరికయినా చలనం కలిగిందా? ఇంతటి గుండెనిబ్బరం గలవాళ్లు, యీ శుభలేఖ చూసి హడిలి పోయారని నేనెట్లా నమ్మడం?'' నిర్భయంగా అన్నాడు సుందరం

వయస్సులో యెంత పెద్దవాళ్ళయితేనేం—తప్పు తమదేనని గుర్తించాక, చిన్న బుచ్చుకుని, తమ వయస్సునే మర్చిపోయి మౌనం దాలుస్తారు కొందరు అదే జరి గింది గంగాధరం విషయంలో అందుకే తమని సమర్థించుకునే ప్రయత్నం చెయ్యలేదు

''సుందరం భేషుగ్గా చెప్పావోయ్ ఎలాగైతేనేం మా కళ్లు తెరిపించావు అయితే ఒక్క విషయం ఇందులో పూర్తిబాధ్యత మీ పిన్నిదే; నువ్వు చెప్పినవన్నీ ఆమెకే వర్తిస్తాయి ఆమెకి జీవితాంతం గుర్తుంటాయిలే నీ మాటలు'' కసిగా అన్నాడు

రత్నం కళ్లెఱ్ఱజేసి భర్తకేసి చూసింది

''చాల్లెండిక మహ చెప్పొచ్చారు '' అంది తన ధోరణికి స్వస్తిచెప్పలేక

గంగాధరం ఒంటికాలిపై లేచాడు

''నోర్ముయ్ సిగ్గులేక, యింక మాటలు కూడాను నీవల్లనేగా, పరిస్థితి ఇంత దూరం వచ్చింది; ఆ సంగతి మర్చిపోయి, వాగ్వివాదానికి దిగుతున్నావు '' అంటూ ఆవేశంతో గదమాయించేసరికి, రత్నం నోటికి తాళం పడింది ఆమె, మరేమీ అనడానికి సాహసించలేకపోయింది మొహం దించుకుంది రుసరుస లాడుతూనే

సుందరం సుజాతకేసి చూశాడు ఆమె అవనతముఖియై, కాలి బొటనవ్రేలితో నేలను గీస్తోంది

''సుజాతా, నీకో ఉత్తరం రాశాను గుర్తుందా?'' అన్నాడు సుందరం

ఔనన్నట్టు తలూపింది

''ఆ ఉత్తరానికి జవాబు రాస్తావని ఆశించాను కాని, జవాబు రాలేదు నీలో అంతటి నిర్లక్ష్యం యెలా కరడు కట్టుకుందో, నేను అర్థం చేసుకోలేకపోయాను మీ అమ్మా, నాన్నా పట్టించుకోకపోయినా, నీ సంసారాన్ని చక్కదిద్దుకోవాలన్న బాధ్యత నీకు ఉండాల్సింది పరిస్థితి చేతిలోంచి జారిపోతుందేమోనన్న భయం, ఆరాటం నీకు ఉండాల్సింది కాని, నువ్వు అంతదూరం యోచించలేదు ఇంతకూ, కరుణాకరం విషయంలో నేనెందుకింత శ్రద్ధ తీసుకుంటున్నానో, మీ రెవ్వరూ ఊహించడంలేదు

మీరు బంధువులనీ కాదు కరుణాకరం నా స్నేహితుడనీ కాదు అసలు కారణం యేమిటో తెలుసా?'' అంటూ క్షణం ఆగాడు

అందరూ ఆసక్తిగా అతనికేసే చూడసాగారు

''మీ యిరువురి వివాహాన్ని యేర్పాటుచేసి, ఒకవిధమైన బాధ్యతను నా నెత్తిన వేసుకున్నాను పరిస్థితులు యిలా విషమించినందుకు కరుణాకరం బాహ్యంగా కాక పోయినా, మనస్సులోనైనా నన్ను నిందించకుండా ఉండాలనే నా వాంఛ అందుకే నా యీ ప్రయత్నం ఇప్పటికే, అతడి జీవితం నిరాశతో నిండింది కన్నతల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతుడు '' అని సుందరం చెబుతూవుంటే, అతని గొంతు బొంగురుపోయింది

సుజాత షాక్ తగిలినట్టుగా చలించిపోయింది భర్తకేసి దీనంగా చూసింది ఆమె కళ్లు చెమర్చాయి

''అత్తయ్య చనిపోయిందాండీ?'' అంది

కరుణాకరం సుజాతకేసి చూడలేదు, మొహం దించుకునే జవాబు చెప్పాడు

''ఔను సుజాతా! నేను సుఖంగా, హాయిగా, జీవితాన్ని గడపాలని కాంక్షించిన అమ్మ, నాకు సుఖసంతోషాలు గగనమయ్యాయని తెలుసుకున్నాక, నా స్థితిని చూడ లేక, తనే దూరంగాపోయింది '' రుద్ధస్వరంతో అన్నాడు

సుజాత కంట తడి పెట్టుకుంది భర్తచెప్పిన ప్రతీ పదం, ఒక్కొక్క సమ్మెట పెట్టులా హృదయానికి తగిలింది ఆమె మరణానికి కారకురాలు తనే అయినట్టు, భర్త మాటల్లోని భావం స్ఫురింపజేసింది నిజమే! ఈ అశాంతికి మూలకారణం తనే! బహుశా, యీ అపశ్రద్ధ, జీవితాంతం మాసిపోదేమో! అనుకుంటూ పశ్చా త్తాపంతో యెంతో బాధపడింది

''ఉత్తరమైనా రాశావుకాదు బాబూ!'' అన్నాడు గంగాధరం

''రాయాలనిపించలేదండీ!' ముక్తసరిగ జవాబిచ్చాడు కరుణాకరం

సుందరం మళ్ళీ అందుకున్నాడు

''పరిస్థితులు ఇప్పుడు అవగాహన అయ్యాయా పిన్నీ? కరుణాకరం ఆశావాది కాబట్టి, ఇన్ని నిరాశలకు, ఆవేదనలకు తట్టుకుని ధైర్యంగా నిలబడ గలిగాడు మరొకప్పుడైతే జీవితంమీద విరక్తిని పెంచుకుని సంసార బంధాల్నించి విముక్తుడై యుండేవాడు అతడి బ్రతుకును ఇంక నిరాశలతో నింపడం ఇష్టంలేక, అతడిలో విరక్తిభావం పొడజూపక ముందే యీ విధమైన నాటకమాడి మిమ్మల్ని రప్పించాను ఈ రహస్యం నాకు, నా భార్యకు తప్పించి మరెవ్వరికీ తెలీదు నిజంకాని యీ వివా

హాన్ని, యీ రోజే యెందుకు నిర్ణయించాడా అన్న సందేహం మీ అందరికీ వుండొచ్చు దానికి కారణం లేకపోలేదు ఈరోజు కరుణాకరంని అభ్యుదయ చిత్ర కారుడిగ సన్మానిస్తున్నాం మద్రాసులో జరిగిన చిత్రకళా ప్రదర్శనలో, ప్రథమ బహుమతిని సంపాదించుకున్న సందర్భాన్ని పురస్కరించుకునే, యీ యేర్పాట్లు చేశాం ఈ కార్యక్రమాన్నే ఓ వివాహపు వేడుకగా మీరందరూ చూసి ఆనందించ వచ్చునని డబ్బు ఉన్నంతమాత్రాన మనిషికి సంఘంలో గౌరవప్రతిష్టలు లభిస్తాయని గాని, యెవ్వరూ పొందలేని సన్మానాలు, ప్రశంసలు పొందుతారని గాని భావించడం ఒక భ్రమ! ఈ సత్యాన్ని మీరు, సుజాత తెలుసుకుంటారనే రప్పించాను ఏటొచ్చీ రెండే రెండు శుభలేఖలు కొట్టించడానికి అయిదురూపాయలు ఖర్చయ్యింది మా కరుణాకరంనించి యీ అయిదురూపాయలూ తీసుకుంటాననుకో! అయిదురూపాయల ఖర్చుతో, ఓ సంసారాన్ని చక్కదిద్దుతున్నానంటే, నిజంగా నాకే యెంతో గర్వంగా ఉంది పిన్నీ!'' నవ్వుతూ అంటూ ముగించాడు సుందరం

రత్నం మాట్లాడలేక తెల్లబోయింది సుజాత కళ్లొత్తుకుంది

''అన్నట్టు, అసలు విషయం మర్చేపోయాను సాయంత్రం అయిదుగంటలకీ మీరంతా మా ఆఫీసుకి వచ్చేయండి అక్కడున్న హాల్లోనే సన్మానసభ యేర్పాటు చేశాం మర్చిపోకండేం! మీ అందరికీ శ్రమ కలిగించాను. అందుకు పరిహారంగా తేనీటివిందు యేర్పాటుచేశాను మరి, నే వెళ్తొస్తా! బోలెడు పనులున్నాయి కరుణా వస్తానోయ్ నువ్వుమాత్రం కాస్త వేగిరం వచ్చేయ్'' అంటూ హుషారుగా స్కూటర్ దగ్గరికి వెళ్ళి స్టార్ట్ చేశాడు స్కూటర్ సగర్వంగా కదిలింది

జానకి, సుజాతకి దగ్గరగా వచ్చింది ఆమె భుజంమీద చేయివేసి, అనునయపర్చే ధోరణిలో అంది

''పిన్ని పోయినట్టు, నీకు ఉత్తరం రాయాల్సిందే సుజాతా! కాని, నీ దగ్గర్నించి నువ్వు వెళ్ళినప్పట్నుంచీ ఉత్తరం లేనపుడు, యెందుకు రాయడంలె అనేశాడు అన్నయ్య!''

సుజాత జవాబు చెప్పలేదు ఔను మరి! ఏం జవాబు చెబుతుందని? గంగాధరం అందుకున్నాడు

''జరిగిందేదో జరిగిపోయిందిలే జానకి! ఇప్పుడు అవన్నీ అనుకుని, ప్రయోజనం లేదు సుందరం ధర్మమా అంటూ, పరిస్థితులు చక్కబడ్డాయి ఆతడికి, మేం యెంతో ఋణపడివున్నాం మా అమ్మాయి యిప్పటికైనా కళ్ళు తెరిస్తే చాలు జీవితంలో తారసపడే ప్రతీ సంఘటన ఒక పాఠం ఆ పాఠాన్ని మర్చిపోతే జీవిత

పరీక్ష ఫెయిల్ అయినట్టే।"

"అది కాదండీ " అని, రత్నం ఇంకేమో అనబోతూ వుంటే, గంగాధరం ఆమెకేసి గుడ్లురిమి చూశాడు

"నువ్వు మరేం మాట్లాడకు రత్నం అనవసరంగా అవమానపడకు." కోపంగానే హెచ్చరించాడు

కరుణాకరంకి, నవ్వొచ్చింది మావఁగారు హఠాత్తుగ మారిపోవడం, అతనికి ఆశ్చర్యం కలిగించింది అదో శుభ సూచకమను కున్నాడు

"అంతాలోపలికి వచ్చేయండి " అన్నాడు, కరుణాకరం "చెల్లాయ్, నువ్వా మజాత వంట యేర్పాట్లు చెయ్యండి. ఈలోగా నేను బజారుకి వెళ్ళి వచ్చేస్తాను." అంటూలోపలికి నడిచాడు సంచీతీసుకోడానికి

అందరూ ముసిముసి నవ్వుల్తో లోపలికి వెళ్ళారు రత్నం మాత్రం మొహం ముడుచుకునే వెళ్ళింది

# 20

కరుణాకరం సన్మాన సభకి, వూళ్ళో పెద్దలు కొందరొచ్చారు మునిసిపల్ చెర్మన్ గారు సభకి అధ్యక్షత వహించారు సన్మానం అతివైభవంగా జరిగింది ఇద్దరు వక్తలు, కరుణాకరం గురించి మాట్లాడారు అతణ్ని మామూలు వ్యక్తిగా గుర్తించామే గాని, అతనిలో ఇంతటి ప్రతిభా విశేషా లున్నాయని అనుకోలేదని, అతను ప్రస్తుతం యీ వూరికి చెందిన వాడవ్వడం, మనందరికీ గర్వకారణమని, ఇంకా యేవేవో చెప్పారు.

అనంతరం, సుందరం మాట్లాడాడు అతను చెప్పిన ప్రతీపదం, అతి ముఖ్యమైనదని అనుకోవచ్చు అతను చెప్పిన మాటల సారాంశమిది

"నేను, కరుణాకరంకి సన్నిహిత స్నేహితుడైనందుకు, యెంతో గర్విస్తున్నాను. మనిషికి, డబ్బే ప్రధానంకాదు డబ్బుతో పేరు ప్రఖ్యాతులురావు పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టేది యేదైనా కళే। అందుకే, 'కళ'కు అధిక ప్రాముఖ్యత వుందంటాను ఏ కళ అయినా, దైవదత్తమైన ప్రతిభలా కొంత ' జన్మతః అబ్బుతుంది ఆ ప్రతిభకు కృషిపరంగా మరింత మెరుగుపెట్టాలి అప్పుడే ఆ కళకు సార్ధకత యేర్పడుతుంది. కరుణాకరం యీ విషయంలో కృతకృత్యుడయ్యాడు గాబట్టే, యీనాడు మనందరి సమక్షంలో యీ గౌరవాన్ని పొందగలిగాడు డబ్బే ప్రధానంగా గుర్తించే కొందరు వ్యక్తులు కళల్ని, కళాకారుల్ని నిరశిస్తారు వాళ్ళ దృష్టిలో కళాకారుడు యెందుకూ

కొరగాని అతి సామాన్యుడు. ఒకవిధంగా చెప్పాలంటే, యిది ద్వేషమే! తమకి చేతకానిదాన్ని ద్వేషించడం, నిరశించడం మానవులకు కొత్తకాదు అటువంటి భావనే ఉండకూడదంటాను కళాకారుల్ని అన్నివిధాలా ప్రోత్సహించి, సహకరించే అలవాటును అలవర్చుకోవాలి ప్రతి వ్యక్తీను అప్పుడే 'కళ కు సేవజేసినట్టవుతుంది. 'ఆశాజీవి' అనే అభ్యుదయ చిత్రాన్ని రూపొందించి, మన కరుణాకరం రెండువేల రూపాయలు ప్రథమ బహుమతిగా పొందాడు ఆ చిత్రాన్ని ఓ కళాభిమాని వెయ్యీ న్నూట పదహార్లకు కొనుక్కున్నాడు అంటే, ఒకేఒక్క చిత్రానికి, మూడువేల నూటపదహారు రూపాయలు సంపాదించాడన్నమాట! అలాగని, యీ డబ్బే ప్రధానంగా తీసుకుంటామా? ఎన్నటికీ కాదు అతడికివ్వబడిన గౌరవమే అతిముఖ్యం. అందరికీ లభ్యంకాని గౌరవమది డబ్బు కుమ్మరించినా దొరకని గౌరవం అటువంటి గౌరవాన్ని పొందిన యీ మిత్రుడు, ఇంకా ఇటువంటి సన్మానాల్ని పొంది ఉజ్జ్వల మైన భవిష్యత్తులోకి పురోగమించాలని కాంక్షిస్తున్నాను ''

సుందరం మాట్లాడ్డం ముగించి, వేదిక దిగుతూవుంటే, హాలంతా కరతాళ ధ్వనులతో ప్రతిధ్వనించింది కరుణాకరంని రెండుమాటలు చెప్పమన్నారు సన్మానితుడు మాట్లాడ్డం రివాజు అందుకే, అతనికి తప్పలేదు మాట్లాడ్డం మైక్ ముందుకొచ్చి నుంచున్నాడు కరుణాకరం అతనికి సభావేదికపై మాట్లాడే అలవాటు యే కొద్దిపాటి అయినా లేదు అయినా, ఆరోజు అతనికి లభించిన ఆదరణ బలాన్నిచ్చింది గొంతు సవరించుకుని ప్రారంభించాడు

''సభాధ్యక్షులకు, సోదర సోదరీమణులకు,

నమస్సులు

ఈరోజు, నా ప్రియమిత్రుడు సుందరం, తదితరులు యేర్పాటుచేసిన యీ సన్మానం, నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది అయితే, యీ గౌరవం వ్యక్తిగతంగా నాకు చెందదు నాలోని కళాకారుడికే చెందుతుంది నిజం చెప్పాలంటే, యీ గౌరవాన్ని పొందగలిగే ప్రతిభ, నాలో యేమీలేదు నా జీవితంలో తటస్థిం... సంఘటనలే నన్ను ఉత్తేజపర్చి, అప్పుడప్పుడు నాచేత అదో తరహా చిత్రా... రూపొందించాయంటే అతిశయోక్తి కాదు. అందుకే వాటిలో స్వాభావికత ... ...ంది సాధారణంగా, కవి కలంనించి వెలువడిన కవిత్వంగాని చిత్రకారు... ...చి రూపం దిద్దుకున్న చిత్రాలుగాని, వారివారి మనఃప్రవృత్తుల్ని, వారు ... ...న్న వాతావరణాన్ని అనుసరించే వెలువడతాయంటారు బహుశా, యిది కొంతవరకు నిజమేనేమో! స్వతహాగా, నేను ఆశావాదిని ఏ విషయానికి, నేను అధిక ప్రాముఖ్యత

జీవ్వను దేనికీ చలించను అయితే. ముందుముందు యేదో సాధించగలనని, మంచి రోజులు ముందున్నవనీ, ఆశతోమాత్రం వుంటాను ముందుకు సాగిపోగలనన్న ధైర్యం, మనస్సుకి నిబ్బరం కలిగిస్తుంది. ఎంత నిరాశలోనైనా ఆశ కలిగిస్తుంది. ప్రస్తుత యుగంలో ప్రతి మానవుడికీ, యీ 'ఆశావాదం' యెంతో ఉపకరిస్తుంది. అది అవసరం కూడాను లేకపోతే అడుగడుగునా మనం యెదుర్కుంటున్న సంఘర్షణల్ని తట్టుకోవడం అతికష్టం నిరాశతో, నీరసంగా జీవించడంకంటె, ఆశతో ఉత్సాహంగా జీవితం గడపడం మంచిదంటాను ఇది కేవలం నా అభిప్రాయమే; నా జీవితంలో మహత్తరఘట్టంగా, మరిచిపోలేని రోజుగా, నిలిచిన యీ సన్మానాన్ని యేర్పాటుచేసిన మిత్రుడు సుందరంకి, మీ అందరికీ నా కృతజ్ఞతలు ఇంక నేను చెప్పవల్సిందేముంటుంది గనుక; నేను కేవలం చిత్రకారుణ్ణే గాని, కవిని కాదు మరొక్క విషయం నన్ను సర్వవేళలా ఆదుకుంటూ, నాలో ఒకవిధమైన చైతన్యాన్ని మేల్కొల్పిన మిత్రుడు సుందరంకి, ఆ జన్మాంతం ఋణపడివుంటాను సెలవ్ ' అంటూ ముగించాడు

మళ్ళీ కరతాళధ్వనులు మిన్నుముట్టాయి

తర్వాత అందరికీ తేనీరు యివ్వబడింది కరుణాకరం మిత్రులు, కొందరు పెద్దలు, కరుణాకరంని అభినందించారు వారిలో ముకుందరావుగారుకూడా వున్నారు

"ఈరోజు సుదినం కరుణాకరం; నేనెంతో ఆనందిస్తున్నాను ఇంకా నువ్వు గొప్పవాడివి కావాలని మనసారా వాంఛిస్తున్నాను" అన్నారాయన.

అతని కళ్లల్లో ఆనందభాష్పాలు మెరిశాయి

"మీవంటి పెద్దల ఆశీస్సులే నన్ను యింతవాణ్ణి చేశాయి సార్; సర్వదా మీ ఆశీస్సులు నాకు తోడుగావుంటే చాలు నాకు" సవినయంగా అన్నాడు కరుణాకరం

ముకుందరావుగారు, అతని భుజం తట్టుతూ "నా ఆశీస్సులు యెప్పుడూ వుంటాయి మరి వెళ్ళొస్తా;" అంటూ నిష్క్రమించారు

కరుణాకరం, సుందరంని ఆప్యాయంగా, ఒకింత కృతజ్ఞతాభావంతో కౌగలించుకున్నాడు

"నీకు యెలా కృతజ్ఞత చెప్పడమో, అర్థంకాదు సుందరం " అన్నాడు

"అదిగో, అటువంటిదే వద్దంటున్నాను నీకు అర్హత, గౌరవం ఇవ్వలేదుగా;" అంటూ అక్కణ్ణించి మాయమయ్యాడు, వచ్చిన పెద్దల్ని సాగనంపడానికి వెడుతూ

జానకి హృదయం ఆనందడోలికల్లో ఊగిసలాడింది అన్నయ్యకు కళాకారుడిగా కాకుండా, వ్యక్తిగతంగా కూడా, అది తగిన గౌరవమేనని మురిసిపోయింది

యు వ

సుదర్శనం మరోసారి అభినందించాడు కరుణాకరంని గంగాధరం గర్వంగా లోలోన నవ్వుకున్నాడు 'కరుణాకరం తన అల్లుడేగా!' అన్న భావంతో మురిసిపోయాడు. రత్నం, తన తెలివితక్కువ తనానికి చిన్నబుచ్చుకుంది అయినా, యేమంతగా ఆనందించలేదామె అటువంటి వ్యక్తులకు ఆనందమన్నది, యితరుల్ని అభినందించడమనే భావన, యెప్పటికీ ఉండవేమో'

సుజాత విషయం, వేరేగా చెప్పనవసరం లేదు ఆమెలోని అహం కరిగిపోయింది ఆనందం వెల్లివిరిసింది సుందరం ఉపన్యాసంలో, అక్కడక్కడా తన మీద విసుర్లు వినిపించినా, అందుకు ఆమె యేమీ బాధపడలేదు ఆ నిందలకు, తను అర్హురాలే ననుకుంది గతమంతా తల్చుకుని, సిగ్గుతో ముడుచుకుపోయింది తన అదృష్టాన్ని యిప్పుడు గుర్తించుకుని, కళాకారుడి భార్యగా గర్వపడింది

* * *

కార్యక్రమం ముగిసి, అందరూ వెళ్ళిపోయారు సుందరం దంపతులు, కరుణాకరం కుటుంబం మాత్రమే మిగిలారు.

"సుందరంగారూ, మా అన్నయ్య పునర్వివాహం బ్రహ్మాండంగా జరిపించారండీ!" అంది జానకి నవ్వుతూ

అందరూ ఒక్కసారి నవ్వేరు

"మీ అందరి సహకారంతో జరిగిపోయింది లెండి" అన్నాడు నవ్వుతూనే సుందరం

"మరి నూతన వధువు ఏదీ?" అన్నాడు సుదర్శనం ఉత్సుకతతో,

"నూతన వధువు, కళే! ఆ వధువు యెప్పుడూ అతణ్ణి అంటిపెట్టుకునే వుంటుందండీ!" జవాబిచ్చాడు సుందరం

"ఎలాగైతేనేం, సాధించావు సుందరం" గంగాధరం, తన తృప్తిని వ్యక్తం చేశాడు

"ఇది, నా బాధ్యతకూడాను బాబాయ్ మా కరుణ జీవితంలో మళ్లీ యెప్పుడూ ఇటువంటి అపశ్రుతి పలక్కూడదు, అదే నేను కోరుకునేది ఈ బాధ్యత యిక సుజాతే తీసుకోవాలి ఏం సుజాతా!" అంటూ మందహాసంతో ఆమెకేసి చూశాడు సుందరం

సుజాత సిగ్గుతో మొహం దించుకుంది

"ఇంకెప్పుడూ యిలా జరగదులే అన్నయ్యా!" అంది మెల్లగా,

"అమ్మయ్య! మరి ఫరవాలేదు నేను నిశ్చింతగా వుండొచ్చు" అన్నాడు

సుందరం

మళ్ళీ అందరూ నవ్వేరు

"పిన్నీ, ఇప్పుడేమంటావ్ ?" అన్నాడు సుందరం, రత్నంని ఉద్దేశించి

"నన్ను మాట్లాడొద్దని మీ బాబాయ్ హెచ్చరించారుగా! అందుకే, నేను మాట్లా డను " అంది మొహం చిట్లించుకుని రత్నం

"శుభం! అదే మంచిది సుందరం మేం వెళ్ళొస్తాం మరి! మళ్ళీ కలుసు కుందాం" అన్నాడు గంగాధరం

"మంచిది బాబాయ్ "

"సుందరం, రేపు అలా యింటికి రా " అన్నాడు కరుణాకరం

"అలాగేలే!"

ఎవరి యిళ్ళకు వారు వెళ్ళిపోయారు

# 21

రాత్రి పదకొండు కావస్తోంది చంద్రుడు కిటికీలోంచి చల్లగా తొంగిచూస్తున్నాడు తెల్లని వెన్నెల, పాల మీగడలా పరుపుమీద పరుచుకుంటోంది. కరుణాకరం, మంచంమీద ఒరిగి, చంద్రునికేసి అతడు ప్రసరిస్తోన్న వెన్నెలకేసి చూస్తూ, యేవేవో భావాల్ని అల్లుకుంటున్నాడు.

సుజాత మెల్లగా లోపలికి వచ్చి, తలుపు గడియవేసింది ఏదో అర్థంగాని అను భూతి ఆమెను పట్టి లాగుతోంది వచ్చి మంచంమీద కూచుంది.

"అప్పుడే నిద్రా, యేవిఁటండీ ?" అంది ఓరగా చూస్తూ

"లేదు సుజాతా! అందాల చందమామను పరికిస్తున్నాను ఎన్ని కష్టాల్నయినా, యెంతటి ఆవేదన్నయినా, మరిపింపగల మధురాతి మధురమైన చల్లదనం ఉందతనిలో ఏమంటావ్ ?" ఆమెకేసి చూస్తూ అన్నాడు

"అబద్ధం!" ముక్తసరిగ అంది సుజాత.

"అదేవిఁటి ?" ఆశ్చర్యపోయాడు కరుణాకరం

"కాదండీ! మీలో అంతకంటె చల్లదనం యిమిడివుంది. లేకపోతే నన్ను క్షమించి వుండేవారు కాదు" అంది సుజాత

"ఇది మరీ అతిశయోక్తి సుజాతా! నామీద గల అభిమానంతో, క్రొత్తగా ఏర్పడ్డ గౌరవభావంతో అలా అంటున్నావే గాని, నిజానికి, నాకూ చంద్రుడికీ పోలికేవిఁటి



చెప్పు? సరేగాని, ఇప్పుడు చెప్పు, మనింటికి అవసరంగా యేవిఁటేవిఁటి కావాలో కొనేద్దాం '' అన్నాడు ప్రస్తావనని మారుస్తూ

''అంటే?'' సుజాతకి అర్థం కాలేదు

''సోఫా సెట్టూ, స్టీల్ ఆల్‌మెరా, యింకేవేవో చెప్పావుగా! ఇప్పుడు మనదగ్గర డబ్బుంది నువ్వు యేం తీసుకున్నా నేను అటంకపర్చను ''

సుజాత, యిప్పుడు అర్థం చేసుకుంది, అతని మాటల్లోని గూఢార్థం సిగ్గుతో ఆమె మొహం వాడిపోయింది

''నాకేమీ వద్దండీ! మీకు యేది అవసరంగా తోస్తే, అదే నాకూ అవసరం అంది మెల్లగా

''అలా అంటేకాదు '' అని, కరుణాకరం యింకేమో అనబోతూవుంటే, సుజాత తనచేతిని అతని నోటికి అడ్డంగా పెట్టింది

కరుణాకరం మెల్లగా నవ్వుకుని, ఆమెను దగ్గరగా తీసుకున్నాడు

చంద్రుడు మబ్బుల చాటుకి పోయాడు మల్లెల వాసన గదినిండా విరజిమ్మింది. ప్రక్క ఇంట్లోని రేడియో శ్రావ్యమైన ప్రేమగీతాన్ని వినిపిస్తోంది.



# పసిహృదయం

ఎమ్. హేమలత

బడికి టైమవుతూందని చకచకా తయారవుతూంది వసంత ఇంకా పది నిమిషాలు కూడా లేదు లేటుగ వెళ్తే టీచరు బయట నిలబడమంటుంది ఎండలో నిల్చోవడం తనకేం కష్టం కాదు. కాని పిల్లలందరు తన వేపు చూస్తే మాత్రం తనకి చచ్చే సిగ్గేస్తుంది. అదిగో బాబ్జీ వస్తున్నాడు. 'తొందరగా రారా టైమైంది'

అంటూ వాడిని కొంచెం గట్టిగా లాగింది అంతే వాడు ఆరున్నొక్క రాగం యెత్తుకున్నాడు లోపలినుండి కమల వస్తూనే కేకలువేయడం మొదలెట్టింది "వసూ! ఎందుకే వాడినట్లా కొట్టావ్? చిన్నవన్నాని, నెమ్మదిగా బుజ్జగించి తీసికెళ్ళలేవూ? ఎంత విసురే అమ్మా నీకు! కాస్త నెమ్మది నేర్చుకో తల్లీ' అంటూ

వసంత వచ్చిన కోపాన్ని దిగమింగుకొని బాబ్జీని తీసికెళ్ళింది. వసంతకన్న రెండేళ్ళు చిన్న అయిన ప్రమీల సంచి వూపుకుంటూ ముందు దర్జాగా నడుస్తోంది వసూకి ప్రమీలని చూస్తే ఒళ్ళు మండింది. ఎంతసేపు తనకే అంటగట్టారీ వెధవని! ఏం! ప్రమీ తీసికెళ్ళకూడదూ? ఏమయినా అంటే అమ్మ అది చిన్నది, నువ్వు పెద్దదానివి అంటుంది ఎంత పెద్దదాన్నో మరి! స్కూలు గేటు కనిపించగానే తమ్ముడి చేయి వదలిపెట్టి క్లాసులోకి వెళ్ళింది వసంత

"నాన్నగారు ఆఫీసునుండి వచ్చినట్లున్నారు" అనుకుంటూ హోమ్‌వర్క్ చేసుకుంటున్న వసంత, నాన్నగారి కేకలకి చివ్వున తలెత్తి చూసింది "వసూ! బాబ్జి మోకాలు చూడు యెంతలా కొట్టుకుపోయిందో! వాడిని కొంచెం చూసుకోమని నీ కెన్నిమార్లు చెప్పాను! వాడేం నీ తమ్ముడు కాడా? నన్ను కాదన్నట్లు వుంటావేం!" కళ్ళెఱ్ఱచేసి తనవేపు చూస్తూన్న తండ్రిని చూసి బెదిరిపోయింది వసంత ఎప్పుడు పడ్డాడో వసంతకి అసలు తెలీదు. తను స్కూలునుండి బయటికి వచ్చేటప్పటికే ప్రమీల, బాబ్జీ బయలుదేరి వచ్చేసినట్లున్నారు. తనకు కనిపించలేదు ఇంటికి వచ్చాక కూడా తన చదువుగొడవలో పడిపోయి, తమ్ముణ్ణి చూడలేదు తప్పంతా తనదే అన్నట్లు తండ్రి అంటూంటే వసంతకి దుఃఖం ఆగలేదు తనలో తనే వెక్కుతూవుంటే తల్లి వచ్చి "ఊ చాల్లే ఏమైనా అంటే చాలు నెత్తిమీద వుంటుంది నీళ్ళకుండ. ఆ డెట్టాల్ యెక్కడుందో ఇలా ఇవ్వు. కాస్త కడిగి నెబాసల్ఫ్ పౌడర్ వేస్తాను. పని హడావిడిలో వుండి నేను కూడా గమనించలేదు" అంది తల్లికి అవన్నీ అందించి మళ్ళీ పుస్తకాలు ముందేసుకుని కూచుంది వసంత

అన్నాలవేళ అయింది కంచాలు టేబిల్‌మీద సర్దలేదని అమ్మ యెక్కడ కేకలు వేస్తుందో అని వసంత గబగబా అన్నము గిన్నెలు అవీ పెడుతూంటే ప్రమీల వచ్చితన కంచం దగ్గరకు లాక్కుని కూచుంది ఆ విసురుకి మంచినీళ్ళ గ్లాసు ఒలికి టేబిల్ అంతా నీళ్ళమయమయింది అన్నాలు పెడదామని లోపలికి వస్తున్న కమల తప్పెవరిది? అన్న ప్రశ్నకి తావివ్వకుండా అపరాధిలా నిలబడ్డ వసంత వీపుని విమానపుమోత మ్రోగించింది ఏడుస్తూ అవతలకి వెళ్ళిన వసంత తన మంచం చేరింది.

ప్రొద్దుటినుండి అకారణ ఆగ్రహా వేశాలకి గురి అయిందేమో పాపం వసంత పసి మనస్సు పూర్తిగా గాయపడింది రెండా పదేండ్లునిండని వసంత మనస్సు పరిపరివిధాల పరుగెత్తింది "ఛీ తనంటే అందరికీ కోపం చెల్లాయి అంటే ముద్దు తమ్ముడంటే గారాం నేనే యెవ్వరికీ అక్కరలేదు ఎందుకు నేనంటే వాళ్ళకంత కోపం? పెద్ద దాన్ననా? కాదు, కాదు. మొన్న అమ్మ ప్రక్కింటి అత్త య్యతో చెబుతూంది."ఈ వసంత మాకు పెండ్లయి సంవత్సరమైనా కాకుండా పుట్టిందండీ! నాకేసరదా తీరలేదు. పెండ్ల యిన మూడు సంవత్సరాలయినా హాయిగ వుండాలండీ" అంటూ, అమ్మకి యిష్టం లేనపుడు పుట్టాను కదూ అందుకే నేనంటే కోపం నేను వాళ్ళకి అవసరంలేదు వున్నారుగా ప్రమీల, బాబ్జీ" యిలా అను కుంటూనే వసంత నిద్రపోయింది

తల్లి కాబోలు తట్టి లేపుతూంది "నాకు అన్నము వొద్దమ్మా" అంది నిద్ర మత్తులో వసంత "ఏఁవమ్మా తల్లీ! ఇదంతా కోపమే! ఊఁ లే లే అన్నం తిందువుకాని, మళ్ళీ నేను గదీ అదీకడుక్కోవాలి" "ఎందుకే దాన్నంత బ్రతిమలాడుతావు? ఒక్కరోజు అన్నము తినకపోతే అదేమీ అయిపోదులే! ఒక పూట భోజనం మానేస్తే ఒంటికి మంచిది కూడా" సగం హాస్యంగా, సగం నిజంగా అంటున్న నాన్నగారికి మాటలకు వసంతకి పూర్తిగా మెలకువ వచ్చింది "హు నాన్నగారికి నామీద యెంత కోపం! ఔను నేనేమీ అయిపోను దేవుడా! నాకు జ్వరంవస్తే యెంత బాగుండును! ఫ్లూ జ్వరం వచ్చి ప్రక్కింటి మామ్మగారిలాగ చచ్చిపోతే అప్పుడు తెలుస్తుంది వీళ్ళపని. అప్పుడయినా పోతేపోయిందిలే అనుకుం టారేమో" తలగడ వసంత కన్నీళ్ళతో తడిసిపోతుంటే ఎప్పుడో నిద్రపోయింది.

"వసూ! ఇంకా లేవలేదటే" అంటూ వచ్చిన కమల, వసంత ముఖంచూసి ఒంటిమీద చేయి వేసింది వసంత శరీరం పేలిపోతూంది జ్వరంతో చలికి గడగడ వణుకుతూంది "అమ్మయ్యో! పిల్లకి జ్వరం వచ్చిందండీ!" అంటూ కమల వేసిన కేకలకి ఆనందరావు వసంత దగ్గ రికి వచ్చాడు నుదుటిమీద చేయివేసి చూసి "ఔను కమలా! జ్వరం బాగా వున్నట్లుంది చూడు నువ్వు వెళ్ళి కాఫీ తీసుకురా నేను ముఖం కడిగిస్తాను లేమ్మా వసూ' ముఖం కడుక్కుందువు గాని" అంటూ బుజ్జగిస్తున్న నాన్నగారి మాటలకు పులిక్కిపడ్డట్లయి విస్తుపోతూ, ఆనందరావుని చూసింది వసంత "ఎంత ప్రేమగ మాట్లాడుతున్నారు నాన్న! తొందరగానయమయిపోతే మళ్ళీ అడ్డమైన పనులకి తయారవ్వాలి కాబోలు, అందుకే ఈ బాధంత!" కోపంగానే లేచింది వసంత, కాఫీత్రాగి పడుకుంది. ఆనంద రావు డాక్టరు కోసరం వెళ్ళారు.

ప్రమీల, వసంత్ దగ్గరికి రాబోతూంది కాబోలు కమల కేకలు వేసింది. దాన్ని లేపవద్దని తల్లి కేకలు వింటూనే మగ తగ కళ్ళుమూసుకుంది జ్వరం రావాలను కుంది జ్వరం వచ్చింది తరువాత ఏ మవుతుందో ' "పోనీ చచ్చిపోతాను అంతేగా" అటుతిరిగి పడుకుంది వసంత.

ఫ్లూ అనుకున్న జ్వరం టైఫాయిడ్ లోకి దిగింది జ్వర తీవ్రతలో ఒళ్లు తెలియకుండ పడివుంది వసంత కమల, ఆనందరావు అన్నాహారాలు మాని వసంత మంచం దగ్గరే కూలబడ్డారు ప్రమీల, బాబ్జీ, బిక్కు బిక్కు మంటూ అక్కయ్య వంకే చూస్తూ కూచున్నారు డాక్టరు ఏమీ భయంలేదని చెప్పారు కాని ఆనందరావు దంపతులు చాలా బెంగపడి పోయారు

ఆ రాత్రి మరీ ఎక్కువగవుంది. వసంత ప్రేలాపన. తడిగుడ్డ తడిపి వేస్తూ వుంది కమల "అమ్మా! నేనంటే నీ కిష్టంలేదు నాన్నకి కూడ అంతే! నే నేమయి పోయినా పరవాలేదు ఎప్పుడూ నన్నే తిడతారు" అంటూ పలవరిస్తూంది వసంత కమల దుఃఖంతో ఆనందరావు వంక చూపింది నిండా పదేండ్లు నిండని పసిపిల్ల మాటలా యివి

ఆనందరావు ఒక్క వుదుట లేచి కూతురి మంచంమీద కూచున్నాడు "వసూ! ఎవరు చెప్పారమ్మా నీ వంటే కోపం అని? నువ్వేనమ్మా మాప్రాణం. ఏదో కోపంలో మిగతా వారిద్దరి కన్న పెద్ద దానివి కదా అని నిన్ను కోప్పడ్డ మాట నిజమేనమ్మా కాని ఇలా అను కోకు తల్లీ నువ్వు మా బంగారు తల్లివి" ఆనందరావు కన్నీరు వసంత ముఖంమీద జలజలా రాలుతూంది నాన్నగారి మాటలు వింటున్న వసంత ఆశ్చర్యపోయింది. నాన్నగారికి తనంటే ఇంత ప్రేమా! అదే ఎలా ఏడుస్తున్నారు! అమ్మకూడ బాగా ఏడుస్తూంది మరి తనలా ఎందుకు అను కుంది! నాన్నగారి దగ్గరకు రాబోతున్న బాబ్జీని ఒక్కలాగు లాగింది కమల. "ప్రమీ! ఈశని వెధవని అలా బయటకి తీసికెళ్ళు మరీ గొడవ చేసేస్తున్నాడు! అక్కయ్యకి ఇప్పుడే నిద్రపట్టూంది." తన చెవులని తనే నమ్మలేక పోయింది వసంత అంత గారాబంగ చూసుకునే తమ్ముడిని యెంతలా కేకలు వేస్తూంది అమ్మ అమ్మ నాన్న నిజంగానే బాధ పడ్తున్నారు తనంటే వీళ్ళకి ఇష్టమే అట్లాగయితే తనే తప్పుగ అనుకుందా! "అమ్మా!" అంది వసంత "ఇక్కడే వున్నాను తల్లీ" అంటూ దగ్గరికి వచ్చింది కమల. "అమ్మా! నేను జ్వరం వస్తే బాగుండును చచ్చిపోవచ్చును అని దేవుణ్ణి ప్రార్థించాను జ్వరం వచ్చే సింది చచ్చిపోతానేమో! ఇప్పు డెలాగమ్మా నిజంగానే మిమ్మల్ని వదిలి పెట్టి వెళ్తానేమో అమ్మా" అంటూ వసంత బావురుమంది వసంత మాటలకి వులిక్కిపడ్డారు భార్యాభర్తలిద్దరు కమల



యువ



వెక్కి-వెక్కి ఏడవడం మొదలెట్టింది.

ఆనందరావు కొంత తేరుకొని "చూడమ్మా వసూ! నువ్వేదో తెలీక కోరుకున్నావు. "నేను లేకుంటే మా అమ్మ నాన్నకూడ వుండరు. కాబట్టి నన్ను కాపాడు దేముడూ" అంటూ ప్రార్థించమ్మ నీ కోరిక దేవుడు తప్పక వింటాడు." అంటూ కూతురిచేతిలో వెంకటేశ్వర స్వామి పటం పెట్టాడు. తండ్రి చెప్పిన ప్రకారమే తండ్రి ఒడిలో కూచుని దేవుణ్ణి ప్రార్థించి, నిశ్చింతగ పడుకుంది వసంత.

నిద్రపోతున్న కూతురి అమాయక వదనాన్ని చూస్తూ ఆనందరావు, "చూశావా! కమలా మన తెలివి తక్కువ తనం, అర్థంలేని తొందరపాటు. నిర్లక్ష్యత ఒక పసి మనస్సుని ఎంత గాయ పరచిందో! ఇకనైనా బుద్ధి తెచ్చుకొని పిల్లలు ముగ్గురిని సమానప్రేమతో చూడడమే మన బాధ్యత అన్నది గుర్తుంచుకొవాలి." భర్తమాటలువింటూ కమల, వసంత తలనిమురుతూ వుండిపోయింది.

ఆనాటినుండి వసంతకు జ్వరం దిగజారింది. క్రమేణ మనుష్యుల్లోకి పడింది. వసంత ఇప్పుడు యెప్పటిలా చలాకీగ వుంటుంది. మరింక వుషారుగ కూడ వుంటుంది. అమ్మా, నాన్నగారు తమ్ముణ్ణీ, చెల్లెల్ని కోప్పడితే వాళ్ళని ఆవలికి తీసుకెళ్ళీ ఓదార్చి తనూ వాళ్లతో కలిసి ఆడుకుంటూంది.

---

జనవరి నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ 10—00



**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి. వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు డిశంబరు 5 వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.

# మనో మనసూ



యర్రంశెట్టి శాయి

భానుమతీ, కాదంబరీ ఇద్దరూ ఒకప్పుడు ఒకటిగానే ఉండేవారు. కాని ఇప్పుడు కాదు. యస్సస్సల్సీ చదువుతోండగా ఇద్దరకూ ఓ చిన్న విషయంమీద అభిప్రాయ భేదాలొచ్చి కాంగ్రెసు పార్టీలా చీలిపోయారు. భానుమతిదే తప్పని కాదంబరి ఎలిగేషన్స్ చేసింది. కాదు, కాదంబరిదే తప్పని భానుమతి కౌంటర్ ఎలిగేషన్స్ లేవతీసింది. దాంతో ఇద్దరికీ సంబంధాలు మరింతగా చెడిపోయినయి. ఒకటిగా ఉన్నప్పుడు తెలుసుకొన్న కొన్ని కాదంబరి రహస్యాలను భానుమతి బయట పెట్టింది. భానుమతి తాలూకు కొన్ని అమర్యాదకరమయిన విషయాలు కాదంబరి బయటపెట్టింది. కాని కాదంబరి కప్పుడు "పేదవాని కోపం పెదవికి చేటనే" సామెత తెలీదు. కనీసం ఎవ్వరూ చెప్పగా కూడా విన్లేదు. ఆమెకా సామెత్తెలీపోతే అందుకు గొప్పింటి పడుచయిన భానుమతి బాధ్యురాలు కాదు

* *

సత్తిరాజు సచ్చరిత్రుడు. నోట్లో వేలెట్టినా కొరకలేనంతటి మంచివాడు. ఎదురుగా 'శాంగ్రాడీ' స్విమ్మింగ్ డ్రస్‌తో నుంచున్నా కన్నెత్తి చూడనంతటి శీలసంపన్నుడు. అలా అని అతన్జదివిన హైస్కూలు హెడ్మాష్టరుగారి 'సర్టిఫికేట్' ఉంది. అలాంటిదే ఆ పేట నుంచీ కౌన్సిలర్‌గా ఎన్నికయి ఛైర్మన్ గిరీ వెలిగిస్తోన్న సీతాపతిగారి అభిప్రాయముంది. అంచేత అతనికి ఆ పేటలో పరువుంది. అవధాన్లుగారి వాత్సల్యముంది. ఆయన భార్య ప్రజావతమ్మగారి ఆదరణ వుంది. అతనంటే ఆవిడ కూతురు కాదంబరి గుండెల్లో కల్తీలేని ప్రేమ ఉంది.

సత్తిరాజు చాలామందిలానే బీదవాడు. అంచేత అతని పెదాలపయి ఎప్పుడూ

చిరునవ్వు చిందులాడుతూంటుంది. అత నికి తండ్రి లేడు. అంచేత అతని చూపుల్లో దైన్యం తొంగిచూస్తుంటుంది. అతనికి తెలివుంది. అంచేతే బి. ఏ. సెకండ్ క్లాస్‌లో పాసయేడు. అతనికి రికమండేషన్ లేదు. అంచేతే అతనికేదీ ఉద్యోగం దొరకలేదు.

బి. ఏ. చదివేప్పుడు గోపాలం సత్తి రాజు క్లాసుమేటు. స్వంత గుఱ్ఱబ్బండీలో కాలేజికొచ్చే రెండు జెడల డాక్టరుగా రమ్మాయి (రెండు జడలు డాక్టరుగారివి కాదు, వారి అమ్మాయివి) భానుమతికూడా అతని క్లాస్‌మేటే. అతని తెలివితేటల్జూసి ఆశ్చర్యపోయిన కొంతమంది వాళ్ళ క్లాసమ్మాయిలలో భానుమతికూడా ఉంది. అతని మొఖం చూసి 'చక్కనివాడే' అని అనుకొన్న ఆ కాలేజీ ఆడపిల్లల్లో భానుమతి ఒకర్తె. కానీ, మిగతావాళ్ళల్లా ఆమె అక్కడితో ఊరుకుండిపోలేదు. కొంచెం ధైర్యం తెచ్చుకొంది దానికి చనువు కలుపుకొంది. వీటి నుపయోగించు కొని ఓ సంవత్సరం తను కాలేజి ఎంటర్ టెయిన్‌మెంట్ సెక్రటరీగా పోటీ చేసి నప్పుడు అతనితో పరిచయం సంపా దించుకొంది

"మీరు నా తరపున కాన్వాస్ చేస్తా నంటేనే, నేన్నుంచుంటాను. అసలు మీరు సపోర్ట్ చేస్తారనే నే [illegible]చుంట. లేపోతే నాకంత ధైర్యం ఎక్కడిదనీ?" అంటూ తనే ధైర్యంగా మాట్లాడింది. తనంటే అంత గొప్ప, 'మన' అనే అభి ప్రాయం ఆ అమ్మాయి కెలా కల్గిందా అని ఓ నిమిషం ఆలోచించాడు గానీ, సత్తిరాజు కది రైల్వే ఇంగ్లీషులా గందర గోళంగా అనిపించేసరికి ఆలోచించడం మానుకొన్నాడు.

ఆ తరువాత ఓరోజు తమ క్లాసులోని ఇందిర, లక్ష్మి, మైధిలి, గోపాలం, ప్రసాదరావుల్తోపాటు భానుమతి వెంబడి కాన్వాసింగ్‌కి తిరుగక తప్పలే దతనికి. భానుమతి ఈ అవకాశాన్ని మన వియ త్నాం పాలసీలా ఎంతో తెలివిగా ఉపయో గించుకొంది. ఎలక్షన్ సంగతొదిలేసి మిగతా విషయాలు బోలె డతన్తో మాట్లా డింది. మీరు ఇంగ్లీష్ పిక్చర్లెవరి వెక్కువ చూస్తారంది. మీకు నచ్చే హీరో హీరోయి న్లెవరని అడిగింది.

"రాక్ హడ్సన్, క్లాడియా కార్డినల్" అని అతన్జవాబిస్తే "అరె! నాకూ వాళ్ళం టేనే ఇష్టం!" అంది ఆశ్చర్యంగా. అంటూనే అతనిగురించి వివరాలు సేక రించింది.

"పాపం! మీ తండ్రి అ మధ్యన పోయారని విన్నాను!" అంది జాలిగా.

మిగతా కథ సత్తిరాజు చెప్పేశాడు. అప్పటికే బోలెడుకష్టా లనుభవించేసిన తన తల్లిపై బీదతనం నీడ పడనీకుండా మిగతా జీవితం గడపాలనుందని వివ రించేడు. అతని పరిస్థితులు చూసి ఆమె ముచ్చటపడింది. అలాంటి పరిస్థితులంటే

ఇష్టపడికాదు ముచ్చటపడత: ఆ పరిస్థితులు తన స్వార్థానికి అనుగుణ్యంగా ఉన్నాయనే. ఆ సంవత్సరాంతం లోపలే అతనితో నాలుగయిదుసార్లు మాట్లాడే సందర్భాలు కల్పించుకొంది.

రిజల్ట్స్ వచ్చేశాయి. సత్తిరాజు సెకండ్ క్లాసులో పాసయేడు. భానుమతికి ఓ పార్టు మిగిలిపోయింది. గోపాలం మామూలుగానే కాపీలు కొట్టేసి పాసయిపోయేడు.

విదేశ సహాయంమీద ఆశలా, దొరక్క పోయినా ఉద్యోగంమీద ఆశ చావదు కొందరికి. వెదుకుతోనే ఉంటారు సత్తిరాజు బి. ఏ. పాసయిన మర్నాటినుంచీ అలా వెదుకుతోనే ఉన్నాడు. పగలు భూతద్దం వేసుకొనీ, రాత్రిళ్ళు 'త్రీసెల్స్' టార్చిలైట్ వేసుకునీ మరీ వెతుకుతున్నాడు. అయినా చాలామందిలానే అతనికీ ఏ ఉద్యోగమూ దొరకలేదు. అతనిమీద ఆప్యాయతకొద్దీ అతనింటికి వెండిళ్ళవతల ఉండే ప్రజావతమ్మగారు అతనికో ఉద్యోగం వేయించాలని ఉబలాటపడింది. ప్రజావతమ్మ ప్రజల మనిషి. స్వాతంత్ర్య పోరాటంలో వాళ్ళ ఊళ్ళో ముందంజవేసిన మొదటి స్త్రీ ఆమె. కొన్నాళ్ళు జైల్లోకూడా ఉంది. ఆ ఊళ్ళో ఉప్పు సత్యాగ్రహం ఆవిడ ఆధ్వర్యంలోనే ప్రారంభమయింది. విదేశ వస్తు బహిష్కరణోద్యమంలో ఆవిడే ముందస్తుగా తనకు శ్రీవారు బహూకరించిన ఓ సిల్కు చీరను తగలెట్టేసింది. స్వాతంత్ర్యం లభించిం తర్వాత పూలదండ లేసుకొని ఊరేగిన అనేకమంది ప్రముఖుల్లో ఆమె కూడా ఉంది.

స్వాతంత్ర్యం వచ్చింతర్వాత దాని కోసం పోట్లాడిన కొంతమందికి తరువాతేంజేయాలో అర్థం కాలేదు. ఉన్న ఉద్యోగం ఊడిపోయినట్లనిపించింది. చివరకు దానంత పట్టుదలా, టీమ్‌వర్కూ, సరదాలూ ఇవన్నీ ఎలక్షన్ ఫీల్డులో దొరికేట్లు కనిపించినయి. వెంటనే అందరూ తలో పార్టీ స్థాపించేసుకొని రంగంలోకి దూకేశారు. ప్రజావతమ్మగారు తనూ దూకుతానంది గానీ, అవధాన్లుగారు వప్పుకోలేదు. "నీ కసలే కాళ్ళు నొప్పులంటున్నావు గదా, మళ్లీ అందులో ఇందులో దూకడమెందుకూ? హాయిగా కూచుని రెస్ట్ తీసుకోక?" అని కోప్పడ్డారు. దాంతో ఆవిడ తన రాజకీయ జీవితమంతా తెలుగుసినిమా ఇంటర్వెల్ తర్వాత, దానిముందు కథ మర్చిపోయిన ప్రేక్షకునిలా మర్చిపోయింది. వంటింట్లో ఉల్లిపాయ తురుగుతూ అన్నాళ్లూ అలక్ష్యం చేసిన తన భర్తకూ, కూతురికీ వంట చేస్తూ శేషజీవితం గడిపెయ్యాలని నిర్ణయించుకొందామె.

అవధాన్లుగారు తను పనిజేస్తున్న ఓ ప్రైవేట్ కంపెనీ అర్జంటుగా దివాళా తీసింతర్వాత జరిగినంతకాలం అప్పుజేసి దర్జాగా గడిపారు. తర్వాత ఉన్న ఇల్లు




'కాదంబరి తనదయితే ఎంత బావుండు' ననుకొన్న సత్తిరాజొక్కడే అవధాన్లుగారి సమాజంలో చేరేడు. అతని సంస్కారాన్నీ, మంచితనాన్నీ అవధాన్లు గారూ, ఆయన్తోబాటు ప్రజావతమ్మగారు ముచ్చటించుకొంటూంటే విని 'కాబోలు' ననుకొంది కాదంబరి. అప్పుడప్పుడు ఏదో పనిమీద ఇంటికొచ్చి తనతో మాట్లాడ్డం మొదలెట్టాక "కాబోల్నేవిటి? సెంట్ పర్సెంట్ సంస్కారుడు ఇట్టి సజ్జనుని పొందు స్త్రీ ఎంత అదృష్టవంతు రాలోగదా!" అని బెంగపడింది. అప్పుడే ఓ మెరుపు తళుక్కున ఆమె హృదయంలో మెరసింది "నాకంత అదృష్టమా?" అని ప్రశ్నించుకొంది లోలోపల. ఏ గైడ్‌లో దొరుకుతుంది దీనికి సమాధానం! (ఎచ్చటా దొరకదని భావము). అంచేత జవాబు సత్తిరాజునే పబ్లిక్ పరీక్షకు చదివినట్లు క్షుణ్ణంగా చదివి తెలుసుకోవాలనుకొంది. అప్పట్నుంచీ సత్తిరాజు కనబడితే ఆమె గుండెల్లో జ్యోతులు వెలుగుతున్నాయి. అతను మాట్లాడితే ఆమెలోనుంచి విపరీతమయిన చలి పుట్టుకొస్తోంది. అతను తనను చూసి నవ్వితే జీతం పెరిగిన (ధరలు పెరగకుండా) సెంట్రల్ గవర్నమెంట్ ఎంప్లాయీలా మురిసిపోతోంది. ఆ రాత్రంతా ఆమెకు తెలుగు సినిమాలో హీరోయిన్లా రెండు మూడు తియ్యని కలలొస్తున్నాయి.

కాదంబరి అతనికి కాఫీ ఇచ్చింది. ఇచ్చేప్పుడు ఆమె చెయ్యి సిగ్గుతో వేగంగా వణికింది. కాఫీ కొద్దిగా ఆమె

అమ్మిపారేసి సత్తిరాజు ఇంటిదగ్గర కారు చవకలో ఓ భవనంలాంటి పాడుపడిన పెంకుటిల్లు అద్దెకు తీసుకొన్నారు. సత్తిరాజు ఆయన కంతకుముందే తెలుసు. ఓ ఉదయం లేచి మంచి నీళ్ళయినా అడక్కుండా, కాఫీ అడిగి త్రాక్కుండా, హార్టెటాక్‌తో పైకెళ్ళిపోయిన సత్తిరాజు తండ్రి ఆయనకు కోవర్కర్. ఆయన ఈ పెంకుటింట్లో దిగింతర్వాత సత్తిరాజు ఆ కుటుంబానికంతకూ ఆప్తుడయిపోయాడు. సత్తిరాజు ఉద్యోగం కోసం కంట్రోల్ లేని బియ్యం కోసం తిరిగినట్లు తిరుగుతూంటే ప్రజావతమ్మగారు తన జాలిగుండెతో జాలిపడింది. ఆరోజు అతను మామూలు ప్రకారం ఉద్యోగం కోసమని వెళ్ళోతూంటే "ఇట్రామ్మా సత్తీ!" అంటూ పిలచింది. సత్తిరాజు లోపలికొచ్చేడు. బహుశా ఆవిడ తను పాల్గొన్న మరో స్వాతంత్ర్య సమరగాధ వినిపించడానికే పిలిచుంటుందనుకొని, వినడానికి చెవులు రిక్కించుకొని మరీ వచ్చాడు. అయితే ఆవిడ ఎంతసేపటికీ వినిపించకపోయేసరికి ఆశ్చర్యంగా లోపలికి చూశాడు. చూసి మరీ తెగ ఆశ్చర్యపోయాడు. కాదంబరి కప్పునిండా కాఫీ తీసుకొని, ఓ చుక్క కూడా క్రింద సాసర్లోకి చిలక్కుండా అతి జాగ్రత్తగా వస్తోంది. ఆ అమ్మాయి నలా చూస్తోంటే అతనికి పెళ్ళి చూపుల సీను గుర్తొచ్చి చిన్నగా నవ్వుకొన్నాడు. అతను నవ్వు కోడం ఓరకంట గమనించిన కాదంబరి గుండెలు ఝల్లుమన్నాయి. సిగ్గుతో తచ్చిపోయింది (నిజంగా కాదు) అడుగు ముందుకీ వెనక్కూ కూడా పడలేదు, అక్కడే ఆగిపోయింది ఆడదాని వయసులా.

కాదంబరి యస్సెల్సీ చదివింది. పాసయింది. ఆ తరువాత కూడా చదువుతానంది కాని వాళ్ళ నాన్న వప్పుకోలేదు. "చదివి చేసేదేముంది? అడుక్కుతింటవే గదా! ఆపని చాలమంది చేస్తున్నారు. ఇక నువ్వు కూడా ఎందుకూ?" అని కోప్పడేసి, ఉత్తరీయం పైనేసుకొని, అరగని చెప్పులేసుకొని సంబంధాలు వెతకడానికి బయల్దేరారు.

కాదంబరి అందంగా ఉంటుంది. కాని అలా అన్జెప్పి ఆమెని ఒక్కసారి చూసిన వాళ్ళెవ్వరూ వప్పుకోరు. ఆమె అందం 'త్రిబులెక్స్' రమ్ లాంటిది, త్రాగినకొద్దీ నిషా ఎక్కినట్లే, చూసినకొద్దీ ఇనుమడిస్తుందామె అందం.

అవధాన్లుగారు తమ స్థితికి సరిపడే సంబంధంకోసం వెతికి, వెతికి అలాంటిది, తనివ్వగల ధరలో బ్లాకులో కూడా దొరకదని తెలుసుకొని అంధ్రదేశం మీద వళ్ళుమండి 'వరకట్న నిషేధ సమాజం' అని ఓ సంస్థ స్థాపించి ప్రస్తుత అది ఏరోజు కారోజు లిక్విడేట్ కాకుండా కాపాడుకొస్తున్నారు. ఆ సమాజం స్థాపించి సంవత్సరమయిపోయినా కాదంబరి మాత్రం అలానే ఉండిపోయింది.

చేతిమీద వలికింది. మరి కొంచెం సత్తి రాజు చేతిమీద పడింది. ఆమె అందరికీ లోకువయిన అసిస్టెంట్ స్టేషన్ మాస్ట రులా, తప్పుచేసినట్లు తలవంచేసుకొంది.

"మరేం ఫర్వాలేదు!" అంటూ నవ్వే శాడు సత్తిరాజు.

ఈలోగా ప్రజావతమ్మగారు హాల్లోకి వచ్చేసింది.

"అవునూ! ఇంకా ఉద్యోగం దొరక లేదూ?"

"ఊహూ! లేదండీ! 'మనీ, హనీ' అని ఈ రెండిట్లో ఏదొహటి ఉంటేనే గాని ఉద్యోగం దొరకదండీ!" నిస్పృ హగా జవాబిచ్చేడతను.

"పిచ్చాడా?" అంది ప్రజావతమ్మ నవ్వేసి.

సత్తిరాజుకి ఈ కొటేషన్ అర్థం కాలేదు. తెలుగు సిన్మాలు చూస్తే అర్థ వయిపోయేదే గాని అతనవి చూడడు (అంచేత అతని కర్మ కతనే బాధ్యుడు).

"రికమండేషన్ కావాలంటే చెప్పు! ఇప్పుడు మినిష్టర్లూ, ఎంపీలూ ఎవరను కొన్నావ్? స్వాతంత్రోద్యమంలో నాతో పాటు జైల్లో ఉన్నాళ్ళేగా? నా 'మనిషి'కి ఆ మాత్రం ఉద్యోగం వేయించలేరూ?"

సత్తిరాజుకి ఆపరాని నవ్వొచ్చింది. మామూలు నవ్వయితే నవ్వడం బావోదని ఆపేసేవాడే గాని ఆపరాని నవ్వని తెలిసి పోవడంవల్ల పకపక నవ్వేశాడు. మధ్య మధ్య ఈ డైలాగులు ఇరికించాడు

"ఆ....ల్లే...వారండీ! పెద్దపెద్ద పద వుల్లో ఉన్న చాలామందికి 'స్వాతంత్ర్యో ద్యమం'కి స్పెల్లింగ్ తెలియదండీ బాబూ!"

ప్రజావతమ్మగారికి కోపం వచ్చింది. సత్తిరాజది గ్రహించి నవ్వాపేశేడుగాని ఆగలేదు. కాదు .. అతనాపేశాడు కాని అతన్తోపాటుగా నవ్వేస్తున్న కాదంబరి మాత్రం ఇంకా నవ్వుతోనే ఉంది.

ఇజ్జరిగిన నెల్రోజుల తర్వాత ఓ వెన్నెల రాత్రి కాదంబరి వాళ్ళ పెరట్లోని జామచెట్టు క్రింద సత్తిరాజు కౌగిట్లో మత్తుగా ఒరిగింది కాదంబరి. దీని కంతకూ ప్రోత్సాహం కేవలం కాదంబరిదే.

"మీరు తప్పకుండా పెళ్ళి చేసుకొం టారుగదూ నన్ను" అడిగిందామె సత్తి రాజుని.

"ఓ! తప్పకుండా! ఇంతకూ మీ వాళ్ళు వప్పుకొంటారా?" సందేహంగా అన్నాడతను.

"వప్పుకోకేంజేస్తారేం? అమ్మ తమా పెట్టదు, అడుక్కు తిననివ్వదట. నా యిష్టం! వాళ్ళొప్పుకోపోయినా సరే మీతో వచ్చేస్తాను ..."

"బావుంది. పోనీ అలాగే అనుకొన్నా నాకింకా ఉద్యోగం దొరకాలికదా! అందాకా ఓపిక పట్టాలి మనం ..."

కాదంబరికి ఓపిక ఎప్పుడో హరించి పోయింది. ఓ వేళ హరించకపోయినా ఓపికపట్టటం ఆమెకు నచేమిరా ఇష్టం



లేదు. ఆమెకు దేశ జనాభాలా పెరిగిపోతున్న తన వయసు తెలుసు. ఏ వయసు ముచ్చటా వయసులో నన్న సంగతి తెలుసు. తనతోటి వయసు వాళ్ళనుభవిస్తున్న ముచ్చటలు తెలుసు. తన తల్లిదండ్రుల శక్తిసామర్థ్యాలు ఎప్పుడో తెలుసు. ఇలాగే ఉంటే తన భవిష్యత్తు ఏమవుతుందో కూడా తెలుసు. అన్నీ తెలుసు. అంచేతే ఆ మాటే సత్తిరాజుతో అంది.

"ఉద్యోగం రాపోతేనేం? తిండి దొరకదు! అంతేగా! ఫర్లేదు. నాకు మీరుంటే చాలు. ఇంకేమీ అఖ్ఖర్లేదు. ఏమీలేపోయినా ఫర్లేదు. ముందు నన్ను మీదాన్ని చేసుకోండి .."

ఆమెను సముదాయించి, నచ్చజెప్పేసరికి తెల్లారుజామున నాలుగయింది సత్తిరాజుకి.

మరో ఆరు నెలలు మధ్యతరగతివాడి పాలిట కరువురోజుల్లా చాలా కష్టంగా గడిచినయి సత్తిరాజుకి. ఏ ఉద్యోగవూ

దొరకదనే విస్పృహ, నిరాశ, 'ఫ్లూ' జ్వరంలా అతన్నావరించేసుకొన్నాయి. తల్లి ఓ సరికొత్త (డాక్టర్లు డయాగ్నయిజ్ చెయ్యలేని) జబ్బుతో మంచం పట్టేసరికి అతని పరిస్థితి మరింత ఆందోళనకరంగా తయారయింది. గోపాలం వరల్డ్‌బాంకు ఎప్పుడూ అప్పు అడిగే చిన్న దేశాలను విసుక్కుంటున్నట్లు "ఎన్నాళ్ళనిరా? ఏదో ఉద్యోగంలో ఇరుక్కోరాదూ?" అంటూ సత్తిరాజు మీద విసుక్కుంటున్నాడు అప్పు అడిగినప్పుడల్లా.

ఓరోజతను అవధాన్లుగారితో కాసేపు మాట్లాడి వాళ్ళింట్లోంచి బయటికొచ్చేసరికి ఎదురుగ్గా ఓకారు వచ్చి ఆగింది.

"హల్లో రాజూ?" అంటూ అందులోనుంచి భానుమతి గొంతు వినిపించిందతనికి. సత్తిరాజు కారు దగ్గరగా నడిచాడు. లోపల భానుమతే కాక ఓ డాక్టరుగారు కూడా ఉన్నారు.

"మా డాడీ!" అంది భానుమతి.

"నమస్తే!" అన్నాడు సత్తిరాజు.

"మీగురించి అమ్మాయి చెప్పింది!" అన్నాడాయన నవ్వుతూ. ఆయన్నవ్వు ఇంగ్లీష్ క్రైమ్ పిక్చర్లోని బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌లా ఉంది.

"ఇదేనా మీ ఇల్లు?" ఇంటివంక చూస్తూ అడిగి, ఆశ్చర్యంగా ఆయింటివంకే చూస్తుండి పోయింది. ఓక్షణమాగి చటుక్కున తల లోపలకు త్రిప్పుకొంది. అరుగుమీది కాదంబరి విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"ఆబ్బే! ఇది అవధాన్లుగారని ఆయనిల్లు మాది ఇంకా అవతల"

"ఎక్కడయినా జాబ్ చేస్తున్నావా?" అడిగారు డాక్టరుగారు.

"లేదండీ! బహుశా అది చేసే యోగ్యత నారాతలో లేదనుకొంటాను!"

"దొరక్కెక్కడికి పోతుందోయ్ ట్రై అండ్ ట్రై అన్నారు. అవసరే మా యింటికోసారి రావోయ్! తీరిగ్గా మాట్లాడుకుందాం! ఏం? "

కారు వెళ్ళిపోయింది. భానుమతి కాదంబరి ఇంటివంకే చూస్తూ సత్తిరాజుకి రుమాలు ఊపింది.

ఇజ్జరిగిన వారం రోజుల్తరువాత డాక్టరుగారి కారు ఓ ఉదయం అదృష్టంలా వచ్చి సత్తిరాజింటి ముందాగింది. "డాక్టరుగారు మిమ్మల్దీసుకు రమ్మన్నారు" అన్నాడు డ్రైవరు. సత్తిరాజు కారెక్కాడు. అతను తనింటికి తిరిగొచ్చేసరికి సాయంత్రం అరయింది. రావడంతోనే తన కుక్కిమంచం పెరట్లోని బాదంచెట్టు క్రిందేసుకొని అందులో వాలిపోయాడు. అతనికి కాటుక కళ్ళతో తనవేపు దీనంగా చూస్తున్న కాదంబరే కనబడుతోంది ఆ పిల్లచూపులో అవ్యక్తమయిన ప్రేమ ఉంది. ఆ పిల్ల తనతో మాటాడే మాటల్లో వెచ్చదనం ఉంది ఆ పిల్ల తనకిచ్చే కాఫీలో అమృతం ఉంది (పంచదార ఎక్కువయ్యేం కాదు) తన గుండెల్లో కొంత భాగాన్ని ఆ పిల్ల ఆక్రమించుకొని ఉంది పూర్తిగుండెంతా ఆ పిల్లనే నింపాలన్న కోరిక ఉంది. అందుకు అవకాశవూ ఉంది.

కాని అపిల్ల స్నేహకొంటే చన్నీ ళ్ళకు చన్నీళ్ళే తోడవుతాయి. ఉన్న కష్టాలకు మరికొన్ని సమస్యలు కూడు కొంట యి.

భానుమతి స్నేహకొంటే డాక్టరుగా శన్నట్లు తనకి 'ఫ్యూచర్' వస్తుంది. 'పొజిషన్' వస్తుంది సుఖం వస్తుంది. అంచేత తల్లి సుఖపడుతుంది.

''ఏవిటండీ! ఇల్లంతా వదిలి ఇక్కడిలా వంటరిగా '' అంటూ వచ్చింది భానుమతి ప్రిస్టేజ్ సీటు గెల్చిన అభ్యర్థి పడేంత సంతోషం సత్తిరాజుని గెల్చు కోటంచేత. ఆమె మొఖంలో వెలుగు తోంది. అదే ఆనందంతో ఆమె కళ్ళు ఫిజిక్స్ లాబ్‌లోని పాదరసంలా మెరు స్తున్నయి. జడ్జీగారి ముద్దుల చిన్నపాపలా అప్పుడే నడవడం నేర్చుకొంటున్నట్లు ఆమె అడుగులు తడబడుతున్న యి

''ఊ హు ..ఏవీ లేదు ఊరికెనే!'' ఖంగారుపడ్డాడతను.

మొదటిసారిగా ఓడిపోయాడు తను ఐశ్వర్యానికీ, పేదతనానికీ, తన హృదయంలో జరిగిన బై ఎలక్షన్లో పేదతనానికి డిపాజిట్ గల్లంతయింది. తన హృదయాన్ని 'పబ్లిక్ ఆక్షన్' లో కారుచవగ్గా, ఏమాత్రం వాల్యూలేని వస్తువులా అమ్మేశాడు.

''ఏమిటో దాస్తున్నారు మీరు! అతని కళ్ళల్లోకి ముద్దాయిని క్రాసెగ్జామిన్ చేసే లాయరులా చూసిందామె

నవ్వులాంటి దొహటి సత్తిరాజు పెదాలమీద ట్యూబ్‌లైట్లా వెలిగింది.

బెజవాడ గుంటూరు రోడ్‌మీద లారీల్లా కొన్ని సంవత్సరాలు ఎక్స్‌ప్రెస్ స్పీడులో గడిచినయి.

అనాథస్త్రీ శరణాలయం ఎక్స్‌టెన్షన్ వింగ్‌కి కలెక్టరుగారు ప్రారంభోత్సవం చేశారు బాలామంది ప్రముఖులు ఆ ఫంక్షన్‌కి హాజరయ్యేరు. కలెక్టర్‌గారు అలాంటి శరణాలయాల ఆవశ్యకతను గురించి గంభీరంగా ప్రసంగించారు. ప్రభుత్వంవారి గ్రాంటు లభించేట్లు చేయ డానికి తమ శాయశక్తులా ప్రయత్నిస్తానని వాగ్దానం చేశారు.

ఆర్రాత్రి కలెక్టర్‌గారు శరణాలయానికి కొద్దిదూరంలో ఉన్న రహదారి బంగళాలో ఆగారు. భోజనం చేశేక చాలాసేపు ఆయనకు నిద్రపట్టలేదు గడచిన జీవితం ఆయన కళ్ళముందు మెదిలి ఆయన మనసుని చికాకు పరచింది. సత్తిరాజు బి.ఏ, (అనెంప్లాయిడ్) అల్లా ఎస్. రాజు, ఐ.ఏ. యస్ గా తనెలా మారిపోయిందీ గుర్తు కొచ్చింది. దాంతోపాటే కాటుక కళ్ళ నిండా కన్నీటితో కాదంబరి గుర్తు కొచ్చింది ఆమెతో గడిపిన వెన్నెల రాత్రులు గుర్తుకొచ్చినయి. ఆమెకు తను చేసిన వాగ్దానాలు, ఆమె గుండెల్లోని ఆశలూ, కోర్కెలూ అన్నీ గుర్తొచ్చినయి. దాంతో ఆయన గుండె బరువెక్కింది. రాత్రి పదయింది. గది తలుపు మెల్లగా తెరచుకొంది. అందంగా అలంకరించు కొన్న ఓ అమ్మాయి లోపలికి వచ్చింది సత్తిరాజు ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు

"నువ్వా!" అన్నాడు కాదంబరివంక ఆశ్చర్యంగా చూస్తూ.

"అవును. ఎందు కాశ్చర్యపోతున్నారు? ." అందామె అతనివంక చూడకుండా.

'కాని నువ్వు ఇప్పుడిక్కడ ఎలా వచ్చావ్!'

"మామూలుగానే. మీ కిది క్రొత్తేమో! నా కలవాటే. ఎవరయినా పెద్దవాళ్ళు వచ్చినప్పుడు శరణాలయంనుంచి నన్నే పంపిస్తూంటారు. మిగతావాళ్ళందరినీ మా మానేజరే ఎక్కడెక్కడికో తీసుకెళ్తూంటాడు. మా అనాధస్త్రీల మూలాన ఆయన కెంతలేదన్నా రోజుకి వందరూపాయలు గిడుతూంటుంది. ఈ రాత్రికి నా శరీరం మీద సర్వహక్కులూ మీ కిచ్చారు మా మేనేజరుగారు. తీసుకోండి!"

సత్తిరాజు నిర్విణ్ణుడయాడు. "కాదంబరీ ఏమిటి మాట్లాడుతున్నావ్ నువ్వు!"

"నువ్విక్కడ ఎందుకు చేరావ్? అమ్మా నాన్నా ఏమయ్యారు? " ణుకుతోన్న గొంతుకతో అడిగాడతను.

"నాన్న చనిపోయారు. అమ్మకు చ్చి ఎక్కింది. ఎక్కడకు పోయిందో లీదు. నీ పుణ్యాత్ముడు కన్నెచెర వదిలించి పుణ్యం కట్టుకొన్నాడు. మరో ణ్యాత్ముడు నన్నిక్కడ చేర్పించాడు. తరువాత బోలెడుమంది పుణ్యాత్ములు.."

"కాదంబరీ! ఇలా జరుగుతుందని నేనెప్పుడూ అనుకోలేదు. నీకు జరిగిన అన్యాయానికి నేనూ బాధ్యుణ్ణే!...నీకు... నామీద కోపం లేదూ? .."

"లేదు. నాకెందుకూ కోపం? మీరేం చేశారనీ? అంతా భానుమతే చేసింది. మేం ఒకప్పుడు పోట్లాడుకొన్నాం! అందుకని నానుంచి మిమ్మల్ని కాజేస్తుందనుకోలేదు పోసింది! అదంతా ఇప్పుడెందుకూ? .. చూడండి! ఆ వెన్నెల ఎంత బావుందో మత్తు కలిగించటం లేదూ? "

సత్తిరాజు ఆమె ధోరణికి ఉక్కిరి బిక్కిరయ్యాడు. అతని కళ్ళవెంబడి నీళ్లు తిరిగినయి. ఆమె దగ్గరగా నడిచాడు.

"కాదంబరీ! అలా మాట్లాడకు. ప్లీజ్! నీకు న్యాయంకాదు నీకు అన్యాయం జరిగింది. అందులో నాకు భాగముంది. ఒప్పుకొంటాను నువ్విక్కడ ఉండొద్దు నాతో వచ్చెయ్! ఎక్కడయినా ఓ ఉద్యోగం ఇప్పిస్తాను! గౌరవంగా బ్రతకొచ్చు "

అతని చెంప ఛెళ్ళుమంది.

"పిచ్చిగా మాట్లాడకు! ఆడది ఓసారే మోసపోతుంది "

వెక్కి వెక్కి ఏడవసాగిందామె.

మరికొద్ది క్షణాల్లోనే సత్తిరాజు కారు ఆ బంగళాలోనుంచి బయటకు దూసుకుపోయింది. కాదంబరి పిచ్చిదానిలా ఆ చీకట్లో అనాధ శరణాలయంవేపు నడిచింది.



# ఉపాఖ్యానం

సి. రామచంద్రరావు

"వన్ నో ట్రంప్"

"నో బిడ్"

"త్రీ స్పేడ్స్"

"నో బిడ్"

"ఫోర్ నో ట్రంప్స్"

"నో బిడ్"

"ఫయివ్ హార్ట్స్"

"నో బిడ్"

"సెవెన్ స్పేడ్స్"

రంగారావు కళావరు పది ఆడేడు. జస్టిస్ జగన్నాధం పద్దెనిమిది పాయింట్ల డమ్మీ చెయ్యి టేబిల్ మీద పరుస్తూ, అయిదు స్పేడ్ ముక్కల్ని చూపించి పార్ట్నర్ని అడిగాడు.

"ఎలా వుంది?"

"థాంక్యూ పార్ట్నర్!" అంది మిసెస్ జగన్నాధం.

బేరరు ట్రే తీసుకువచ్చాడు. ట్రేలో అప్పుడే వచ్చిన ఉత్తరాలు వున్నాయి. జస్టిస్ జగన్నాధం గబగబా అన్నిటిమీద దస్తూరీ చూసి ఒక కవరుతీసి చింపాడు.

"ఎక్కణ్ణుంచి?" మిసెస్ జగన్నాధ

అడిగింది.

"ముందు నీ గ్రాండ్ స్లామ్ కానియ్, చెప్తాను."

"ఏం పరవాలేదు చెప్పు.

"ఆడేటప్పుడు ఇవన్నీ పట్టించు కుంటే నీకు బ్రిడ్జి వచ్చినట్టే."

జస్టిస్ జగన్నాధం నవ్వేడు. ఆయన బ్రిడ్జిలో అరితేరిన ఆటగాడు. మిసెస్ జగన్నాధం కొంతకాలం క్రితమే నేర్చు కోడం ప్రారంభించింది. క్లబ్బులో ఆడా లని ఆవిడకి సరదా. అయితే అది అంత తేలికయిన విషయం కాదు. బ్రిడ్జి ఆట గాళ్ళు ఏం చెయ్యమన్నా చేస్తారుగాని స్నేహితులు కానీ, ఎవరుకానీ, తప్పు ఆట ఆడితేమటుకు విమర్శించకుండా వుండలేరు. నేర్చుకునేవాళ్ళతో ఆడడం చాలామందికి ఇష్టం వుండదు. కొత్తగా నేర్చుకునే రోజుల్లో వీళ్ళుపడే భయం, సందేహం ఏ కొద్దిమందికో గాని జ్ఞాపకం వుండదు. జ్ఞాపకం వున్నవాళ్ళలో కూడా ఒక రకం మనస్తత్వం అలవడినట్టు కని పిస్తుంది. ఒకప్పుడు విమర్శకి ఎంత నొచ్చుకున్నా, తాము ఒగ్గి నేర్చుకున్నారు కాబట్టి కొత్తగా నేర్చుకొనే వాళ్ళుకూడా అదేవిధంగా నెగ్గుకుని రావలసిందే! ఏమయినా మిసెస్ జగన్నాధం క్లబ్బులో బ్రిడ్జి ఆడడానికి ధైర్యం చెయ్యలేదు. ఇంటిదగ్గిర స్నేహితుల్తో ఆడడంతో ప్రారంభం చేసింది. రంగారావూ, ఆయన భార్యకూడా ఆట నేర్చుకుంటున్నవాళ్ళే. అందుచేత రోజూ రంగారావు ఇంట్లోనో జడ్జీగారి ఇంట్లోనో ఆట సాగుతుంది. జస్టిస్ జగన్నాధం ఎవరెవరు ఎప్పుడు తప్పు ఆడేరో విడమర్చి చెప్పి, ఎలా ఆడాలో నేర్పుతాడు.

"పోనీలే" మిసెస్ జగన్నాధం కోపం అభినయించి ఆటలో పడిపోయింది.

జస్టిస్ జగన్నాధం టేబిల్ వదిలి దూరంగా కిటికీ దగ్గిరవున్న సోఫాలో కూర్చుని ఉత్తరం చదవడం ప్రారం భించాడు.

"స్లామ్ నెగ్గాం" సంతోషంగా అరి చింది మిసెస్ జగన్నాధం.

"అంతేకాదు. దాంతో స్ట్రెయిట్ రబ్బర్‌కూడా గెలిచారు" స్కోర్ పేడ్ మీద అంకెల్ని కూడుతూ మిసెస్ రంగా రావు అంది.

"రబ్బుపోతే పోయింది. దాని విలు వకి టీ అయినా తాగుదాం" అన్నాడు రంగారావు ట్రేలో కేక్ తీసుకుంటూ.

"పదహారు పాయింట్లు! ఇలా అయితే మనం ఆస్తులు అమ్ముకోవలసిందే" అంది మిసెస్ రంగారావు.

వాళ్ళు పాయింటుకి ఇరవై నయా పైసల చొప్పున ఆడతారు. అది స్వల్పం అని మిసెస్ రంగారావు అభిప్రాయం. జడ్జీగారు మాత్రం దాన్ని పెంచడానికి ససేమిరా ఒప్పుకోరు. ఇరవై నయా పైసలవరకూ అయితే పరవాలేదు. అంతకు మించితే జూదం చట్టవిరుద్ధం




అని ఆయన అంతరాత్మ ఘోషిస్తుంది.

టీ కలుపుతున్న మిసెస్ జగన్నాథానికి ఉత్తరం విషయం జ్ఞాపకం వొచ్చింది

"ఉత్తరం ఎక్కణ్ణుంచి జగన్" ఆమె అడిగింది

"నిర్మల్ రాసింది."

"ఏమిటి విశేషాలు?"

"ఎప్పటి గోలే. అతనికి ఉద్యోగం చూడమంటుంది."

"పాపం. అంతగా అడుగుతుంటే సాయం చెయ్యకూడదూ?"

"ఉద్యోగాలు ఇవ్వడానికి నా చేతుల్లో వున్నయ్యా?"

జస్టిస్ జగన్నాథం విసుక్కున్నాడు.

"ఎవరికి ఉద్యోగం?" రంగారావు అడిగాడు.

"వెంకట్‌కి" మిసెస్ జగన్నాథం సమాధానం ఇచ్చింది.

"వెంకట్ ఎవరు."

"మా అల్లుడు, నిర్మల్ మొగుడు."

వాళ్ళ అల్లుడు రాజమండ్రిలో 'లా' ప్రాక్టీసు చేస్తున్నాడని రంగారావుకి తెలుసును. కాని అతని పేరు జ్ఞాపకం రాలేదు.

అందరూ నిర్మల్ మొగుడనే అంటారు.

"నిజంగా కావాలంటే అతనికి ఉద్యోగమే దొరకదా?" అన్నాడు రంగారావు.

"దొరక్కే ఇంత తాపత్రయం."

మిసెస్ జగన్నాథం మాటల్లో మొగుడుమీద సాధింపు వుంది.

"ఇక్కడికి రమ్మనండి. నే నిస్తాను" అన్నాడు రంగారావు

రంగారావు ఫోర్బ్స్ ఎండ్ మెడీసన్ కంపెనీకి జనరల్ మేనేజరు. అతనూ,

జగన్నాథం పాతికేళ్ళ క్రితం బార్-ఎట్-లా ఇంగ్లండులో ఒకే 'ఇన్' నుంచి చదువుకున్నారు. జగన్నాథం మూడేళ్ళ క్రితం హైకోర్టుజడ్జి అయి హైదరాబాదు వచ్చినప్పుడు, పాత పరిచయాన్ని పురస్కరించుకొని రంగారావూ, భార్యా, జడ్జి గారింటికి వెళ్ళేరు. జగన్నాథం దంపతులకీ, వాళ్ళకీ బాగా కలిసి స్నేహం వృద్ధి పొందింది.

"థాంక్స్ రంగా!" అన్నాడు జస్టిస్ జగన్నాథం. ఉద్యోగం వేయించాలని వుంటే నీతో ఎప్పుడో సంప్రదించేవాణ్ణి. వెంకట్ ఉద్యోగం చెయ్యడం నా కిష్టం లేదు.

"ఏం?" అన్నాడు రంగారావు.

"అతను లాయరుగా పైకి వొస్తాడని నా నమ్మకం."

"అయితే 'లా' ని అంటిపెట్టుకుని వుండవలసిందే. ఉద్యోగాలు చేసి మనం సంపాదించే దెంత? దాచేదెంత?"

రంగారావు మాటల్లో తన ఉద్యోగం గురించి తృప్తి మర్మంగా దాక్కుని వుంది. అతనికి నెలకి అయిదువేల రూపాయల జీతం వొస్తుంది. కారూ, ఇల్లూ కంపెనీదే, ఇదికాక బోలెడు బోనసు.

"డబ్బుమాట సరే రంగా! వెంకట్ లాటివాడు ఆఫీసు బల్లముందు కూచుని కాగితాలమీద సంతకాలుచేస్తూ కాలం గడిపేయడం అన్యాయం."

"యువర్ లార్డ్ - షిప్‌కి మా ఉద్యోగాలమీద సరయిన అభిప్రాయం వున్నట్టు లేదు" రంగారావు నవ్వేడు.

"సారీ రంగా!" అన్నాడు జస్టిస్ జగన్నాథం. "అన్ని ఉద్యోగాల గురించీ నేననడంలేదు. మన పలుకుబడి వుపయోగించి వేయించిన ఉద్యోగాల్లో అంతకంటే ఏం పని వుంటుంది?"

"నిజమే" అన్నాడు రంగారావు.

"మన పలుకుబడివల్ల వచ్చిందని జీతం ఇవ్వడం మానెయ్యరు కదా!"

మిసెస్ జగన్నాథం అడ్డు తగిలింది. ఆమె మాటల్లో వ్యంగ్యం జస్టిస్ జగన్నాథాన్ని చికాకు పరిచింది.

"జీతం, జీతం" అన్నాడు.

"అంతేకాదు ఎయిర్ కండిషన్డ్ ఆఫీసూ, విదేశాల్లో విహారాలూ, ఇంకా ఏమిటి రంగా?"

రంగారావువైపు చూసింది మిసెస్ జగన్నాథం.

ఫోర్బ్సు ఎండ్ మెధీసన్ కంపెనీకి ఎయిర్ కండిషన్డ్ ఆఫీసు గదులున్నాయి. ఏడాదికొక నెల కంపెనీ ఖర్చుమీద భార్యా పిల్లలతో సహా రంగారావు ఊటీయో, కాశ్మీరో, ముస్సోరీయో ఏదో విలాసస్థలానికి వెళుతూవుంటాడు. మూడేళ్ళ కొకసారి ఆరు నెల్ల పాటు విదేశాల్లో సెలవు గడపడానికి కంపెనీ ఖర్చు భరిస్తుంది ఇంకా ఇటువంటి సౌకర్యాలెన్నో కంపెనీ అతనికి కల్పిస్తుంది.

రంగారావు మాట్లాడలేదు; చిరునవ్వు



యువ

నవ్వేడు.

"నీ అల్లుడికి మొదటే జనరల్ మేనేజర్ ఉద్యోగం వేయించేస్తావా ఏమిటి?" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"సుశీ తలుచుకుంటే వేయించలేదా!" నవ్వేడు రంగారావు.

"అసిస్టెంటుకి మాత్రం ఏమంత తక్కువ రాదుగా!" అంది మిసెస్ జగన్నాధం.

అది నిజమే. బ్రిటిష్ పద్ధతుల్లో నడిచే కంపెనీలకి రెండు గ్రేడ్లు వుంటాయి. కవెనెంటెడ్ గ్రేడులో ఆఫీసర్లుగానే తీసుకుంటారు. అన్ కవెనెంటెడ్ గ్రేడ్‌లో గుమాస్తాలూ, వాళ్లూ వుంటారు. అసిస్టెంట్ కవెనెంటెడ్ ఆఫీసరు, దగ్గర దగ్గర వెయ్యిరూపాయల జీతం వస్తుంది. జనరల్ మేనేజరుకి మూడేళ్ళ కొకసారి విదేశాల్లో సెలవు ఇస్తే అసిస్టెంటుకి అయిదేళ్ళ కొకసారి ఇస్తారు. అలాగే అన్ని సౌకర్యాలూను.

"వెంకట్ ఇప్పుడే అంత సంపాదించలేకపోవచ్చు. కాని ముందుముందు ఉద్యోగాల్లో ఎవరూ సంపాదించలేనంత సంపాదిస్తాడు. నా మాట నమ్ము. ఈ విషయాల్లో కాస్తో కూస్తో అనుభవం ఉన్నవాణ్ణి" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"సంపాదించవలసిందే ఆ మహా పట్నంలో" అంది మిసెస్ జగన్నాధం.

"ఏం. అక్కడమాత్రం సంపాదించిన వాళ్ళు లేరా?" అడిగాడు జస్టిస్ జగన్నాధం.

"సుశీ చెప్పిందికూడా నిజమే" అన్నాడు రంగారావు. "అక్కడ అభివృద్ధికి ఏమంత అవకాశం వుంటుంది? హైకోర్టుకి వొచ్చెయ్యకూడదమా?"

"కొంతకాలం ఆగి వస్తాడు."

"ఏం?"

"ఇప్పుడిప్పుడే అక్కడ పేరు సంపాదించుకుంటున్నాడు. ఇంకొక రెండు మూడేళ్లు వుండి దాన్ని స్థిరం చేసుకుంటే హైకోర్టుకి వచ్చింతర్వాత ఆవైపు పనంతా తనకే వస్తుంది."

"నీసిచ్చినమ్మకమే నీకు" అంది మిసెస్ జగన్నాధం. మొదటిసారి వెంకటరమణని చూసినప్పుడే జగన్నాధానికి అతని సామర్థ్యంలో నమ్మకం కుదిరింది. అప్పుడు జగన్నాధం రాజమండ్రిలో డిస్ట్రిక్టు ఎండ్ సెషన్స్ జడ్జీగా వుండేవాడు. వెంకటరమణ తన సమక్షంలో ముద్దాయి తరపున లాయరుగా వాదించాడు. ఖూనీకేసు. పల్లెటూళ్ళో రెండుపక్షాల మధ్య కక్షలు. ముద్దాయి ముగ్గురి మనుష్యుల్ని నిష్కారణంగా పొట్టని పెట్టుకున్నాడని ప్రాసిక్యూషన్ కేసు. ఉరిశిక్ష తప్పితే అదృష్టమే అనుకున్నారంతా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి సహాయం చెయ్యడానికి హేమాహేమీలయిన లాయర్లు. ప్రాసిక్యూషన్ కేసు చాలా కట్టుదిట్టంగా తయారుచేశారు. అయితే 'కుర్రప్లీడర్లు' తేలిగ్గా వొదిలే రకం కాదని అందరికి గట్టి

నమ్మకం.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ ముద్దాయిమీద ఆరోపణలు ముగించిన తరవాత వెంకట రమణ తన క్లయింటు తరపున వాదించ డానికి లేచి కోర్టంతా ప్రతిధ్వనించేలా ముద్దాయి నిర్దోషి అని ఉద్ఘాటించాడు. ప్రాసిక్యూషన్ కేసు అబద్ధాలపుట్ట అన్నాడు. న్యాయాన్ని ఉద్ధరించడానికి ఏర్పాటయిన పబ్లిక్ ప్రాసిక్యూటర్, పోలీసులు తెచ్చిన ప్రతి కేసూ గెలవడమే ఆశయంగా పెట్టుకుని నిజానిజాలు కప్పి పుచ్చడం శోచనీయం అన్నాడు.

జడ్జీలు పెద్ద గొంతులకీ, అభినయాలకీ మోసపోరు, మోసపోకూడదు. మనస్సు ఏం చెప్పినా, న్యాయసూత్రాల ప్రకారం సాక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని కేసు విచా రణచేసి తీర్పు చెప్పాలి. వెంకటరమణ అరుపులూ, ఆరోపణలూ కేసు విచారణకి నాంది. దాన్ని సాధ్యమైనంత త్వరగా మర్చిపోయిన నేరానికీ,చట్టసూత్రాల అన్వ యానికీ ఇరుపక్షాల లాయర్ల వ్యాఖ్యానం వైపు దృష్టి మరిపించటానికి తొందర పడ్డాడు జగన్నాధం

ముద్దాయి ఆత్మ సంరక్షణకోసం ముగ్గురి ప్రాణాలు తీయవలసి వచ్చిందని వెంకటరమణ వాదం, దెబ్బలాట జరిగిన చోటుకి వెళ్ళి ప్రతి విషయాన్నీ అతను శల్యపరీక్ష చేశాడు. కర్రసాము నేర్చు కున్నాడు. నీటికాలవ దగ్గిర కాపలా కాస్తున్న ముద్దాయిని కందభూమి ఖామందులు గట్టు తీసెయ్యమని అడగడం, ముద్దాయి నిరాకరించడం, కోపంతో రెచ్చిపోయి రెండోపక్షం వాళ్ళు కత్తులు తీసుకుని ముద్దాయిమీద పడడం, ముద్దాయి కర్రతో వాళ్ళని ఎదుర్కోడం, ఆ దెబ్బ లాటలో ముగ్గురి ప్రాణాలు పోవడం అంతా ఎలా జరిగివుంటుందో కోర్టు హాలులో చేసి చూపించాడు. ముద్దాయికి తగిలిన దెబ్బలన్నీ వెనకనుంచి కొట్టినవే అని నిరూపించాడు. ప్రాణాలు రక్షించు కోడానికి కర్ర ఉపయోగించక తప్పలే దన్నాడు.

వెంకటరమణ ఏకాగ్రత, అతని రీతిలో తీక్ష్ణత, అతని మాటల్లో శక్తి జగన్నాధాన్ని ఆకర్షించాయి. లాయరుగా వెంకటరమణకి మంచి భవిష్యత్తు వుందను కున్నాడు

"నా అభిప్రాయం మార్చుకోవలసిన అవసరం ఇంతవరకూ రాలేదు" అన్నాడు జస్టిస్ జగన్నాధం

"ఇప్పటిమాట సరే, ముందు పరిస్థితి ఏమిటి?" అంది మిసెస్ జగన్నాధం.

"నీ కూతుర్ని పెళ్లాడాడు కాబట్టి నీ కింత సందేహం సుశీ! ముందు ముందు అతని ప్రాక్టీసు ఇంకా బాగుంటుంది"

"సాంబశివయ్యగా రేమన్నారో జ్ఞాప కం వుందా?"

జస్టిస్ జగన్నాధానికి సాంబశివయ్య మీద అనుకోకుండా అకస్మాత్తుగా కోపం వచ్చింది. ఆయన రాజమండ్రిలో డిస్ట్రిక్ట్




జడ్జీగా వుండేటప్పుడు సాంబశివయ్య పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుండేవాడు. అప్పుడప్పుడు బ్రిడ్జి ఆడడానికి జగన్నాధం ఇంటికి వొచ్చేవాడు. ఒకసారి ఆట చాలించిన తరవాత కబుర్లలో వెంకట రమణ విషయం వొచ్చింది.

"ఆడంబరమే కాని. అసలు సత్తువ లేదు" అన్నాడు సాంబశివయ్య.

"కుర్రతనం, అదే సర్దుకుపోతుంది" అన్నాడు జగన్నాధం.

"క్షమించాలి. కుర్రతనంలో చెయ్య వలసింది 'లా' పుస్తకాలు చదువుకోడం, సీనియర్ లాయర్ల పద్ధతులు చూసి నేర్చుకోడం కాని. నలుగురు పెద్దకాపుల్నీ తాగుబోతుల్నీ వెంట పడేసుకుని బజార్లో ప్రగల్భాలు కొట్టడం కాదు" అన్నాడు సాంబశివయ్య.

సాంబశివయ్య మాటల్లో కష్టంవున్నా. పూర్తిగా నిజం లేకపోలేదు. వెంకట రమణ పద్ధతులు విచిత్రంగా వుంటాయి. తక్కిన లాయర్ల కివి రుచించలేదు. దానికి రెండు కారణాలు వున్నాయి. మొదటిది కొత్తగా వృత్తిలో ప్రవేశించినా ఎంతోకాలంగా అక్కడ వేళ్ళు పాతుకుపోయిన లాయర్లతో పోటీపడి నెగ్గుకుని రావడం, కొందరి సంపాదన ఇతనివల్ల క్షీణించింది. రెండవది వెంకట రమణ నోరు. అతని మనస్సులో తక్కిన లాయర్లంతా ప్రబల విరోధులు కోర్టులో కేసు నడుపుతున్నప్పుడే కాదు ఇంటా. బయటా. బజార్లోనూ, క్లబ్బులోనూ. ఎక్కడ అవకాశం వుంటే అక్కడ వాళ్ళని విమర్శించి ఖండిస్తేనేకాని అతనికి తృప్తి వుండదు అక్కడ పేరుబడ్డ

లాయర్ల ప్రతిభలో అతనికి కొంచెమైనా నమ్మకంలేదు. ఈ విషయం రహస్యంగా వుంచడానికి ప్రయత్నించకపోగా, కని పించిన ప్రతి వ్యక్తికీ, బోధించి వాళ్ళ అభిమానం తనవైపుకి మొగ్గేలాగా ప్రయ త్నించాడు. ఇదికాక తననుగురించి ప్రచా రం చెయ్యడానికి కొంతమందిని తయారు చేశాడు. రిక్షాలవాళ్ళకీ, బళ్ళవాళ్ళకీ, బస్సు డ్రైవర్లకీ, కండక్టర్లకీ జీతాలిచ్చి ప్రచారం చేయించుకుంటాడని పేరు. కోర్టు వ్యవ హారాల్లో రైలు దిగినవాళ్ళని తిన్నగా తన దగ్గరకి తీసుకురావడానికి కొందర్ని ఏర్పాటుచేశాడనికూడా అంటారు.

వెంకటరమణవల్ల సాంబశివయ్య ఆదా యం కించిత్తయినా తగ్గలేదు. అయినా తక్కిన లాయర్లతోపాటు తనుకూడా వెంకటరమణ పద్ధతుల్ని నిరసించాడు. అయితే సాంబశివయ్య కోపానికి కారణం వేరే వుంది. వెంకటరమణ హత్యలవంటి పెద్ద క్రిమినల్ కేసుల్లో ప్రాసిక్యూషన్ పక్షానికి వ్యతిరేకంగా పనిచేసి గెలిచేవాడు నిజానికి ఏ హత్యకేసులోనైనా ప్రాసిక్యూ షన్ వైపుకన్న అపరాధి తరఫున కేసు వాదించడం సులభం. ప్రాసిక్యూషన్ ఇతను అపరాధం చేశాడని నిందిస్తుంది; నిరూపించడానికి ప్రయత్నిస్తుంది. నిరూ పణ అతి నిర్దుష్టంగా వుండాలి. ఏమాత్రం సందేహం వున్నా కోర్టు అపరాధివైపునే నిలబడుతుంది. ఈ పరిస్థితుల్లో సాంబ శివయ్య పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా గెలిచే కేసులు ఎక్కువ వుండేవికాదు. ఉండాలని న్యాయస్థానాలు నడిచే విధానాలు తెలిసిన వాళ్లు అనరు. అయితే, వెంకటరమణ ఎదురుగా వాదించిన కేసుల్లో ప్రాసి క్యూషన్ గెలవనప్పుడు సాంబశివయ్య సమర్థతమీద వెంకటరమణ జరిపే దాడికి అంతూ పొంతూ వుండదు. ఈ గెలుపు తన ప్రతిభ చాటుకోడంకోసం వెంకట రమణ ఉపయోగించుకునేవాడు.

వెంకటరమణ సాంబశివయ్యని పెట్టే తికమకలు జ్ఞాపకం వొచ్చి నవ్వుకున్నాడు జస్టిస్ జగన్నాధం.

"పాపం, పెద్దమనిషికి కోపం రావ డంలో తప్పులేదు" అనుకున్నాడు.

కాని, సాంబశివయ్య చెప్పినదాంతో జగన్నాధం పూర్తిగా ఏకీభవించలేదు. వెంకటరమణ తరహా నిర్దుష్టమైనది కాదన్నమాట నిజమే. కాని ఆ పద్ధతుల వల్ల అతను అయోగ్యుడయ్యాడని జగ న్నాధం నమ్మలేదు. వెంకటరమణలో అట్టహాసం పాలు ఎక్కువ. పుస్తకాలు చదివి కృషి చెయ్యడంకంటే ఇతర పద్ధ తులమీద ఎక్కువ ఆధారపడ్డాడు. జగ న్నాధం ఉద్దేశంలో లాయరుగా ప్రావీ ణ్యం సంపాదించడానికి కావలసినవి అభి రుచి- కాలం. వకీలు వృత్తిలో పాతుకు పోయినవాళ్ళకి రెండూ నెమ్మదిమీద సుల భంగా లభ్యం అవుతాయి. వెంకటరమణ కూడా కాలక్రమేణా 'లా' సూత్రాలకి చిలవలూ, పలవలూ కల్పించి వ్యాఖ్యానం

చెయ్యడం. ప్రతి వాదనకి పదికేసులు ఉద్ఘోషించి బలపరచడం నేర్చుకుంటాడు. అది బ్రహ్మవిద్య కాదు. కాలంకాని, మరొకటి కాని నేర్పలేని ఏదో ప్రజ్ఞ వెంకటరమణలో వుంది. అది అతన్ని వృత్తిలో చివరంటా తీసుకుపోతుంది. ఆ నమ్మకం జగన్నాధానికి వుంది. ప్రతి సారీ వెంకటరమణ తనముందు కేసు వాదించినప్పుడు అది బలపడింది. అయితే, ఆ ప్రజ్ఞ ఏమిటో ఇదమిద్ధమని జగన్నాధం నిర్ణయించుకో లేకపోయాడు. సాంబశివయ్యకి విప్పి చెప్పడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. సాంబశివయ్య జగన్నాధం చెప్పిందంతా విని అన్నాడు

"మీరు పైపై మెరుగులు చూపి మోస పోతున్నారు"

"మెరుగులే కాదు సాంబశివయ్య గారూ! బాగా ఆర్జిస్తున్నాడనికూడా విన్నాను" అన్నాడు జగన్నాధం.

"ఇప్పుడొస్తుందేమో కాని, అట్టే కాలం నిలబడదని నా ఉద్దేశం" అన్నాడు సాంబశివయ్య; అక్కడ వున్నవాళ్ళంతా వొనన్నారు. ఆ విషయం ఇప్పుడు మిసెస్ జగన్నాధం గుర్తుకి తెచ్చింది.

"ఇవన్నీ పెళ్ళిముందు ఆలోచించ లేక పోయావా!" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"తండ్రీ, కూతురూ కలిసి నామాట వడనిస్తేనా"

అది నిజం కాదని ఆవిడకి తెలిసినా యు వ

కోపంతో అంది.

నిర్మల వెంకటరమణని పెళ్ళి చేసుకుంటానని చెప్పినప్పుడు జగన్నాధం 'తొందరపడి చేసుకోవద్దు. బాగా ఆలోచించుకో' అన్నాడు.

వెంకటరమణ తండ్రి రాజమండ్రీ దగ్గిర చిన్న పల్లెటూళ్లో కరణం. పన్నెండేళ్ళు వచ్చేవరకూ వెంకటరమణ అక్కడే పెరిగాడు. తరువాత చదువుకని రాజమండ్రీ వచ్చాడు. అక్కడ బి. ఏ. ప్యాసయి, వాల్టేరులో 'లా' పరీక్షకి చదివాడు. అతను ఎరిగిన జీవితం, పెరిగిన వాతావరణం నిర్మలకి కొత్త. నిర్మల చిన్నతనం నుంచీ ఇంగ్లీషు స్కూల్లో చదువుకుంది. అయిదేళ్ళప్పుడే కోటగిరి నర్సరీ స్కూల్లో చేరింది. తరవాత లవ్‌డేల్‌లోనూ, బ్రీక్స్ స్కూల్లోనూ చదివి ప్రెసిడెన్సీ కాలేజీలో డిగ్రీకోర్సు చదివింది.

"వెంకటరమణ తెలివయినవాడు; మంచివాడు. కాని పెళ్లాడే ముందు చూసుకోవలసినవి ఈ రెండే కాదు." అన్నాడు కూతురితో జగన్నాధం.

"పరవాలేదు" అంది నిర్మల.

మిసెస్ జగన్నాధానికి నిర్మల పెళ్లి చేసుకుంటాననడమే బ్రహ్మానందమయింది. రెండేళ్ళుగా కూతురు పెళ్ళి వాయిదా వేస్తోంది. త్వరగా చేసుకోక పోతే వయసుమీరి పోతుందని ఆవిడ బాధ. పైగా వయసువచ్చిన పిల్ల పెళ్ళి

పొద్దనడం ఆవిడలో శంక రేపింది. మద్రాసులో ఉన్నప్పు డెవర్నయినా ప్రేమించి వంచించ బడిందేమోనని అను మానం వేసింది. ఎంత అడిగినా నిర్మల ఏమీలేదనే సమాధానం ఇచ్చింది. మిసెస్ జగన్నాథం మట్టుకు పార్టీసాకు కల్పించి తెలిసిన యువకుల్లో యోగ్యులయిన వాళ్ళని నిర్మల కలుసుకునేటట్టు చేస్తూనే వుంది. వాళ్ళందర్నీ కాదని నిర్మల ఇతన్ని పెళ్లి చేసుకుంటాననడం ఆవిడకి ఆశ్చర్యం వేసింది వెంకటరమణని నిర్మల కలుసు కున్నది పార్టీల్లో కాదు. అతన్ని డిస్ట్రిక్ట్ జడ్జిగారింటో పార్టీలకి ఎప్పుడూ పిలవ లేదు. వెంకటరమణ మీద ఏర్పడ్డ అభి మానంవల్ల జగన్నాధం అతన్ని పిలిచి ఎప్పుడయినా ప్రోత్సహిస్తూ ఉండేవాడు. వెంకటరమణ ఏదయినా సెలవురోజున జడ్జిగారింటికి వెళ్తూవుండేవాడు. ఒకసారి వెళ్లినప్పుడు నిర్మలని కలుసుకున్నాడు. ఆమె అతనిని ఎంతో ఆకర్షించింది. అప్పట్నించీ ఆమెతో మాట్లాడడంకోసం తరచూ జడ్జిగారింటికి వెళ్ళడం మొదలు పెట్టేడు. కొంతకాలానికే వాళ్ళ స్నేహం ప్రేమగా మారి పెళ్లి చేసుకోడానికి నిశ్చయం చేసుకున్నారు.

"ఇద్దరికీ ఇష్టమయితే నాకూ ఇష్టమే" అన్నాడు జగన్నాధం. మిసెస్ జగన్నా ధానికి ఇంగ్లాండు వెళ్ళి వచ్చిన అల్లుడి మీద వున్నా ఈ పెళ్లికి అడ్డు చెప్పలేదు. ఆవిడకి కావలసింది కూతురికి సుఖ్ఖ్యత్వం, డబ్బుండటం. వెంకటరమణకి కొద్దో గొప్పో ఆస్తివుంది. ప్రాక్టీసులో ప్రవేశించి నాలుగేళ్ళు నిండకుండానే బోలెడు సంపా దిస్తున్నాడు! చాల తెలివయినవాడని జ గ న్నా ధం ఎప్పుడూ చెపుతూనే వున్నాడు. అంతకుమించి అప్పుడు ఆవిడ ఆలోచించలేదు ఇప్పుడు కూతురు అదే పనిగా మొగుడికి ఉద్యోగం చూడమని రాయడంతో ఆవిడలో మునుపులేని శంకలు బయల్దేరాయి. వెంకటరమణ సంపాదనతో సంసారం గడవడం లేదేమో? నిర్మలకి అతనితో సామరస్యం కుదరడంలేదేమో? ఆ చిన్న ఊళ్ళో నిర్మల వుండలేకపోతుందేమో? ఈ ఆలో చనల్తో ఆవిడ హృదయం ఆర్ద్రమై పోయింది. చేతిలో టీ కప్పు బల్లమీద పెట్టి మొగుడి దగ్గిరకి జరిగింది.

"పెళ్ళయాక నిర్మల ఇంటికి వెళ్ళనే లేదు. ఈ దసరాకి వెళ్దామా?" అంది.

జస్టిస్ జగన్నాధం ఆమె కళ్ళల్లోకి చూశాడు ఉబికివస్తున్న కన్నీళ్ళు అపు కుంటున్నట్టనిపించింది. ఆవిడ మన స్సులో ఆందోళన గ్రహించాడు. హైకోర్టు జడ్జీ అయి హైదరాబాదు కొచ్చిన ఈ మూడేళ్ళల్లో అల్లుడి ఇంటికి వెళ్ళడమే పడలేదు. ఒకసారి కాన్పుకి కూతురే అక్కడికి వచ్చింది. తరవాత ఏదో ఒక అడ్డు రావడం, పెట్టుకున్న ప్రయాణం పడకపోవడం జరిగింది

"సరే వెళ్దాం" అన్నాడు జస్టిస్




జగన్నాధం.

"సుశీ తలుచుకుంటే ఏమయినా సాధించగలదని నేను చెప్పలేదూ?" అన్నాడు రంగారావ్.

"మీరుకూడా రాకూడదూ! అక్కణ్ణుంచి వెంకట్ పొలాల్లోకి, తోటల్లోకీ పోవచ్చు. హాయిగా వుంటుంది" అంది మిసెస్ జగన్నాధం.

"థాంక్స్. సుశీ! ఇంకెప్పుడయినా చూద్దాం ఇప్పుడు నేను ఇక్కణ్ణుంచి ఒక్కరోజు కూడా కదలడానికి వీల్లేదు" అన్నాడు రంగారావు.

"మా బదులుకూడా మీరే ఆనందించి రండి" అంది మిసెస్ రంగారావు.

* *

అల్లుడిలో జస్టిస్ జగన్నాధానికి ఏదో ప్రబలమైన మార్పు కనిపించింది. ఎంత ప్రయత్నించినా దేంట్లోనో అంతుపట్ట లేదు. ఏదో మార్పు. ఏదో వెలితి అంతే. వెంకటరమణతో మాట్లాడదామని ఆఫీసు దగ్గిరకి వెళ్ళాడు జస్టిస్ జగన్నాధం. వెంకటరమణ లోపలిగదిలో కూర్చుని రాసుకుంటున్నారు ఒక గుమాస్తా బయట వరండాలో రికార్డు తిరగేస్తున్నాడు అంతా ప్రశాంతంగా, నిర్మలంగా వుంది. ఆయనకి ఆశ్చర్యం వేసింది. వెంకట్ ఆర్భాటం ఏమయిపోయింది? అతని అనుచరులూ, అనుయాయులూ, క్లయింట్లూ, టవుట్లూ ఎక్కడ? జస్టిస్ జగన్నాధానికి ఆఫీసు లోపలికి వెళ్ళ బుద్ధి కాలేదు. తిరిగి వెళ్ళిపోయాడు.

ఇంటిదగ్గిర సాంబశివయ్య ఆయన కోసం కాచిపెట్టుకుని ఉన్నాడు. అతన్ని చూడగానే ఆయన మొహం వికసించింది. గడిచిన రోజుల కబుర్లు చెప్పుకున్నారు. ఆమధ్య జరిగిన బ్రిడ్జి టూర్నమెంట్సులో

చేతులూ, ఆటలూ గురించి విమర్శించారు. ఊళ్ళో లాయర్లని గురించి మాట్లాడు కున్నారు. తరవాత వెంకటరమణ ప్రసక్తి వొచ్చింది.

"సంపాదన అంతలేదేమోకాని, మన వాడు ఒక దారిన పడుతున్నాడు" అన్నాడు సాంబశివయ్య.

"ఆర్జన లేకుండా ఏంచేసి ఏం లాభం" అన్నాడు జస్టిస్ జగన్నాధం.

"వెంటనే సంపాదించకపోతే పస్తుం డాలా?"

"అలాకాదు, అయినా ఈ తాపత్ర యం అంతా డబ్బుకోసమేగదా"

"అదే వొస్తుంది డబ్బు నెమ్మదిగా. పెళ్ళి పుణ్యమా అని పొగరూ, దురుసు తనం తగ్గాయి. క్రమంగా అన్నీ అలవడ తాయి" అన్నాడు సాంబశివయ్య.

జస్టిస్ జగన్నాధం మెదడులో చరచి నట్టయింది. సాంబశివయ్య వెళ్ళి వస్తా నన్న మాటలు సరిగా వినిపించుకోనే లేదు. అతను చెప్పిన విషయాలగురించి ఆలోచించడంలో మునిగిపోయాడు.

ఇలా జరుగుతుందనే భయం జస్టిస్ జగన్నాధానికి మొదటినుంచీ వుంది. అప్పుడు ఉద్రేకంలో బాగా ఆలోచించ కుండా పెళ్ళి చేసుకుంది నిర్మల ఆమె సంస్కారం వెంకటరమణ సంస్కా రానికి భిన్నమైంది. అతని పద్ధతులు ఆమెకు సరిపడవని తనకు తెలుసు. అందుకే వెంకటరమణమీద ఎంత అభి మానమున్నా నిర్మల పెళ్ళాడతా నన్న ప్పుడు ఆయన వెంటనే ఒప్పుకోలేదు. ఇప్పుడు తన సందేహాలన్నీ నిజరూపం దాలుస్తున్నాయి. వెంకటరమణలో వున్న దని నమ్మి, తను ఎంతోకాలంగా పరిశో ధిస్తున్న ప్రత్యేకతని, ప్రతిభని, ప్రజ్ఞని సాంబశివయ్య యధాలాపంగా 'పొగరు', 'దురుసుతనం' అన్నాడు. తను ఆత్మ విశ్వాసం అంటాడు. ఓటమి అంగీక రించలేని గుండె నిబ్బరం. కార్య సాఫల్యంకోసం పూనిన దీక్ష. వెంకట రమణ ఆడంబరం, ప్రచారం లక్ష్యసిద్ధికి పునాదులు. అతను ప్రతి కక్షులమీద చూపించే నిర్లక్ష్యం, కోపం, అసహ్యం కార్యసాధనకి మేడమెట్లు. నిర్మల వెంకట రమణని అర్థం చేసుకోలేదు. స్వార్థంతో అతన్ని తన పద్ధతుల్లోకి తీసుకురావడానికి ప్రయత్నించింది. ఈ ఘర్షణలో అతని ప్రత్యేకత అణగారిపోయింది. అనాలోచి తంగా అతని భవిష్యత్తు ధ్వంసంచేసింది నిర్మల. ఇప్పటికయినా మించిపోయిం దేమీలేదు. కూతురికి అంతా విపులంగా బోధించాలి

"నిర్మలా!" అని పిలిచాడు.

నిర్మల వచ్చింది.

"నిన్నొక్కమాట అడగాలనుకొంటు న్నాను."

నిర్మల మాట్లాడలేదు.

"వెంకట్ ప్రాక్టీసు ఎలా వుంది?"

నిర్మల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.



యువ

పక్కకి తిరిగి విదిలించుకుంది.

"ఇదంతా నువ్వు చేసుకున్నదే" అందామనుకున్నాడు.

"ఏమన్నా వొస్తుందా?" అన్నాడు.

"మునుపటిలాగా లేదు" అంది నిర్మల.

"ఏం?" అన్నాడు.

"ఏమో,"

"నరసయ్యా, రాఘవులూ కేసులు తీసుకురావడం లేదా?" జస్టిస్ జగన్నాథం సిగ్గుతో కుదించుకుపోయి అడిగాడు. ఆయనకి టవుట్సు, కోర్టు పక్షులు అంటే అసహ్యం. అయినా అల్లుడి పద్ధతులకి అడ్డు తగలడం యిష్టంలేక చూసీ చూడ నట్టు ఊరుకున్నాడు.

"ఇప్పుడు వాళ్ళని జేర్చడంలేదు" అంది నిర్మల.

"ఏం!"

"ఏమో!"

తరవాత ఏమడగాలో ఆయనకి తోచ లేదు. నిర్మలే అంది.

"ఏదైనా ఉద్యోగం చూసిపెడితే బాగుంటుంది."

"ఉద్యోగం ఎందుకు నిర్మల్!" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"ఎంతకాలం వున్నది తింటూ కూర్చోవడం?"

"అసలేమీ రావడంలేదా?"

"మునుపటిలాగా ప్రయత్నం చేస్తు న్నట్లు లేదు."

"నువ్వు అతని పనిలో జోక్యం చేసుకోకూడదు నిర్మల్!" అన్నాడు జస్టిస్ జగన్నాథం.

"నేనే చేశాను?"

"వెంకట్ పద్ధతులు మార్చడానికి ప్రయత్నించకూడదు."

"ఏ పద్ధతయితే నాకెందుకు ఇంత సంపాదించి పడెయ్యమంటాను. అంతే! ఇప్పుడు ఇద్దరమే కాదుగా, పాపతో కలిసి ముగ్గురం"

"ఔను" అన్నాడు జగన్నాథం.

"నాకంతా అయోమయంగా వుంది. వెంకట్ ఇలా మారిపోతాడనుకోలేదు" అంది నిర్మల.

అప్పుడే వెంకటరమణ ఆఫీసునుంచి వచ్చాడు

"నేను భోజనాల సంగతి చూస్తాను" అని నిర్మల వెళ్ళిపోయింది. వెంకట రమణ మామగారితో కబుర్లలోకి దిగాడు.

"ప్రాక్టీసు ఎలా వుంది!" జస్టిస్ జగన్నాథం అడిగాడు.

"బాగానే వుంది" అన్నాడు వెంకట రమణ.

"ఎంత వస్తూంది?"

"అట్టే రావడంలేదు"

"ఏం?"

"ఇప్పుడు మేజెస్ట్రేట్ కోర్టుకి వెళ్ళ డంలేదు ప్రొహిబిషన్ కేసులన్నీ వదిలే శాను" అన్నాడు వెంకటరమణ.

"నీపని చాలమటుకు యస్. యస్.

యమ్. కోర్టులో నేగదా! అక్కడికి వెళ్ళక పోతే ఎలా,'' జస్టిస్ జగన్నాధం అడిగాడు.

''ఇక్కడ కోర్టుల్లో వాతావరణం నాకు నరిపడడంలేదు హైదరాబాదు వొచ్చేదా మనుకుంటున్నాను'' మునుపు వెంకటరమణ ఇలా మాట్లాడితే జస్టిస్ జగన్నాధం ఆశ్చర్యపోయేవాడు ఇప్పుడు ఈ మాటలు అతని నోటికి అతికినట్టు సరిపోయాయి. వెంకటరమణ రూపులోనూ, రీతిలోనూ కూడా ఎంతో మారిపోయాడు. సౌమ్యత, నెమ్మది అలవడ్డాయి.

''ఇక్కడి వాతావరణానికే మొచ్చింది!'' అన్నాడు జస్టిస్ జగన్నాధం.

''మీరు జడ్జీగా బెంచీమీద కూచుంటారు కాబట్టి మాపాట్లు తెలియవు. నానా గడ్డీ కరచి, అన్ని రకాలవాళ్ళనీ పట్టుకుని పాకులాడాలి మేం. నే నిన్నాళ్ళు పని సంపాదించడానికి ఎన్ని అవతారాలు ఎత్తానో తెలిస్తే మీకు అసహ్యం వేస్తుంది'' అన్నాడు వెంకటరమణ,

తనకి తెలిసిన విషయాలు గుప్తంగా ఉంచడమే ఉత్తమం అని తోచింది జస్టిస్ జగన్నాధానికి.

మళ్ళీ వెంకటరమణ అన్నాడు.

''పాపం, నిర్మల్ మాత్రం ఎంతకాలం నాకోసం ఇక్కడ పడి మగ్గుతుంది. తనకోసమైనా హైదరాబాదు వచ్చెయ్యాలి''

నిర్మల వచ్చి భోజనాలకి లేవమంది. జస్టిస్ జగన్నాధం తరవాతతింటానన్నాడు.

ఆయనకి ఇప్పుడు పరిస్థితి అర్థమైంది. ఇందులో నిర్మల తప్పులేదు. ఆమె వెంకటరమణని మార్చడానికి ప్రయత్నం చెయ్యలేదు. అతని మార్పు స్వయం కృతం నిర్మలమీది ప్రేమవల్లా, ఆమె సంస్కారంమీద గౌరవంవల్లా తన నాగరికతా, సంస్కారంమీద చిన్న చూపు వల్లా పుట్టింది. ఈ మార్పులలో అతని ప్రత్యేక ప్రతిభ అడుగంటిపోయింది, తిరిగి తెచ్చుకోడానికి ప్రయత్నించమని చెప్పి ప్రయోజనంలేదు; చెప్పినా వింటాడనే ఆశలేదు; విన్నా అది వస్తుందనే నమ్మకమూలేదు,

జస్టిస్ జగన్నాధం కుర్చీలోనుంచి లేచి భోజనాలగదిలోకి వెళ్ళాడు. వెంకటరమణ భోజనం అయిపోయింది. నిర్మల ఏవో సర్దుతూంది.

''వెంకట్ ఎక్కడ?'' ఆయన అడిగాడు.

''కోరుకి వెళ్ళిపోయారు'' అంది నిర్మల.

''నిర్మల్!''

నిర్మల చేతిలో పళ్ళెం సైడ్‌బోర్డ్ మీద పెట్టి వెనక్కి తిరిగి చూసింది.

''మీరు మాతో హైదరాబాదు వొచ్చెయ్యండి. వెకంట్‌కి ఉద్యోగం కోసం ప్రయత్నం చేద్దాం'' అన్నాడు జస్టిస్ జగన్నాధం.

———

# నేను మీకు సహాయం చేయగలనా

మోపిదేవి దుర్గాప్రసాదరావు




"ఇదుగో, ముక్క తీస్తున్నా. ఏ దొచ్చినా 'షో' చేసేస్తాను ముందు, మీరంతా డబ్బు లెక్కెట్టండి." ఊగిపోతూ అరుస్తున్నాడు శోభనాద్రి

"ఏదీ, మూడు రౌండ్లేగా తిరిగింది! అప్పుడే అయిపోవచ్చిందా!" అంటూనేవున్నాను నేను. శోభనాద్రి మాట తప్పకుండా 'షో' చేశాడు.

నాది ఫుల్‌కౌంట్, పురుషోత్తానిది ఏభై పైసలు.

పురుషోత్తం పేక కలుపుతున్నాడు. నేను సిగరెట్టు వెలిగించాను. మా కిది అలవాటే. ఆదివారం వస్తే, ఆరోజంతా పేకాటలో గడపాల్సిందే. ఒంటిగంటయింది. త్యాగరాజింకా రాలేదు వాడొచ్చే వరకూ ఆగలేక ఆట మొదలెట్టాం.

అప్పుడే నాలుగాటలు అయ్యాయి.

"ఎత్తరా బాబూ, నీదే ఆట" అన్న పురుషోత్తం హెచ్చరికతో ముక్కలు తీసుకున్నాను.

రెండు జోకర్లు, ఒక ట్రిప్లేటు వచ్చాయి సీక్వెన్సులో ఒక జోకరు, ట్రిప్లేట్‌లో ఇంకో జోకరు పెట్టాను. డైమండ్ రాణి వస్తే షో' చేసి, వెధవ లిద్దరిదగ్గర కౌంట్ తీసుకోవచ్చు. లేక పోతే నేనే కౌంట్ యిచ్చుకోవాలి దైవాధీనం.

ఆట, మూడు నాలుగు రౌండ్లు తిరిగింది. డైమండ్ రాణి అందకుండా తిరుగుతోంది అయినా, రాజు నాదగ్గరుంటే, రాణిగారు ఎక్కడో వుండట మేమిటి? నాన్సెన్స్. త్వరగా రాదే ... ఇహ దేవుడిమీద భారం వేశాను. కానీ, అప్పటికే బరువు, బాధ్యతలు ఎక్కువగా వున్నాయి కాబోలు, అదనంగాపడ్డ ఈ భారం మోయలేకపోయాడు దేవుడు. ఈ సారి పురుషోత్తాని కిచ్చుకున్నాను కౌంట్.

ఇంకా త్యాగరాజు రాలేదు. వాడొస్తే బాగుండును, కాస్త అదృష్టం మారుతుందేమో? ఇందాకటినుండి ఇవ్వడమే గానీ, పుచ్చుకోవడంలేదు ఎలాయినా, త్యాగరాజు నిజంగా త్యాగరాజే. ప్రతాది వారం, మాకందరికీ తలా ఓ మూడు నాలుగు రూపాయలైనా ఇస్తాడు ఆటలో.

ఈసారి ఆట సగమయ్యేసరికల్లా వచ్చాడు త్యాగరాజు. సరాసరి, నా ప్రక్కకు వచ్చి ముక్కల్లోకి తొంగి చూడ్డం మొదలెట్టాడు.

"అదుగో, ఆ ముక్క అక్కడెం దకు. ఈ రౌండులో పారేయి. ఇనాళ్ళయి ఆడుతున్నా, నీకింకా ఆట చేత కాదేరా?" ఉచిత సలహా ఇచ్చాడు. వాడి సలహా ప్రకారం ముక్క పడేశాను. శోభనాద్రి "జై భజరంగ బలి" అని అరుస్తూ, ఆ ముక్క తీసుకొని 'షో' చేశాడు

నాకు చిర్రెత్తుకొచ్చింది. వెధవ బోడి సలహా, వీడూనూ. వీడి మూలంగానే ఈ ఆటకూడా పోయింది. ఓడిపోయింది త్యాగరాజు మూలంగా కాబట్టి, వాడిని తన్ని, వాడి జేబులోని డబ్బులు లాక్కుంటే? కానీ, సమయాసమయాలు, ఉచితానుచితాలు తెలిసినవాడ్ని కాబట్టి అదేమీ చేయలేదు. పైగా నవ్వుతూ, 'నీ కోసం చాలా సేపటినుండి ఎదురు చూస్తున్నాం. ఇంతాలస్యం అయిందే ఆగాగు, పేకపంచి, తర్వాత మొదలెట్టు" అన్నాను.

"లేదురా, నే నివాళ ఆడలేను" అంటూ, అంతవరకూ వున్న నవ్వు మొహం మార్చేసి, కొంచెం దిగులుగా పెట్టాడు.

మాకందరికీ ఆశ్చర్యం వేసింది. ఏ మొచ్చింది వీడికి? ప్రతి ఆదివారం, అందరికంటే ముందుగా వచ్చి కూర్చుంటాడు. ఎంత ఛండాలపు ముక్క

లొచ్చినా—కౌంట్ యివ్వాల్సివచ్చే ఆట యినా సరే—భయపడకుండా, పేక ముక్కలకు తలవంచని వీరుడిలా, డ్రాప్ చేయకుండా ఆడతాడు. అటువంటివాడు, ఈ రోజు ఆలస్యంగా రావడమేకాకుండా, ఆడనంటున్నాడు.

మేమందరం ఇంకా షాకులోంచి తేరు కోకముందే మొదలెట్టాడు

"రెడ్డి నామీదెందుకో కక్ష కట్టాడు. వలకరిస్తే చాలు దెబ్బలాడుతున్నాడు. వలకరించకుండా తప్పుకుపోయినా తం టాగా వుంది. వాడికి నామీదంత కక్ష ఎందుకో అర్థంకావడంలేదు." ఈసారి వాడి గొంతులో నిజంగా విచారం ధ్వనిం చింది.

"ఇంతకీ జరిగిందేమిటో చెప్పు." అన్నాడు పురుషోత్తం.

ఆ ప్రశ్నకోసమే ఎదురు చూస్తు న్నాడు త్యాగరాజు. వెంటనే మొద లెట్టాడు.

"అసలు వాడి ధోరణి పూర్తిగా మారిపోయింది. ఒకే ఇంట్లో ప్రక్క ప్రక్క వాటాల్లో ఉంటున్నవాళ్ళం. ఒకే కాలేజీలో పనిచేస్తున్నవాళ్ళం కదాని, నేను ఇంతకుముందు వాడి కెన్నిసార్లు సాయం చేయలేదు? వాడు అడక్క పోయినా, నా అంతట నేనే స్వయంగా వెళ్ళి సాయంచేశాను."

ఇదిమాత్రం ఖచ్చితంగా నిజం. మా కాలేజీలో ఎవరికి, ఏ సాయం కావలసి వచ్చినా, త్యాగరాజే శరణ్యం. ఒక్కో సారి, అవతలవాళ్ళు అడక్కుండానే, వీడంతట వీడే వెళ్ళి "నేను మీకు ఏమైనా సహాయం చేయగలనా?" అంటూ ఇంగ్లీ షులో వెధవప్రశ్న వేస్తాడు పోయిన సారి పంచదార మీద కంట్రోలున్న రోజుల్లో, రోజు నాలుగు కేజీల పంచ దార ప్యాకెట్టు తెచ్చి వంతులవారిగా పంచి పెట్టేవాడు. ఆ తర్వాత వాళ్ళ దగ్గర కంట్రోలుధర తీసుకొనే వాడను కోండి.

"అంత సాయంచేసినా, ఈ మధ్య నాలుగైదు నెలలనుండి, నామీదెందుకో గుఱ్ఱుగావుంది. అసలు వాడిని వలకరించ డమే భయంగావుంది." కాసేపు ఆగాడు త్యాగరాజు.

"ఏదీ, ఇందాక నాకు సాయంచేసి, నాచేత కౌంట్ ఇప్పించావే, అటువంటి సాయమేనా వాడికి చేసింది." నవ్వుతూ (పైకి) అన్నాను.

"ఏడ్చావులేవోయ్, నీ అదృష్టం బాగా లేకపోతే, నామీద పడేడుస్తావే?"

"ఇష్ త్యాగయ్యా! వాడితోతర్వాత దెబ్బలాడుదువుగానీ, ఈరోజు నీకు రెడ్డికి మధ్య జరిగిందేమిటో చెప్పు." శోభనాద్రి కలిగించుకున్నాడు.

"ఇక్కడకు వద్దామని బయలుదేరి వీధి గుమ్మం దగ్గరకు వచ్చేసరికి రెడ్డి కనిపించాడు. ఎవరోస్నేహితుడి పెళ్ళికి గ్రీటింగ్స్ పంపడానికి పెద్ద పోస్టాఫీసుకు

వెళ్తున్నాడు. ఊరుకోలేక 'నేను వెళ్ళే దారిలోనే కదా పోస్టాఫీసులో వేస్తాలే' అన్నాను అంతే మండిపడ్డాడు 'నాకేం కాళ్ళు లేవనుకున్నావా? లేకపోతే చెలి గ్రాంకూడా ఇవ్వలేని దద్దమ్మ నను కున్నావా? నీ దారిన నువ్వు పో'. అంటూ కసిరి, పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు ఇందులో నేను చేసిన తప్పేమిటిరా?''

మా మొహాలవంక చూశాడు త్యాగరాజు. ఎవ్వరు మాట్లాడలేదు. సర్దుకు కూర్చుని మళ్ళీ మొదలెట్టాడు.

''మొన్నటికి మొన్న, వాళ్ళావిడ చాప, చెంబు పుచ్చుకు కూర్చుంటే, ఇంట్లో వంట వండించి, మా పెద్దమ్మాయితో పంపించాను వాడు, అవన్నీ తిరగ్గొట్టడమే కాకుండా, 'మీ నాన్నను ఇటువంటి పనులు చెయ్యొద్దని చెప్పు. పెద్ద అన్నదాత బయల్దేరాడయ్యా!' అంటూ నాకు వినబడేటట్టుగా అరవడం సాగించాడు. పొరుగువాడు కదా అని సాయం చెయ్యబోతే, అలా విరుచుకు పడతాడే!''

''అడగని సాయంచేయమని నీకెవరు చెప్పారు? అడిగినవాడికి చేస్తే అర్థముంది అంతేగానీ, కనిపించిన ప్రతివాడి దగ్గరకెళ్ళి 'సాయం చేయనా?' అని అడిగితే యిలాగే ఏడుస్తుంది పిలవా పెట్టకుండా వెళ్ళి, అందరిపనుల్లో జోక్యం కలిగించుకుంటే తిట్లు తింటావు.'' అన్నాను.

''అయితే, తప్పంతా నాదేనంటావు. అంతేలే అను. అను. అడిగేవాడికెప్పుడూ. పడేవాడు లోకువే'' నిస్పృహాయంగా అందరివంక చూశాడు త్యాగరాజు

వాడిని చూస్తే జాలేసింది,

''అది కాదురా అవసరానికి సాయం చేయడంవేరు; అవసరం లేకపోయినా. అవతలివాడి కిష్టంలేక పోయినా బల వంతాన సాయంచేయడం వేరు ''రా,రా! రెండాటలు వెయ్యి హూషా రొస్తుంది.'' అన్నాడు శోభనాద్రి

త్యాగరాజు ఒప్పుకోలేదు. డబ్బులు పోవడం మూలంగా నాకూ ఆడబుద్ధి కావడంలేదు. సినిమాకు పోదామన్నాను. అంతా బయల్దేరారు. ఎక్కువ డబ్బు గెలుచుకొంది శోభనాద్రి కాబట్టి, వాడు టిక్కెట్లు కొనాలి పురుషోత్తం కాఫీలు, డ్రింకులు కొనాలి. నేనూ, త్యాగరాజు వాళ్ల ఖర్చుమీద సినిమాచూపి, ఫలహారం చేసే అతిధులం.

టిక్కెట్లు తీసుకొని లోపలికి వెళ్ళే సరికి సినిమా మొదలయింది.

మొదట్లో ప్రాణ స్నేహితులుగావున్న యిద్దరు, ఇంటర్వల్ వచ్చేసరి కల్లా శత్రువులై పోయారు. సినిమా ఆఖరయ్యే సరికల్లా ఒకడు ఇంకొడ్ని చంపేస్తాడు.

హాలులోంచి బయటికొచ్చాక, నలుగురం నాలుగు వేపులకు బయల్దేరాం. కాశీమజిలీ కధలోని రాకుమారుల్లా.

నడుస్తున్నానన్న మాటేగానీ, నా




ఆలోచనలన్నీ త్యాగరాజు చుట్టూ తిరుగు తున్నాయి. వాడు ఎంతమందికి సాయం చేస్తాడో, వాళ్ళల్లో సగంమంది పైగా వాడికి శత్రువులై పోయారు కొద్ది రోజుల్లోనే. అసలు తప్పంతా త్యాగరాజులోనే వుంది.

ఆలోచిస్తూ నడుస్తుంటే, వున్నట్టుండి హఠాత్తుగా నాలుగైదు సంవత్సరాల క్రింద జరిగిన సంగతి గుర్తుకొచ్చింది.

*　　　*

అనంతం, నేనూ, వెంకట్రావు కామర్సు డిపార్టుమెంటులో లెక్చరర్లుగా వుండేవాళ్ళం అప్పటికి త్యాగరాజు, రెడ్డి మా కాలేజీలో చేరలేదు. అలవాట్లలో అనంతానికి, త్యాగరాజుకు చాలా పోలి కుండేది.

సంవత్సరాంతపు పరీక్షలవగానే నేనూ, అనంతం యూనివర్సిటీకి వెళ్ళాం. పి. యు. సీ. పేపర్లు దిద్దడానికి తల్లికి ఒంట్లో బాగులేక పోవడంతో, వెంకట్రావు మూడు, నాలుగు రోజుల తర్వాత వస్తానన్నాడు.

మొదటి రోజు ఛీఫ్ వచ్చి, మనిషికి మూడొందల పేపర్లు వస్తాయని, పది రోజుల్లో పని పూర్తి చేయాలని చెప్పాడు. మూడొందల పేపర్లంటే మూడొందల రూపాయలు. అదృష్టం బాగుండి, ఎవరైనా వాళ్ళ కోటా పూర్తి చేయలేక పోతే, అవి కూడా తతిమ్మా వాళ్ళకు పంచి పెట్టబడతాయి గనుక దిద్దగలిగితే, మరో ఇరవయ్యో ముప్పైయ్యో రూపాయలు కళ్ళ చూడొచ్చు.

మా గదిలో దరిదాపుగా ఇరవై మంది వున్నారు. అందరి కళ్ళల్లోనూ ఒకటే విధమైన ఆత్రుత. తొందరగా ఆఖరు చేసి, వెనకపడిన వాళ్ళ పేపర్లు తీసుకోవాలి.

పంచుకోవాలనే తాపత్రయం అందర్లోనూ కనుపిస్తోంది. నుదిటి మీదనుండి కళ్ళల్లో పడే చెమటను, ఎడమ చేత్తో తుడుచుకుంటూ, ఎర్రరంగు పెన్సిలుతో ఏవేవో మార్కులు వేస్తున్నారు. చెమటోడ్చి సంపాదించడమంటే ఇదేకాబోలు పేపర్లు దిద్దడంలో బాగా అనుభవం వున్నవాళ్ళు పేజీలు వూరికే తిప్పేస్తున్నారు. సమాధానాలు సరిగ్గా చూడకుండానే, మార్కులు వేసేస్తున్నారనే అపప్రధ వస్తుందని భయపడేవాళ్ళు. గబుక్కున ఏదో ఒక పేపరులో వున్న వ్యాసంలోని ఒక వాక్యం పెద్దగా చదివి, గట్టిగా నవ్వేవాళ్ళు — రాసినవాడి తెలివి తక్కువ తనానికి. తతిమ్మా వాళ్ళకు నవ్వు రాకపోయినా, కొద్దిగా తలెత్తి. 'నవ్వాం' అన్నట్టుగా మొహంపెట్టి, మళ్ళీ పేపర్లు దిద్దడంలో మునిగిపోతున్నారు. అలా లెక్కప్రకారం ప్రొద్దున్నే రెండుసార్లు, మధ్యాహ్నం రెండుసార్లు నవ్వేవాళ్ళు. ఇహ చచ్చినట్టు, వాళ్ళ ప్రతి ఆన్సరు లోని ప్రతి వాక్యం చదివారని, తతిమ్మా వాళ్ళు అనుకోవాలి.

వేగంగా దిద్దడంలో అనంతం అందె వేసిన చెయ్యి. మొదటి రోజునే ముప్పై పేపర్లు దిద్దేశాడు. రెండో రోజున ఇంకొంచం ఎక్కువ చేశాడు నేను. రెండు రోజులకూ కలిపి నలభై పేపర్లు దిద్దాను.

నాలుగో రోజు ప్రొద్దున్నే వెంకట్రావు నవ్వుమొహంతో గదిలోకి అడుగు పెట్టగానే, పోటీలు పడుతున్నట్టుగా దిద్దుతున్నవాళ్ళంతా తలలు పైకెత్తి, కళ్లు చిట్లించి చూశారు. దరిదాపుగా, అందరూ వెంకట్రావుకు తెలిసినవాళ్లే. వెంకట్రావును చూడగానే చాలామంది మొహాలు మాడిపోయాయి. కొంతమంది మాత్రం త్వరగానే కోలుకొని జీవంలేని చిరునవ్వు నవ్వారు. కోలుకోలేని వాళ్లు — దెయ్యాల్ని చూపిన వాళ్ళల్లా — కుర్చీలలో బిగుసుకుపోయారు.

"స్వాగతం, వెంకట్రావుకు సుస్వాగతం." ఘర్జీవమైపోయిన వాతావరణంలో అనంతం ఒక్కడే ననుకుంటా.

వెంకట్రావంటే నాకిష్టమేగాని, అతగాడి రాకమీద కొద్దో గొప్పో అయిష్టం మనసులో ఓ మూలుంది. ఎందుకంటే, అనంతానికి కలిగినంత సంతోషం నాకు కలుగలేదు.

లౌక్యం తెలియని కొద్దిమంది మాత్రం కొంచెం పెద్దగానే గొణుక్కుంటూ, అయిష్టం వెళ్లడిస్తున్నారు ఇంతకీ అందరిదీ ఒకటే బాధ. అదనంగా మరో మనిషి వచ్చాడు కాబట్టి, తమ కోటాలోంచి ఓ పది, పదిహేను పేపర్లు తగ్గుతాయి. అంటే వచ్చే మూడొందల రూపాయల్లో అప్పుడే ఇరవై రూపాయలు బొక్క. ఈ ఆలోచనలతో అందరూ కోపంగా, నోటిదగ్గరికూడు మరో బలమైన కుక్క వచ్చి తీసేసుకుంటే, గుర్రుమంటూ చూసే బలంలేని కుక్కల్లా.

వెంకట్రావును చూస్తున్నారు.

తోటివాడికి సాయంచేసే అవకాశం అనుకోకుండా అనంతానికి దొరికింది. దాన్ని జారవిడుచుకో దలచలేదతగాడు. గబ గబ, వెంకట్రావు దగ్గరకు వచ్చి, "రాగురూ! ఇక్కడ కూర్చో. భయ పడకు నీ కొచ్చే కోటా అఖరు చేయ లేననే భయం పెట్టుకోకు నేనో పాతిక పేపర్లు దిద్ది పెడతాను. మననాగు మరో పాతిక " అంటూ వాడి భుజంమీద చేయి వేసి తీసుకెళ్ళాడు. వెంకట్రావు ఒ కట్ట పేపర్లు తెచ్చుకొని చూడటం మొద లెట్టాడు.

ఆడినమాట తప్పలేదు అనంతం. రెండు రోజుల తర్వాత, ఛీఫ్ లేని సమ యంలో ఓ నలభై పేపర్లు దిద్ది వెంక ట్రావు చేతికిచ్చాడు.

ఇదుగో, ఈ పేపర్ల మీద సంతకాలు పెట్టు మార్కుల లిస్టుకూడా తయారు చేశాను టీ వి మీ ద కూ డా సంతకం పారేయ్.

వెంకట్రావు యిబ్బందిగా మొహం పెట్టి "నాతరపున నువ్వు దిద్దడమేమిటి?" అన్నాడు. అనంతం వినిపించుకోలేదు.

నేనుకూడా,సాయం చేశానన్న పేరుకి ఓ నాలుగు పేపర్లు దిద్దిచ్చాను.

పవంతా అయిపోయిన తర్వాత, ముగ్గురం కలిసి ఒకే రైలులో యిళ్లకు బయల్దేరాం, దారిలో అనంతం గుక్క తిప్పుకోకుండా ఒహటి వాగుతున్నాడు.

"మన వెంకట్రావు రాగానే ఎంత మంది మొహాలు ఎలా మాడిపోయాయో చూశావా? కక్కుర్తి వెధవలు. 'అయ్యో. మన సాటివాడు. ఏదో కారణాలవల్ల ఆలస్యంగా వచ్చాడు. వాడికి మన మందరం కలిసి సాయం చేద్దామన్న ఆలోచనే లేదు అక్కడికి తెలిసిన వాళ్ళను కొందర్ని అడిగాను కూడా— తలా ఓ పదిపేపర్లు దిద్ది మనవాడి కివ్వ మని వెధవలు ఒక్కడు ముందుకు రాలేదు..'

అలా మాట్లాడుతూనే వున్నాడు అనంతం. వెంకట్రావు ఏఁవీ మాట్లాడ కుండా కిటికీలోంచి బయటకు చూస్తు న్నాడు. వాడిమొహం చూస్తే, అనంతం వాగుడు నచ్చినట్టుగా కనబడటం లేదు. అనంతం, తన వుత్సాహంలో ఏదో చెప్పుకు పోతున్నాడు గానీ, వెంకట్రావు మొహంలోని మార్పులు గమనించే స్థితిలో లేడు. ఇహ, నాకు కలుగ చేసు కోక తప్పలేదు.

"పోనీలేరా అనంతం. ఎవడో వచ్చి మనకి సాయం చేయాలని ఎక్కడుంది? అసలు, అలా సహాయం పొందడం వెంక ట్రావు కిష్టమో, కాదో మనకుతెలియదు."

ఇంకేదో చెప్పబోతూ వెంకట్రావు

చేప్పు చూశాను. నేనన్న దానికి అవునవు నన్నట్టుగా తలాడిస్తున్నాడు. వాడి బుర్ర లోని ఆలోచనలు కొద్దిగా అర్థమయ్యాయి నాకు.

తలా, ఓ పదిపేపర్లు దిద్ది చందా ఎలా ఇవ్వడం వెంకట్రావుకు బొత్తిగా ఇష్టం లేదు "తను ఆలస్యంగా రావడానికి వాళ్ళెవ్వరూ కారణంకాదు అటువం టప్పుడు వాళ్ళందరూ తనకోసం ఎందుకు తాపత్రయ పడాలి. ఓపికుంటే, అన్ని పేపర్లు తనే దిద్ది, కష్టానికి ప్రతిఫలం వేసుకుంటాడు. లేకపోతే లేదు అయినా, అలా చందాలు తీసుకోవడానికి తనేమన్నా బిచ్చగాడా?"

వీటన్నింటి కంటే ఛండాలంగా, వెంకట్రావుకు అనిపించింది మరొక టుంది—'ఈ ముష్టివాడికి తలా ఓ పది పైసలు సాయం చెయ్యండన్నట్టుగా, తలా ఓ పదిపేపర్లు దిద్దిమా వాడికి సాయం చేయండి' అన్న అనంతంగాడి ప్రచారం.

కానీ, వెంకట్రావు అభిప్రాయాలను అర్థం చేసుకోవడానికి, అనంతం ఏ మాత్రం ప్రయత్నించలేదు వాడు ఎంత సేపు తనదృక్కోణంలో నుంచేచూస్తాడు. స్నేహితుడికి సాయం చేయాలన్న తాప త్రయంలో అవతలివాడి యిష్టా యిష్టాలు పట్టించుకోడు. 'అసలు అవతలివాడు తాను చేసే సాయానికి ఒప్పుకుంటాడా?' అన్న ఆలోచనే వాడికి రాదు. పైగా "ఎందు కొప్పుకోడూ, దొబ్బుడాయా!" అంటాడు.

అలా, అడగా పెట్టకుండా సాయం చేసే వాళ్ళకు కొద్దో, గొప్పో అతిశయం వుంటుందను కుంటాను. ఇంకోడి అభి ప్రాయాల్నే వారు గౌరవించరు. అర్థం చేసుకోరు. "మేము అందరికీ సాయం చేస్తాం," అంటూ జోర విరుచుకు తిరుగు తారు. పైగా, ఓ నెలవరకూ, దాన్ని గురించే మాట్లాడు తుంటారు.

వీళ్ళందరికీ 'పెద్ద అన్నగారి మన స్తత్వం తమ్ముడు ఎక్కడ చెడిపోతాడో నని వేయికళ్ళతో చూసే అన్నగారిలా, 'ఎవడికైనా సాయం చేపేద్దాం' అని చూస్తుంటారు అంతేగాని, అవతలివాడిని ఇరకాటంలో పెట్టుకున్నామే మోననే ఆలోచనరాదు. తమ సాయంలేకపోతే, ప్రక్కవాడు బ్రతకలేడనే నమ్మకం వాళ్ళ బుర్రలో తిష్టవేసుకు కూర్చుంటుంది.

కొద్దిరోజుల్లో, వెంకట్రావుకు అనం తంతో మాట్లాడటం అంతగా ఇష్టం లేనట్టు నాకనిపించసాగింది

ఒక రోజు వెంకట్రావు దగ్గర కొచ్చాడు అనంతం.

"చూడు బ్రదర్ ఈ వ్యాసాలన్నీ సైక్లోస్టైల్ చేయించాలి టైపింగ్ అయి పోయింది. ఎక్కడైనా తప్పులున్నా



యువ




యేమో కొంచెం చూడు" అంటూ ఓ కాగితాల బొత్తి వెంకట్రావు ముందు పెట్టాడు. తలమునిగే పనిలోవున్నా. మొహమాటానికి వెంకట్రావు కాదనలేక చూడసాగాడు. సగం కాగితాలయ్యేసరికి అతగాడికో ఆలోచన వచ్చింది. (ఆ తర్వాత వెంకట్రావే ఈ విషయాలన్నీ నాతో చెప్పాడులెండి)

"ఎప్పుడూ అనంతం తన దగ్గరకు వచ్చి యిటువంటి పనులు చేసి పెట్టమని అడగలేదు ఈ రోజు పనిగట్టుకొని నా దగ్గరకే ఎందు కొచ్చినట్టు? అతనితో, సన్నిహితంగా తిరిగేవాళ్లు చాలామంది వున్నారుగా! కొంపదీసి మొన్న పేపర్లు దిద్దిచ్చినందుకు మారుగా " ఆలోచనలను బలవంతంగా ఆపుకో జూసాడు చేతకాలేదు. 'వటుడింతంతై ' అన్నట్టుగా అదే ఆలోచన వూడలమఱ్ఱిలా అతగాడి బుర్రలో పాతుకుపోయింది.

ఇహ అక్కడ్నించి, అనంతం మాట్లాడే ప్రతి మాటలోనూ వ్యంగ్యం కనిపించడం మొదలయింది వెంకట్రావుకు. అనవసరంగా సాయంచేసి, తనను యిరకాటంలో పడేసిన దగుల్బాజీలా అనంతం కనుపించసాగాడు.

ఒకరోజు కొత్త టెరిలిన్ పాంటు, టెరిలిన్ చొక్కా వేసుకొచ్చాడు వెంకట్రావు "ఎక్కడ కొన్నావు? ఎందుకు కొన్నావు?" అన్న అనంతం ప్రశ్నకు "మొన్న పి యు సీ, పేపర్లు దిద్దగా వచ్చిన డబ్బుతో కొన్నాను," అన్నాడు. ఆ మాట అన్న తర్వాత, అనంతం, తన బట్టలకేసి అతి పరీక్షగా చూస్తున్నట్లనిపించింది వెంకట్రావుకు తను పెట్టిన తిండి తిని బాగా బలిసిన మేకను సంతృప్తిగా నవ్వుతూ చూసే కసాయివాడు

కనుపించాడు అనంతంలో, వెంకట్రావు ప్రాణానికి.

ఆ రోజంతా అనంతంతో తలొంచుక మాట్లాడాడు వెంకట్రావు. తలెత్తితే తన బట్టలవంక తీక్షణంగా చూసే అనంతం కళ్లు కనుపిస్తాయనే భయంతో.

స్టాపు రూములో కూర్చుని వీళ్లిద్దరి మధ్య జరిగేతంతు అతి జాగ్రత్తగా చూస్తున్నాను. నాకెందుకో వీళ్లిద్దరి మధ్య జరిగే తంతు అతి జాగ్రత్తగా చూడాలని పించింది నాకెందుకో వీళ్లిద్దరూ బద్ధ శత్రువులై పోతారనిపించింది

అనుకున్నట్టుగానే అయింది అనంతాన్ని చూస్తే చాలు వెంకట్రావుకు చిర్రెత్తుకొచ్చేది అనవసరంగా కోపం తెచ్చుకొనేవాడు అనంతం ఏంమాట్లాడినా ఎగతాళిగా మాట్లాడేవాడు అవసరం లేక పోయినా, వాదనలోకి దిగి వాడిని నానా మాటలు అనేవాడు

ఇంకొన్నాళ్ళకు మరో అడుగు ముందుకు వెళ్లాడు వెంకట్రావు అనంతం గురించి పదిమందికీ చెడుగా చెప్పడం మొదలెట్టాడు ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పి సంతోషపడేవాడు ఆఖరకు ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి అనంతం మీద చాడీలు కూడా చెప్పేవాడు.

ఇహ, అనంతం పని ఎలా తయారయిందంటే, వెంకట్రావు అంత దూరంలో కనుపిస్తే, మరో సందులోంచి పారిపోయేవాడు లేకపోతే, వాడు ఏదో గిల్టీ కజ్జా పెట్టుకుంటాడు,

ఈ యాతనలన్నీ పడలేక, అనంతం రిజైన్ చేసి వెళ్ళిపోయాడు ఆ తర్వాత వెంకట్రావు కూడా ఇంకో చోట ఎక్కడో వుద్యోగం చూసుకొని వెళ్ళిపోయాడు. వాళ్లు వెళ్ళిపోవడంతో ఖాళీ అయిన స్థానాల్లో త్యాగరాజు, రెడ్డి వచ్చారు

* *

రాత్రి పడుకోబోయే ముందు, నాలుగేళ్ళ క్రితం జరిగిన విధంగానే యిప్పుడు కూడా త్యాగరాజు, రెడ్డి మధ్య జరుగుతుందేమోననే భయం కలిగింది నాలో. ఆ రాత్రంతా కలల్లో "మే ఐ హెల్ప్ యు?" "మై ఆప్‌కో కోయీ మదద్ కర్ సక్‌తా హూ?", "నేను మీకు సహాయం చేయగలనా?" అని మూడు భాషల్లో రాసిన బోర్డే కనుపించింది



# ఇంతలో వృద్ధి

కొడవటిగంటి కుటుంబరావు

నా జీవితంలో అనేక దుర్దినాలు కాని అవేవీ ఇప్పుడు నాకు జ్ఞాపకంరావు జ్ఞాపకం వచ్చినా నన్ను బాధించవు నేను దూరదేశంలో వుండి జేబులో కానీలేక వస్తుండిన రోజు జ్ఞాపకం వచ్చినా నాకిప్పుడు నవ్వే వస్తుందికాని మరొకటి జరగదు కాని నేను ఉద్యోగం సంపాదించిన రోజు—ఉద్యోగం సంపాదించిన రోజుకూడా కాదు, నా మొదటి నెలజీతం వచ్చినరోజు—జ్ఞాపకం వస్తే పశ్చాత్తాపమూ, విచారమూ, భయమూ కలుగుతుంది

ఆ నాడు నేను జీవితంలోకల్లా ప్రియతమమయిన నా భార్య స్నేహాన్ని పోగొట్టుకోవటం మొదలు పెట్టాను నా కళ్ళ ఎదట, నేను నిస్సహాయుణ్ణి అయి చూస్తుండగా, నాకు పంచప్రాణాలుగా ఉంటూ వచ్చిన నా సీత నాకు పరమ శత్రువుగా మారిపోయింది ఇప్పటికికూడా నే నాశ్చర్యపడేది దేనికంటే నా వల్ల జరిగిన పొరపాటేమిటో. సీత అట్లా మారకుండా వుంటానికి నేను ఏంచేసి వుండవలసిందో నాకు తెలియలేదు—అప్పటికీ ఇప్పటికీ! ఈ క్షణాన కాలచక్రం ఎనిమిది సంవత్సరాలు వెనక్కు వెళ్ళి తిరిగి ఆ రోజు వచ్చినట్లయితే నేను ఎట్లా ప్రవర్తించాలో తెలుసుకోలేని స్థితిలో ఉన్నాను. నేనైనా మందమతిని కాను. కాని నాకంటె మేధావులు ఇంకా చాలమంది వుండి వుంటారు నాకు విప్పరాని చిక్కుగా వున్నది వారి చేతుల్లో ఇట్టే విడిపోవచ్చుననే విశ్వాసంతో నా అనుభవం ఈ రూపంగా లోకానికి తెలియజేస్తున్నాను

నాకా ఉద్యోగం దొరికేవరకూ మేమిద్దరమూ— నేనూ నా సీతా—ఎంత అన్యోన్యంగా వుండేవాళ్ళం! నాకు సీత ఒక పెద్ద ఆనందకరమైన అనుభవం సీత కాపరానికి వచ్చేప్పటికి నాకు స్త్రీవాంఛ స్పష్టంగా అనుభవంలోకి రాలేదు. కామమనేది ఎట్లా వుంటుందో తెలుసుకోదగిన వయస్సుకాని, అనుభవంకాని, జ్ఞానంకాని నాకప్పటికింకా లేవు సీతే మొదటిసారి నాలో కామం అనేదాన్ని రగిల్చింది. దాన్ని మళ్ళా తనే శమింపచేస్తూ వచ్చింది. నేను సీతవల్ల యెంత సుఖపడేవాణ్నో సీతకూడా నావల్ల అంత సుఖపడేదనికూడా నేను నా మనస్సును

వర్దిష్ణువృక. సీతవల్ల నేను పొందుతూ వచ్చిన సుఖాని కంతకూ ఆమెకు ఎంతో కృతజ్ఞుణ్ణి అయి వుండేవాణ్ని.

మా అన్యోన్యత అంతటితో ఆగ లేదు. సుగంధం ఒకచోట ఉంచితే క్రమంగా ఇల్లంతా ఆవరించినట్టు మా అన్యోన్యత మా దైనిక జీవితాన్నంతా ఆవరించింది. కామం నాకు అనుభవంలో ఉండినట్లే, నా కింకా అనేక విషయాలు అనుభవం లేదన్న సంగతి సీత క్రమంగా బయటపెట్టింది నాకు మాతృప్రేమ కూడా తెలియదు. నాకుమంచి స్నేహితులెవరూ లేరు నాకు పరిచారకు లెవరూ లేరు. తల్లీ, స్నేహితులూ, పరిచారకులూ ఉంటే ఎట్లా వుంటుందో నాకు సీత చూపింది. ఇంకొకరిచేత "అయ్యో పాపం!" అనిపించుకోవట మనేది లేక, ప్రతిదానికీ నాకు నేనే సంపూర్ణంగా బాధ్యుణ్ని అవుతూ, నాకు నేనే సహాయుణ్ణిగా వుంటూ వచ్చిన నాకు, కొత్తలో సీత ప్రతిదానికీ అడ్డం వస్తున్నట్టుండేది కాని క్రమంగా ఆభావం పోయింది. అనేక విషయాల్లో నేను సీత సానుభూతీ, సలహా కోరటమేకాక, మరికొన్ని పనులు సంపూర్ణంగా సీత బాధ్యతమీద సీతకే వదిలివెయ్యటం నాకు లాభకరమూ సుఖకరమూ అనికూడా నేర్చుకున్నాను

మధ్య మధ్య నన్నొకటి ఆలోచనే బాధిస్తూ ఉండేది సీత నాకు ప్రతి క్షణమూ ఏదోరూపంగా—అనేక వందల స్వల్ప విషయాలలో—ఇంత ఆనందం కలగజేస్తున్నది, నే నామెకు తిరిగి ఏమి ఇస్తున్నాను? సీత ఇన్నివిధాల నా సుఖం గుర్తించగలదు, సీతకంటె నేను నాలు గేళ్లు పెద్ద అయివుండి కూడా—నాకు పందొమ్మిదో ఏడు సీతకు పదిహేనో ఏడు ప్రవేశించింది—నేను సీత సుఖం ఏమిటో ఏమీ తెలియనిస్థితిలో వుండటానికి కారణమేమిటి? ఎప్పుడన్నా సీతకు పూలు తెచ్చి పెట్టటమూ, కాఫీ హోటలు నించి తినుబండారాలు తీసుకురావటమూ తప్ప నే నామెకు చెయ్యగలది ఏమీ కనిపించక పోయింది—సీతను వెర్రిగా, అదివరకు ఎన్నడూ యెవరినీ ప్రేమించనట్టు, ప్రేమించటం తప్ప!

ఇట్లా కాలం వెళ్ళుతూండగా అకస్మాత్తుగా మా నాన్న చనిపోవటంతో నా దారిద్ర్యం బయటపడ్డది, అప్పటికి నేను బి ఏ పూర్తిచేశాను కాని, ఇంకా వుద్యోగంలో ప్రవేశించలేదు మా ఇల్లు తప్ప మిగతా ఆస్తియావత్తూ అప్పులవాళ్ళ పాలయింది. మా నాన్న తన జీవితాన్ని రెండువేలకు భీమా చెయ్యక పోతే ఆ యిల్లుకూడా పోవలసిందే ఈ స్థితిలో నేను అకస్మాత్తుగా నా తిండికీ గుడ్డకూ నా భార్యమీద ఆధారపడవలసి వచ్చింది

నా భార్యకు కూడా తల్లి చిన్నతనం లోనే గతించటంవల్ల నా పెళ్లి అయిన కొద్దికాలానికే సీత ముత్తవతల్లి చని



యువ

పోగానే ఆవిడగారి తాలూకు ఆస్తి పధ్నాలుగెకరాల యీనాం మాగాణీభూమి సీతకు సంక్రమించింది మే మిద్దరమూ అన్యోన్యంగా కాపరంచేస్తూ ఉండటం చూసి సహించలేనివాళ్ళు, "మగవాడు ఆడదాని అడుగులకు మడుగులొత్తితే కాపరం గుంభనగా ఉండకేం జేస్తుంది? పధ్నాలుగెకరాలు వెంటతెచ్చిన పెళ్ళాన్ని బాగా చూడక ఏంచేస్తాడు?" అని అనేవాళ్ళు. ఇది నా చెవిన పడ్డప్పుడు నాకెంతో కష్టంవేసింది ఈ సంగతి సీతతో అంటే ఆ పదిహేనేళ్ల వెళ్ళని పిల్ల నన్ను ఎంత బాగా ఓదార్చిందో నాకే తెలుసు—"ఎంత ఓర్వలేనివాళ్ళంటారండి! నా డబ్బు వచ్చి మీ ఒళ్లో పడినట్టు! మీరు, పాపం, నా సొత్తు ఒకదమ్మిడీ అయినా తిన్నట్టు! వల్లపూసలకుకూడా మీరే నాకు ఖర్చు పెట్టినట్టు" ఈ మాటలు — లోకజ్ఞానం లేని అమాయకురాలు అన్న ఈ నిష్కపట వాక్యాలు—నా చెవిలో ఈ నాటికికూడా మోగుతూ ఉంటై!

ఇంకేం? సీత ఈ మాటలని సంవత్సరమయినా వెళ్ళకపూర్వమే నన్ను నా సీత పోషించటం మొదలు పెట్టింది. మా మామగారికీ ఏర్పాటు ఎంతమాత్రమూ రుచించలేదు. సీత ఆయన్ను నానా మాటలూ అన్నది, సీతకు తల్లి పోయినప్పటి నించీ తండ్రి దగ్గిర చాలా చనువూ, స్వతంత్రమూనూ తన కెంత యిష్టంలేకపోయినా ఆయన కుమార్తె ఇష్ట ప్రకారం చెయ్యవలిసినవాడయినాడు.

మా యిద్దరికీ ఇది ఒక నూతన బంధం అయింది ఇప్పటి సాంఘిక పరిస్థితుల్లో మగవాణ్ణీ ఆడదాన్నీ త్రాసులో తూస్తే మగవాడివైపు మొగ్గు చాలా జాస్తిగా ఉంటుంది. విద్యా, జ్ఞానమూ, బలమూ, అవకాశమూ మొదలైనవన్నీ మగవాడివైపే ఉన్నై. సాంఘికాచారాలు ఈ తేడాను తగ్గించటానికి బదులు మరింత చేసినై. కాని ప్రత్యేకించి మా దాంపత్యం విషయంలో మొదటినించీ ఈ తేడా దాదాపు ఏమీ లేకుండా వచ్చింది దానికి మా యిద్దరి అన్యోన్యతా, లోకజ్ఞానం లోపించటమూ కూడా సహాయపడినై. అప్పటికీ ఇంకా నావైపు మొగ్గు జాస్తి అయివుంటే నా దారిద్ర్యం వచ్చి దాన్ని సరిచేసింది.

సరిచేసిందని ఇప్పుడంటున్నాను. సీతవైపే మొగ్గు జాస్తిఅయిందని నేను నా అంతరాత్మలో భావించివుండాలి.

నేను అమిత గర్విష్ఠీ దురభిమానిసీ అని చెప్పలేదింకా. అనేక సంవత్సరాలు ఎవరి ప్రాపకమూ లేకుండా జీవించినవాణ్ణి కావడంవల్ల ఆ దుర్గుణాలు నాకబ్బి ఉండవచ్చును లేక మా అమ్మ పోలిక నాకు వచ్చి ఉండవచ్చును అవిడ అమిత అభిమాని అని చెప్పుకునేవారు—చనిపోయిన మనిషిని దురభిమాని అనటం ఇష్టంలేకనేమో!

నాభార్య ఆస్తిమీద జీవించటం నా

అభిమానానికి గొడ్డలిపెట్టే కాని అక్కడ నాకు సీతమీద కల ప్రేమ నా గర్వాన్ని అణిచి వేసింది అదే సీతకాక మరొకర్తై ఉండినా, సీతకూ నాకూ అంతస్నేహం లేకపోయినా నేనా ఏర్పాటుకు ప్రాణం పోయినా అంగీకరించి ఉండను సీత తూకం నా తూకంకంటె జాస్తి అయిందన్న ఆలోచన నా అంతరాత్మలో ఉండనే ఉంది కనక, ప్రేమ నా గర్వాన్ని జయించగానే—అంటే ఈ ఏర్పాటుకు నేను తల ఒగ్గిన మరుక్షణంనించీ—నేను సీతకు భృత్యుడల్లే ప్రవర్తించసాగాను. అన్ని ఆలోచనల్లోనూ సీతది పైచెయ్యి కానిచ్చాను. సీతను నాకంటె ఉత్కృష్టతరమైన వ్యక్తిని చూసినట్టే చూసేవాణ్ణి నా జడ్జిమెంటు — నా స్వతంత్రబుద్ధి — వినియోగించటం పూర్తిగా మానేశాను. ఇంటి యాజమాన్యం సీత చేతిలోకి పూర్తిగా వెళ్ళనిచ్చాను ఆడపనులు చెయ్యటంలో ఎంత విధి అయినా సీత మగపెత్తనం నెత్తిన వేసుకుని చిన్న చిన్న పొరపాట్లు చెయ్యటం ప్రారంభించింది—అనుభవం లేని నేనే పట్టగలిగినవి. కాని నేను సీత తప్పులు ఒద్దే వాణ్ణి కాను. నాకళ్ళకవి తప్పులుగాకూడా కనపడేవి కావు.

ఇదంతా ఒకవిధంగా చూస్తే నేను నా వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోవటమే కాని దానికి నాకేమీ అభ్యంతరం లేకపోయింది. నాకు సీతమీద కల ప్రేమ నా స్వాభిమానం నెత్తిన కూర్చోకపోతే నేను నా వ్యక్తిత్వాన్ని అంత సులభంగా విసర్జించే వాణ్ణి కానేమో కాని. అభిమానం ఎప్పుడయితే తల ఎత్తలేకపోయిందో అప్పుడు సీతమీది నా ప్రేమా అభిమానమూ ఏకఛత్రాధిపత్యం వహించినై.

నా సహజగర్వం తాత్కాలికంగా ఓడిపోయినా ఓటమికి అంగీకరించలేదని తోస్తుంది. నా ప్రేమచాటున పడిపోయి కూడా అది అదృశ్యంగా పనిచేస్తూ ఉండి వుండాలి "దబ్బున ఉద్యోగం సంపాదించు ఇట్లా భార్యమీద పడి ఎంత కాలం జీవిస్తావు?" అనేది నా గర్వం. అదను కనిపెట్టి, దాని ప్రేరేపణకు నా మనస్సు కలతపడటం ప్రారంభించగానే, నా ప్రేమ నన్ను నానా చివాట్లూ పెట్టేది.

"నీ మగ దుర్బుద్ధి పోనివ్వలేదు. సీతను నీ కంటె ఎక్కువగా చూడవలసి రావటం నీకు కష్టంగా వుంది. ఆమెకు ఋణపడితే ఆమెకు నువు పయిచెయ్యిగా వుండలేవనేగా నీ దిగులు! తన సొత్తు నువు తింటున్నావన్న దిగులు సీతకులేదని నువ్వెరగవా? సీత ఈ విషయం తండ్రితో పోట్లాడటం నువు కళ్ళారా చూడలేదా?" అనేది నా ప్రేమ అప్పుడు మళ్లా మనస్సు కుదుట పడేది.

కాని నా గర్వం మళ్లా సమయం చూచి. "ఓరి మూర్ఖుడా! నిన్ను ఒక సంవత్సరం మేపటానికి సీత ఉబలాట పడవచ్చు. పది సంవత్సరాలు కూడా

మేపవచ్చు శాశ్వతంగా నిన్ను భరించటం వల్ల మీ ఇద్దరి ప్రేమకూ యెంత అపాయం వుందో ఆలోచించు" అనేది వెంటనే కోటు తొడుక్కుని ఎవరినన్నా చూపిరావటానికి బయలుదేరే వాణ్ణి!

నా ఉద్యోగ ప్రయత్నం ప్రత్యేకంగా ఒక కథగా రాయవలసిన విషయం. మొదట మొదట ఉద్యోగం దొరకటం నాకొక కష్టమైనదాన్లో జత కాదనే అహంకారంతో ఉండేవాణ్ణి. చిన్నచిన్న ఉద్యోగాల్లో శాశ్వతంగా ఇరకటం నాకే ఇష్టం లేదు. కాని వాటికి నేను పాల్పడితే ఏ వంక పెట్టి నా కివ్వమంటారు? మంచి ఉద్యోగం వచ్చినప్పుడే చేతాంలే. ఇతరుల మాదిరిగా మనం తక్కువ జీతాలకు చిన్న ఉద్యోగాలలో ప్రవేశించవలసిన అగత్యమేమి టనుకునే కాలం వెళ్ళిపోయింది. చిన్న ఉద్యోగమో చచ్చు ఉద్యోగమో వెంటనే సంపాదించి తీరాలి. కాని చింత చచ్చినా పులుపు చావక, ఉద్యోగం రాకేం చేస్తుంది లెమ్మని చాలా నిర్లక్ష్యంగా ఉంటూ, నాకా ఉద్యోగా లివ్వదగిన వాళ్ళతో ఆకాశంనించి దిగివచ్చిన వాడల్లే మాట్లాడేవాణ్ణి.

ఆరు నెలలు ప్రయత్నంచేసినా నాకొక 30 రూపాయల ఉద్యోగం దొరకలేదు. ఉద్యోగం కోసం నేను తమను ఆశ్రయించానన్న కారణం ఆధారం చేసుకుని ఉద్యోగం ఇచ్చేవాళ్ళు నాతో అమిత అమర్యాదగా, వీధి బడిపంతులు తన విద్యార్థులతో మాట్లాడే ధోరణిలో సంభాషించ సాగారు కొంతకాలం వరకూ. "ఛీ! ఇటువంటి వెధవలకింత ఉద్యోగం చేసేదేమిటి? అయినా ఇదేమంత గొప్ప ఉద్యోగమని!" అని నన్ను నేను సముదాయించుకునే వాణ్ని. కాని క్రమేణా నా గర్వం గాయపడ సాగింది. ఉద్యోగాలిచ్చే వాళ్ళంతా నా మీద కచ్చ పట్టారా? లేక నేను యెంత చచ్చు ఉద్యోగానికి కూడా అర్హుణ్ణి కానా? అందరూ నా మీద పగపట్టారని నన్ను నేనే నమ్మించుకోలేక పోయినాను. ఇక మిగిలిన అనుమానం నా గర్వాన్నీ దానిద్వారా నా మనస్సునూ దహించసాగింది. ఆ పరిస్థితులలో సీత నన్ను ఎన్నో విధాల అనునయించకపోతే ఏమయి ఉండేవాణ్నో? తప్పక బాగుపడి వుండేవాణ్ణేమో!

కాని సీత గాయపడిన నా మనస్సుకు చక్కగా శైత్యోపచారం చేపింది. వాళ్ళంతా వెధవలన్నది వాళ్ళు నా తెలివితేటలు కనుక్కోలే రన్నది. "పోనివ్వండి, వెధవ వుద్యోగం ఈ కాని వుద్యోగాల కోసం ఎందుకు హైరాన పడతారు. మనకు సుఖంగా జరిగిపోవటం లేదా?' అన్నది సీత.

"కాదు సీతా! నేను పాపం నీకేమీ పెట్టకపోగా, నీసొమ్ము తింటూ కూర్చోటమేమిటి? రేపు పిల్లలు పుట్టుకొస్తారు. అప్పుడింత హాయిగా వెళ్లుతుందా?" అన్నాను.

సీత చిన్న బుచ్చుకుని, "మీరట్లా అంటే నాకు కష్టంగా వుంటుందండీ! నా దబ్బేమిటి? నా కటువంటి భేదాలు లేవు! అంతగా అయితే పిల్లలు పుట్టిన తరవాత ఉద్యోగం కోసం తిరుగుదురు గాని లెండి!" అన్నది

"కాదు సీతా! నాకెందుకు ఉద్యోగం దొరకదో చూడాలి ఆత్మ గౌరవం కోస మైనా నేను ఉద్యోగం సంపాదించి తీరాలి." అన్నాను

సంపాదించి తీరాను కూడానూ! కాని నా తెలివివల్ల కాదు చిన్నప్పుడు మా ఇంట్లో వారాలు చేసుకుని తింటూ నలుగురు పెద్ద మనుష్యుల సహాయంవల్లా, యింతకుముందే మంచి వుద్యోగం సంపాదించిన ఒకడి దయవల్ల, మా వూళ్ళో కొత్తగా స్థాపించిన బాంకుకు అతను సెక్రటరీగా వుంటున్నాడు. అతనంటే అందరికీ అభిమానం—ప్రెసిడెంటుగారికి మరీనూ. అతని శిఫార్సువల్ల నాకు కూడా అందులోనే అరవై అయిదు రూపాయల వుద్యోగం లభించింది

ఆనాడు నాలో కలిగిన మార్పు వర్ణనాతీతం. కొంత కాలంనించీ వాయు ప్రసారం ఎరగనివాణ్ని బయటికి తెచ్చినప్పుడు వాడి ఊపిరితిత్తులకు కలిగే సంతోషం నాకు కలిగింది అయితే నా విషయంలో ప్రత్యేకత ఏమిటంటే అది వరకల్లా నాకు సరిగా ఊపిరి సలపటం లేదని నేను ఈక్షణానే గుర్తించాను విరిగిన వెన్నెముక సరి అయినట్టు కూడా అయింది నాకు అదివరకల్లా నా వ్యక్తిత్వాన్ని భోషాణంలో పెట్టి తాళంవేసి వుంచుతూ వచ్చానని కూడా నా కిప్పుడే తెలిసివచ్చింది. ఇకనించీ నేను సీతతో సమానంగా తూగ గలనని ధైర్యం వచ్చేసింది. ఇక మా యిద్దరి అన్యోన్యతకూ నా దారిద్ర్యం అడ్డంవస్తుందని భయంలేదు నేను ఉద్యోగం సంపాదించలేని వాణ్ణి అవుతానేమో అన్న దిగులుకూడా పోయింది నా జీవితంలో అదొక పర్వదినంగా కనిపించింది

ఆ నాటి ఉత్సాహంలో నేను ఉద్యోగం సంపాదించినందుకు సీత పొంగి పొర్లలేదన్న విషయంకూడా నేను గమనించలేదు. నా ఉద్యోగం సీతలో కలిగించిన మార్పు నేను సరిగా గమనించలేదు. ఆ మార్పు అర్థం చేసుకోవటం అసలే లేదు. పగలల్లా ఆఫీసులో గడిపివచ్చి సీత ఉత్సాహంగా లేకపోవటానికి నా ఉద్యోగమే కారణమని నే నెట్లా ఊహించ గలను? నేను ఇంటోలేని సమయంలో ఏం జరిగినా జరిగి ఉండవచ్చును — అల్పవిషయాలు! కొంప కూలి సీతమీద పడ్డదన్నంత అనుమానం నాకు కలగటానికి తగినంత మార్పుమాత్రం సీతలో కలగలేదు

అఖరుకు నాకు జీతంవచ్చిన నాడు పాపంపండి బద్దలయింది! నేను ఆఫీసులో జీతం తీసుకుని, నేరుగా బజారుకు వెళ్ళి




రెండు కోట్లకూ నాలుగు చొక్కాలకూ గుడ్డ తీసుకుని టెయిలరు కిచ్చి నాకు కొన్ని ధోవతులూ, సీతకు రెండుచీరలూ, రెవిక గుడ్డలూ తీసుకుని ఇంటికివచ్చాను అవి చూపి సీత మొహం వికసించటం చూపి ఆనందింతామని ; నా మొహాన అదివరకే చిరునవ్వు మొలకెత్తి వుంది ఏమీ మాట్లాడకుండా, మొహాన ఎటువంటి వికారమూ లేకుండా సీత నాచేతిలోంచి గుడ్డలూ, నమూనాలూ తీసుకుని వాటిని దీర్ఘంగా పరీక్షించసాగింది నాకు కలిగిన ఆశ్చర్యంలో నా చిరునవ్వు మాయమై వుంటుంది గడిచిన నెల రోజులకుగాను నేను సీత మొహాన్ని పరిశీలనగాచూడటం అదే మొదటిసారి.

సీత పరీక్ష ఎంతకూ పూర్తి కాలేదు. ఆ గుడ్డల హృదయాలు పగల దీసి వాటి పాతకం యావత్తూ అర్థంచేసుకో దలుచు కున్నట్లు కనిపించింది సీత. ఆమె నోటివెంట ఇంకా ఏమీ రాకపూర్వమే నాకు అవమానం కలిగినట్టయింది కవీనం నా ఉత్సాహమైనా విరిగిపోయింది

"ఎట్లా వున్నై గుడ్డలు?" అన్నాను. నాకు కలగటం ప్రారంభించిన నిరుత్సాహం నా గొంతులో కనిపించకుండా వుండాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూ

"బాగానే ఉన్నై ఈ కోటుగుడ్డ పరుపులు కుట్టటానికి బాగా పనికి వస్తుం దేమో ఈ చొక్కా గుడ్డలు దిళ్ళు కుట్ట టానికి ఈ రెవిక గుడ్డలు గలీబులకూ; ఈ చీరలోనే ఉదారంగు పోగుంటే ఇంకా బాగుండేది మీ ధోవతులుకూడా ఒక్క ఉతుక్కే దాళ్ళుపడి పొయ్యే టట్టున్నై" అన్నది సీత—పరిహాసంగా కూడా కాదు నిర్వికారంగా. పిల్లవాడి జ్ఞానాన్ని పరీక్షాధికారి తణిఖీస్తున్నట్టు!

తన మాటలవల్ల నాకు కలిగే బాధ తన్ను ఏమాత్రమూ బాధించనట్టు!

నేను లోలోపల మండసాగాను.

"అయితే ఈ గుడ్డల్లో నువ్వు ఒక టైనా పాసు చెయ్యలేదన్నమాట!" అన్నాను వణుకుతున్న గొంతుతో, నా ఉద్రేకాన్ని అణిచిపెట్టాలని ప్రయత్న మైనా చెయ్యకుండా

"పోనివ్వండి. ఇప్పుడేం చేస్తారు? పోనీ నాతో ముందుగా మాటమాత్రం చెబితే ఏం?"

"ఇప్పుడు మించిపోయిందేమీ లేదు ఆ చీరలు తిరిగి పుచ్చుకుంటాడు" అన్నాను

"అయితే ఇవి ఇచ్చి మంచివి ఉంటే తీసుకురండి!"

నేనా చీరలు తీసుకువెళ్ళి షాపులో ఇచ్చి వట్టిచేతులతో ఇంటికి తిరిగివచ్చాను సీత నేనేమీ తీసుకరాలేదని గమనించింది. కాని వెంటనే నన్నేమీ అడగలేదు ఆ విషయం నేను గమనించాను.

ఎప్పుడో నేను భోజనం చేస్తుండగా సీత "మీరేమి తిరిగి తీసుకురాలేదల్లే ఉందే?" అన్నది. సీత దేన్నిగురించి మాట్లాడుతున్నదో నా కర్థం కానట్టు నటించాను కాస్సేపు ఆఖరుకు "నీకు నచ్చే చీరలు బజార్లో లేవు. ఉన్నా నేను గుర్తించలేకపోయినాను" అన్నాను ఆ మాటమీద సీత ఏమీ వ్యాఖ్యానం చెయ్య లేదు.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు నా మనస్సు చాలా కలతపడ్డది. నా బుద్ధి సన్నిపాతరోగి మనసల్లే ఒక్కసారే పరి పరివిధాల వెళ్ళింది దానికొక దోవా డొంకా లేదు, కాని నేనారోజు తేల్చు కున్న దిది

సీత సొమ్ము కొంతకాలం తినటం చాలా బుద్ధితక్కువ పనిగా పరిణమిం చింది. ఆ రోజుల్లో నేను తప్పనిసరిగా కొంత వినయ విధేయతలూ కృతజ్ఞతా సీతకు చూపి వుండాలి నా వ్యక్తిత్వమూ నా అభిరుచులూ సీత వ్యక్తిత్వానికీ అభి రుచులకూ దాస్యం చేసివుండాలి తిరిగి ఆ వ్యక్తిత్వాన్నీ అభిరుచులనూ నేను వ్యక్త పరచదగిన పరిస్థితులు కలగటం సీతకు రుచించలేదు నా వ్యక్తిత్వంమీదా అభి రుచులమీదా అధికారం చలాయించటానికీ వాటిని శాసించటానికీ అలవాటుపడిన సీత "మాటమాత్రం నాతో ముందుగా చెబితే ఏం?" అనక ఏంజేస్తుంది? సీత నాకు చూపిస్తూ వచ్చిన ప్రేమకూడా ఇప్పుడు సంశయాస్పదంగానే కనిపిం చింది. అది మనం విశ్వాసంగా వుండే మన కుక్కమీద చూపే ప్రేమ సీత నాకు చూపిన సానుభూతికూడా అటువంటిదే. నాకు ఉద్యోగం దొరికిన మర్నాడు నేను తనకు బానిసగా ఉండటం మానేస్తానని సీతకు తెలుసు. అందుకనే ఉద్యోగం రానందుకు నన్ను దిగులుపడనిచ్చేదికాదు సీత. నేను ఉద్యోగప్రయత్నం చెయ్య

కుండా ఉండాలని సీత ఎంత ప్రయత్నం చేస్తూవచ్చిందో నాకిప్పుడు తెలిసింది. "కాని ఉద్యోగాలకోసం ఎందుకు తిరుగు తారు లెస్తురూ, కాళ్లు పడిపొయ్యేట్టు!" అని ఎన్నిసార్లో అంది సీత నెలకు ఏ పాతిక రూపాయలో వ్యయంచేసి—నా సొంతఖర్చు అంతకంటె వుండదు—సీత నా ఆత్మను కొనాలని చూసిందన్న మాట!

ఈ విధంగా ఆలోచించుకు పోతే సీతకూ నాకూ వుంటూ వచ్చిన అన్యోన్యత యావత్తూ నా బానిసత్వంగానూ సీత నిరంకుశత్వంగానూ, సీత నామీద చూపిన ప్రేమ యావత్తూ కుట్రగానూ, నేను సీత మీద చూపిన ప్రేమ గుడ్డి తనంగానూ కనపడసాగింది. నా రక్తం ఉడికి పోయింది. నా అభిమానానికి అంత దెబ్బ యెన్నడూ తగలలేదు!

ఆ నాటినించీ నాకూ సీతకూ మధ్య ఒక అగాధం ఏర్పడి అభివృద్ధి కసాగింది మనిషికీ మనిషికీ వుండే తేడాలు వారి అన్యోన్యతను బాధించకుండా చెయ్యగలి గినది సానుభూతి. సీతయందు నాకు, నాయందు సీతకూ సానుభూతి ఎప్పు డైతే అంతరించిందో, ఆక్షణంనించీ మే మిద్దరమూ ఒకర్నొకరం ప్రతిఘటించ సాగాం. నా అభిప్రాయాలను సీత తృణీకరించితే నాకు సీతమీద నైతికంగా వున్న హక్కునంతా వినియోగపరచి నేను సీతను శాసించసాగాను. చివరకు కూర గాయల దగ్గిరనుంచి నా ఇష్టమే చెల్లించు కుంటూ రాసాగాను. ఒక్క నా యిష్టం చెల్లటమే కాదు సీతయిష్టం చెల్లకుండా కూడా చూడసాగాను నన్ను ప్రతిఘటిం చటానికి ఆవగింజంత అవకాశం వుంచే జారవిడవటం లేదు సీత నా కెన్ని విధాలా అసంతృప్తి కలిగించటానికి వీలుందో అన్ని విధాలా అసంతృప్తి కలిగిస్తున్నది

సీత తను ఓడిపోయిన సంగతి యెందుకు గుర్తించకూడదూ? తన పెత్తనం అయిపోయిందనీ నా పెత్తనం ప్రారంభమయిందనీ ఆ మనిషి యెందుకు తెలుసుకోరాదూ? ఇంకా నన్నువశపరచు కుందామని ఆశవుంది కాబోలు సీతకు—ఈవిధంగా అనుకుని నేను మరింత కాఠిన్యం అవలంబించటం మొదలు పెట్టాను. నా ప్రయత్నం సీత ఏ విధం గానూ ఊపిరి సలపకుండా చెయ్యాలని. కాని నా ప్రయత్నం ఏదో విషయంలో నిష్ఫలం అవుతూనే వస్తున్నది. అందు వల్ల నా క్రౌర్యం అంతులేకుండా విజృం భించ సాగింది

నే నప్పటికి చాలా అజ్ఞానిని—నేను తెలుసుకోలేక పోయినప్పటికి, అందుకనే సీతను పూర్తిగా జయించటం సంభవ మనుకున్నాను సంసారం ఒక వ్యక్తి యొక్క సంపూర్ణ శాసనంకింద సాగటం అసంభవం అది రెండు కత్తుల ఒర—కాదని నేను భ్రమపడ్డాను. ఆడదాని

వంతు రాజ్యంలో మగవాడు అడుగు పెట్టి ఆడదాన్ని జయించటం కూడా అసంభవమే ఎవరి పరిపాలనలో వారికి నేర్పు యెంత అవసరమో స్వేచ్ఛకూడా అంత అవసరం. సంసారానికి సంబంధించిన సమస్యలన్నీ ఈ రెంటిలోనూ ఏదో ఒకటి—లేక రెండూ—లోపించిన చోటనే బయలు దేరుతున్నై

నా మటుకు నేను నా కిష్టమై సీతకు ఇష్టంకాని కూరలుగా చూసి ప్రతిరోజూ తీసుకురాగలను కాని సీత తొమ్మిదిన్నరకో పదింటికో నాకు భోజనంచేసి పెట్టేటట్టు చెయ్యటం ఎట్లా? ఒకరు ఒక పని చెయ్యకుండా చెయ్యవచ్చునుకాని, చెయ్యటం ఇష్టంలేనప్పుడు చేయించటం ఎట్లా?

నా గర్వమూ దురహంకారమూ నా పెదడును ముట్టడించి వుండటంవల్ల నా కామాత్రం తట్టలేదు సీతను తిట్టటం మొదలు పెట్టాను ఒకసారి నోటికి స్వేచ్ఛయిచ్చిన తరవాత అది చాలా దూరం వెళ్ళగలదు—నా నోరు వెళ్ళింది. నాకంటె నాగరికత కల మనిషి కావటం చేతనో, నా అంత గర్వి అయినప్పటికీ నా అంత దురహంకారి కాకపోవటం చేతనో, సీత నేను వెళ్ళినంత దూరం వెళ్ళకపోయినా కొంతవరకు నోటికి స్వేచ్ఛ ఇచ్చింది నేను సీతను కొట్టటం కూడా అలవాటు చేశాను

మేము యెంతదూరం వెళ్ళవలసి వుందో, మాపతనం యెక్కడ అంతమై పోతుందో నేను ఊహించలేక పోయినాను. నిన్న నోటివెంట అనటానికి వెరచిన మాటను ఇవాళ ధైర్యంగా అనేస్తున్నాము. నిన్న చెయ్యటానికి వెరచిన పనులు ఇవాళ చేసేస్తున్నాము. సీత నేను కొంతకాలం తిన డబ్బు తిన్న సంగతి తరుచు ఎత్తుతూ వుండేది తన డబ్బు! "నా కటువంటి భేదాలు లేవు!" అన్న సీత నోటివెంట అమాట!

మేమిట్లా యెందుకు తలపడ్డామో కూడా మరిచిపోయినాం ఒకరి నొకరం హింసించుకోవటంవల్ల మాకేమైనా తృప్తి కలుగుతున్నదా అని కూడా మేం ఆలోచించుకో లేదు అంత ఆలోచించడానికి మాకు వ్యవధానం లేదు ఓపికా లేదు

మధ్య మధ్య నేను సీతకు ఉపన్యాసాలిచ్చే వాణ్ని "నాకు ఆడవాళ్ళను తిట్టడమో కొట్టడమో అంటే యెంత అసహ్యమో ఆ పరమాత్ముడికి తెలుసు. నా చేత ఈ పాడు పనులుకూడా చేయిస్తున్నావు నువ్వు! " అట్లా అంటే నా అంతరాత్మ తృప్తిపడేది—నేను నిజంగా ఏ పాపమూ ఎరగను, తప్పంతా సీతదేనని. నా మాదిరిగా పాశ్చాత్య సారస్వతం చదవని సీతకు ఇటువంటి ఉపన్యాసాలు చేసే శక్తిలేదు

అప్పుడప్పుడూ నాకు శాస్త్ర జ్ఞానోదయం కలిగి నిజమైన పశ్చాత్తాపం కలి

లేది—నా ఒక్కడి తరఫునా అనుకునేరు, కాదు. మా ఇద్దరి తరఫునా. మేం ఒకప్పుడు—ఎంతో కాలం కిందటకూడా కాదు మళ్ళీ!—ఎంత ఆనందం అనుభవించాం! ఇప్పుడైనా ఈ విధమైన వైరం పెంచుకుని ఎంత సుఖం చేజేతులా పోగొట్టుకుంటున్నాం! ఇంకా అంతా మించిపోలేదేమో! సీత నాకు లొంగక పోతే నేనే సీతకు లొంగిపోయి బతికి వుండే నాలుగురోజులూ ఇంత సుఖమైనా అనుభవించరాదూ? ఎందుకొచ్చిన అహంకారం? దీనివల్ల సాధించదగినది చీమ తలకాయంతకూడా లేనప్పుడు!

సీతతో నాలుగైదుసార్లు సంధి చేసుకుని చూశాను కాని నా వేదాంతం పని చెయ్యలేదు సీతకుకూడా అటువంటి వేదాంతం లేకపోవటంవల్ల నేను రాజీగా ఉద్దేశించినది నా అపజయంగా పరిణమించింది అందువల్ల నేను పొందగలిగిన కాస్త సుఖమూ కృత్రిమసౌఖ్యం మాదిరిగా ఉండటమే కాక, మర్నాటినించీ సీతకు నన్ను చూస్తే అలుసు జాస్తి కాసాగింది ఇట్లా నాలుగైదు సార్లు జరిగిన తరవాత ఇక రాజీ ప్రయత్నం చెయ్యనని ప్రమాణం చేసుకున్నాను.

ఆపట్టున పూర్తిగా నెలా పదిహేను రోజులు నేను సీతతో ఎటువంటి సంబంధమూ లేకుండా ఉన్నాను ఆ రోజుల్లో నా మనసు బురదగుంట మాదిరిగా అయిపోయింది రాత్రివేళ ఒంటరిగా పడుకుని అనేక పిచ్చిఊహలు ఊహించేవాణ్ణి—సీతను వదిలేసి ఇంకోపెళ్ళి చేసుకుందామనీ, ఎవతెనైనా ఉంచుకుందామనీ, విచ్చలవిడిగా తిరిగి సమస్తమైన వ్యాధులూ అంటించుకుని ఆ తరవాత సీతనుకూడా బాధపడేట్టు చేతామనీ, ఏమిటేమిటో! అట్లా ఆలోచిస్తూ ఆలస్యంగా నిద్రపోయి జాముపొద్దెక్కి లేచి, చప్పున కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకు వెళ్ళేవాణ్ణి

నీటిని కాచటం మొదలుపెడితే కొంత వేడెక్కినమీదట అది ఆవిరిగా మారిపోయినట్టు మా సంసారం ఈ పరిస్థితులలో ఎప్పటికైనా విచ్ఛిన్నం అయితీరవలసి వుంది కావి ఆ పని అంత త్వరగా జరుగుతుందని భావించడం లేదు తను చేస్తున్న పాపానికి అంత త్వరలో ఫలితం వస్తుందని ఏ పాపికూడా అనుకోలేదు—అది ఎంత ఆలస్యంగా వచ్చినా సరే'

ఆనాడు నేను చాలా చిరాకుతో ఇంటికి వచ్చాను. వస్తూనే ఏదో వంకపెట్టి సీతను నానా తిట్లూ తిట్టాను భోజనం సరిగా చెయ్యకుండా వెళ్ళి నా పక్కమీద పడుకున్నాను. అలసిపోయి వున్న నా శరీరానికి వెంటనే నిద్రపట్టింది నాకు మళ్ళీ నిద్ర మెలకువ వచ్చేటప్పటికి ఒంటిగంటన్నర అయింది నా శరీరానికి బడలిక తీరింది మనస్సుకూడా ఎంతో నిర్మలంగా ఉంది. నా మనస్సు అంత నిర్మ

లంగా వుండి ఎన్నో యుగాలయినట్టుంది. నా కా క్షణాన సీతమీద వాంఛ కలిగింది. నేను లేచి సీత మంచంపక్కన నిలబడి నిద్రపోతున్న సీతవంక చూశాను ఆమె మొహం ప్రశాంతంగా వుంది. ఈ మొహం నన్ను చూడగానే మిటమిటలాడే మొహం కాదు. ఈ సీత మొదట నేను ప్రేమించిన సీత మాకిద్దరికీ చెడిపోక పూర్వం ఒక రాత్రివేళ ఇట్లాగే నిద్రా భంగం కలిగితే నేను సీతమొహం పరీక్ష చేస్తూ మేలుకుని ఉండేవాణ్ణి నే నటు వంటి సమయాల్లో తన చెక్కిళ్లు నిమిరినా, జుట్టు సర్దినా, ముద్దు పెట్టుకున్నా సీత ఎంత నిద్రలో వుండికూడా నా స్పర్శ గుర్తించినదానల్లే సూక్ష్మంగా చిరునవ్వు నవ్వి తనచెయ్యి నామీద వేసేది ఆ సీత నా కిప్పుడు జ్ఞాపకం వచ్చింది నేను ఆ ఆలోచన భరించలేక పోయినాను. సీత కళ్ళుతెరచి నన్నుచూసి నవ్వకూడదూ? ఈ నాలుగైదు మాసాలలో మేమిద్దరమూ అన్న మాటలూ, చేసిన పనులూ ఏ భగవంతుడైనా తుడిచి వెయ్యరాదూ?

నేను సందేహిస్తూ—సగం అయిష్టంగానే—సీత భుజంమీద చెయ్యివేశాను ఆమె చప్పున కళ్లుతెరచి చూసింది వెంటనే ఆ మొహంలో నాకు రోజూ అనుభవమవుతున్న పరివర్తన వచ్చేసింది. సీత నన్నుచూచి నవ్వుతుందని ఆశ ఉండటానికి నాకేమీ ఆధారం లేకపోయినప్పటికీ హతాశుణ్ణి అయినాను ఆ చిట్లించిన మొహం చిట్లించినట్టే ఉంది సీత మళ్ళీ కళ్ళుమూసుకుని నా చేతిని విదిలించి పక్కకితిరిగి పడుకుని మళ్ళీ వెంటనే గాఢనిద్రలో పడ్డదానల్లే శ్వాస పీల్చటం మొదలుపెట్టింది ఆమె నిద్ర పోవటం లేదని ఆ మొహం చిట్లింపే చెబుతున్నది

అంతటితో — సుఖస్వప్నం భగ్నమయింది కలకదేరిన నా మనస్సు మళ్లా కెలికినట్లయింది నాకు పట్టరాని కోపం వచ్చి సీతను రెక్కపట్టుకుని ఒక్కఊపున లాగి కూర్చోపెట్టాను సీత ఒక్క ముక్కు ముక్కి నా చేతిని బలవంతాన వదిలించుకోవాలని ప్రయత్నించింది నేను వదలలేదు. సీత నావంక "ఏమిటీ ఈ దౌర్జన్యం? నే నెవరో ఎరుగుదువా?" అన్నట్టు చూసింది నేనా చూపు భరించలేకపోయినాను, రెండో చెయ్యి చాచి సీత చెంపమీద నా శక్తికొద్దీ కొట్టాను. ఆ దెబ్బతో నా ఆగ్రహం రెట్టింపయింది.

"ఏమిటా వెధవచూపు? నన్నేం చెయ్యగలవని? ఆ చూపేమిటంటాను!" అని సీత దవడలు రెండూ పొంగిపొయ్యేట్టు కొట్టాను ఎన్ని దెబ్బలు కొట్టానో నాకే తెలియదు సీత నాకు చేసినదానికీ, చేసిందని నే ననుకున్నదానికీ—అన్నిటికీ నా కసి తీర్చుకోవాలనిపించింది నా కసి తీరక పూర్వమే నా చేతులు నెప్పెత్తినై!



మర్నాడే సీత తన సామాను యావత్తూ తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

ఆరు సంవత్సరాలు గడిచినై.

ఆ కాలంలో నేను సీతను స్మరించని రోజు లేదు—నా దగ్గిరనించి వెళ్ళిపోయిన సీతను కాదు. నా దగ్గిరికివచ్చిన మొదటి సీతను. ఆ మొదటి సీతను ప్రేమించటం మాననేలేదు నేను. ఆ సీతనూ ఆమెవల్ల నేను పొందిన సౌఖ్యాన్నీ నేను మరవకలిగితే మనిషినేకాను. ఈ రెండో సీత నాకు అర్థం కాలేదు. ఈమెను నేనెన్నడూ కోరలేదు. కోరను. నేను పడ్డ మనోవ్యధ కాని, పశ్చాత్తాపం కాని ఆమె మొదటి సీతకోసమే. ఆ సీత ఏమైపోయింది?

నా అసలు సీత జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు మా బావమరిది ప్రసాదు జ్ఞాపకం వచ్చేవాడు. ఆ సీతతోపాటు నేను ప్రసాదునుకూడా పోగొట్టుకున్నాను. వాడు అక్కకంటె రెండేళ్ళ చిన్న. వాణ్ణి కని మా అత్తగారు మరణించింది. వాడికీ

వాడి తండ్రికీ (మామగారికి) ఒక్క-క్షణం పడేదికాదు. ఆ పసివెధవతో ఆయన ఎప్పుడూ కీచులాడేవాడు. వాణ్ణి కవ్వించి వాడిచేత ఏదో అనిపించి, "అదుగో ఆ మాట అన్నావు!" అని గోలెత్తేవాడు. సీత అన్నట్టు వాళ్ళిద్దరికీ సరిపోదు.

సీతకు తమ్ముడంటే అమిత ప్రేమ. తండ్రి తను చెప్పినట్టు వినేవాడు కనక తండ్రికీ తమ్ముడికీ తను మధ్యఉంటూ, ఆయనవల్ల వాడికి జరగనిదంతా తనద్వారా జరిగేటట్టు చేసేది. సీత సహాయమే లేక పోతే వాడు తండ్రితో వేగలేక ఎన్నడో ఆత్మహత్యో, ఎక్కడికైనా లేచిపోవటమో ప్రయత్నించి ఉండును.

నేను ఆఖరుసారి వాణ్ణి చూసినప్పుడు వాడికి పదమూడేళ్ళుంటవేమో! వాడి లేత మొహమూ, కళ్ళమీద పడే ఉంగరాల జుట్టూ, విశాలమైన కళ్ళూ జ్ఞాపకం వచ్చేవి నాకు, వాడు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా. అయితే వాడుమాత్రం ఈ ఆరు సంవత్సరాల కాలంలో చాలా మారి ఉండాలి. వాడికీలోపల పెళ్ళీ, పెళ్ళాం కాపరానికి రావటమూకూడా జరిగినవని విన్నాను. వాణ్ని పోగొట్టుకున్నందుకు కూడా నేను చాలా పశ్చాత్తాపపడేవాణ్ని.

ఒక నాడుదయం నేను నాగదిలో కూర్చుని పత్రిక చూస్తూ వుండగా మా యింటిముందు బండి ఒకటి వచ్చి ఆగిన చప్పుడు వినిపించింది. నా కెందుకో వెంటనే సీత తిరిగి వచ్చిందేమో ననిపించింది. నేను అనుమానిస్తూ కుర్చీలోనించి లేస్తుండగా ప్రసాదు నా గదితలుపు తెరిచి నా వంక భయంతో చూసినట్టు చూస్తూ గుమ్మంలో నిలబడ్డాడు. వాడివెనుక చీర కనిపించి మాయమైంది. నా గుండె గబ గబా కొట్టుకోవటం ప్రారంభించింది. సీత వచ్చిందనుకున్నాను.

"ఏంరా, ప్రసాదూ?....రా, లోపలికిరా! నీ వెనుక ఎవరూ?...." అన్నాను.

"నా—నా భార్య!" అన్నాడు ప్రసాదు కొంచెం సిగ్గుపడుతూ.

"రండి లోపలికి! .... ఎంతకాలమయిందిరా నిన్నుచూసి!" అన్నాను వచ్చిన మనిషి సీత కానందుకు నాకు చాలా ఆశాభంగం అయింది. నా మొదటి సీత నాకుఎప్పటికైనా మళ్ళీ దక్కుతుందనే ఆశ నన్ను పట్టుకుని ఉండి వుండాలి.

ప్రసాదు అనుమానిస్తూ లోపలికివచ్చి నా ప్రోద్బలంమీద ఒక కుర్చీలో బలవంతాన కూర్చున్నాడు. వాడి భార్య రెండడుగులు లోపలికి వచ్చి దూరాన విలబడ్డది భర్తవంకనే చూస్తూ.

"భయంలేదు, రా అమ్మా!"అన్నాను. ఆ పిల్లను చూడగానే నాకు యెంతో ముచ్చట వేసింది. ఆ పిల్లపేరు భారతి అని తరవాత ప్రసాదు చెప్పాడు. భారతి చాలా చిన్నపిల్ల. ఆమె వయస్సు ఇంకా కొంచెం వుండవచ్చునేమో కాని చూడటానికి పదమూడేళ్ళయినా వుండవేమో ననిపించింది. నేను లోపలికి రమ్మన

గాని తన భర్త దగ్గరకి వచ్చి వాడుకున్నట్టు అనుకుని నావంక అమాయికంగా చూస్తూ నిలబడ్డది. వాళ్ళిద్దరికీ ఒకరికొకరు సమస్తంగా వున్నారని గ్రహించ గలిగాను. వాళ్ళను చూడగానే నా సీతకూడా ఒకప్పుడు నేనే లోకంగా వుండేదని జ్ఞాపకం వచ్చింది.

నాకు సీతను గురించి ప్రసాదును అడగాలని ఉంది; ఈ అరు సంవత్సరాల అనంతరం వీడు భార్యా సహితంగా నా దగ్గిరికి ఏం పనిమీద వచ్చాడో తెలుసుకోవాలనీ వుంది. అంతా వాడే చెబుతాడని చూస్తూ కూర్చున్నాను.

"బావా, ఇంతకాలం అయిన తరువాత నేను నీ పంచన తలదాచు కోటానికి వస్తే నీకు సహజంగా యిష్టం కాకపోవచ్చును. నా కిప్పుడు దిక్కులేదు—మవ్వు తప్ప! కనీసం నాకొక పాతిక రూపాయల నౌకరి అయినా దొరికేవరకూ ఎవరి చాటున అయినా ఉండాలి. నా విషయంకూడా నాకు దిగులులేదు. కాని నావంటి దౌర్భాగ్యుణ్ణి చేసుకుని, పాపం. ఈ భారతి—" అని ప్రసాదు ఆగాడు. భారతి అప్రయత్నంగా వాడి భుజంమీద చెయ్యి వెయ్యటం నేను గమనించాను.

"మేం నీ చాటున వుండటం నీ కిష్టంలేకపోతే చెప్పు. బావా!" అన్నాడు ప్రసాదు. భారతి స్పర్శతో కొత్తశక్తి పొందిన వాడల్లే.

"అటువంటిది నువు కల్లోకూడా అనుకోకు. ఇక్కడ వుండండి. ఈ ఇల్లు మీది. నాకూ పెద్దతనం వస్తున్న కొద్దీ పిల్లల మీద భ్రాంతిపోతున్నది. మీరే ఆ కొరత తీరుద్దురుగాని!" అన్నాను.....నిజానికి నా కప్పటికి ఇరవై ఎనిమిది ఏళ్ళే కాని భారతి వంక చూస్తుంటే నాతల నెరిసి చాలా ఏళ్ళయిందనిపించింది. అటువంటి కుమార్తె నాకు వుండి వుంటే యెంతబాగుండు ననికూడ అనిపించింది.

"మా సీత యెంత మారిపోయిందో నేను ఊహించలేక నీదే తప్పని కూడా చాలాకాలం నమ్మాను, బావా! నాదాకా వస్తే కాని నాకు తెలిసి రాలేదు." అన్నాడు ప్రసాదు.

"అదే నేను అడుగుదామనుకున్నాను. ఏమయిందీ? నువ్విట్లా దిక్కులేనివాడివి కావటానికి కారణమేమిటీ?" అన్నాను. ప్రసాదు జరిగిందంతా చెప్పాడు.

మా మామగారికి నా భార్య మొదటి సంతానం కాదు. అంతకు పూర్వం ముగ్గురు పిల్లలు—ఇద్దరాడపిల్లలూ ఒక మగపిల్లవాడూ—పుట్టి పెరిగి పెద్దవాళ్లయి పోయినారు. ఇద్దరాడపిల్లలకు పెళ్లిళ్లుకూడా చేశాడాయన. మగపిల్లవాడు మాత్రం అయిదేళ్ళు పెరిగిపోయినాడు. (వాణ్ణి చూస్తేకూడా ఆయనకు పడేది కాదట. వాడికి రోగం వస్తే మందిప్పించక చంపాడు మా మామగారు!) మేమెవ్వరమూ కనుక్కోలేదు కాని ఆయన

క్షేత్రీయమైన ఆస్తి నాకిచ్చిన కట్నం తోనే సున్నా చుట్టింది. కాని ఆయన ఉద్యోగం అప్పటికింకా అయిపోలేదు. సీత నా దగ్గిరనించి వెళ్లిపోయిన రోజుల్లో ఆయన రిటైరు కాబోతున్నాడు.

తరవాత ఆయన రిటైరయినాడు. ప్రావిడెంటు ఫండూ కొంత ఇన్సూరెన్సు డబ్బూ వస్తే అది సీత పొలంమీద వచ్చే అయివేజుకు జతచేసి ఒక యిల్లు కట్టించి నాలుగెకరాలు పొలం కొని అంతా సీత పేర పెట్టేశాడుట. భారతి కాపరానికి వచ్చేవరకూ ప్రసాదుకు ఈ ఏర్పాటువల్ల ఏమీ ఇబ్బంది కలగలేదు కాని భారతి వచ్చిన క్షణంనించీ ప్రసాదుకూ సీతకూ చెడింది. ప్రసాదు భారతిని ఎంత ప్రాణ ప్రదంగా చూడటం నేర్చుకున్నాడో సీత ఆ పిల్లను అంత అసహ్యంగా చూడ సాగింది. భారతిని సీత కోరంటికం పెడుతుంటే ప్రసాదు చూసి సహించలేక పోయినాడు. ఎన్నడూ అభిప్రాయభేదం ఎరగనివాళ్లిద్దరూ రోజూ పోట్లాడుకో సాగారు. మాటమీద మాటవచ్చి సీతా ప్రసాదూ నువ్వెంత అంటే నువ్వెంత అనుకున్నారు. సీత ఆఖరుకు "నా సొమ్ము తింటున్నందుకూ, నా ఇంటో ఉన్నందుకూ నీకు కృతజ్ఞత అయినా లేదు!" అన్నది. ప్రసాదు మరుక్షణమే భార్యను బండిఎక్కించి నాదగ్గిరికి ప్రయాణమైనాడు.

"వెనకటి సీత కాదు బావా!" అన్నాడు ప్రసాదు. "సీత ఏమన్నా నేను లెక్కచేసి ఉండను. నా కది అంతే ఇప్పటికీ యిష్టమే కాని ఏళ్లంగానే దాని ఉప్పుతింటూ దానితో అభిప్రాయభేదం వచ్చినప్పుడు సర్దుకుపోవటం వచ్చినటు పడిఉండటం అవుతుంది కాని సర్దుకు పోవటం కాదు!" వా డన్న ఆ ముక్క నేను ఎప్పటికీ మరవలేను.

నేను హోటల్లో భోజనం మానేసి ఇంట్లోనే వంట పెట్టించాను. భారతి అమాయకురాలే గాని అసమర్థురాలు కాదు. వంట దివ్యంగా చేస్తుంది.

పదిహేనురోజులు గడిచింది. ప్రసాదునూ భారతినీ చూస్తే నాకు చాలా జాలి కలిగేది. నా ప్రేమకు కలిగిన అపాయమే వాడి ప్రేమకూ కలిగేటంత పని అయింది ఈ కొత్తసీత నన్నూ నా మొదటిసీతనూ వేరుపరచ గలిగింది. కాని ప్రసాదునూ భారతినీ వేరు చెయ్యలేకపోయింది. ప్రసాదే నాకంటె ఎంతో అదృష్టవంతుడు వాడికీ వాడి భార్యకూ నేను చెయ్యదగిన శాశ్వతమైన ఉపకారం ఏమైనా ఉందా అని చాలా దీర్ఘంగా ఆలోచించాను. చివ రకు ఒక ఉపాయం తట్టింది: నేను సీతతో సంధి చేసుకుని ఆమెకు బానిసగా ఉండటానికి అంగీకరిస్తే సరి! ఎవరన్నా తనకింద తొత్తుగా ఉంటే తప్ప ఆ మని షికి తృప్తి కలిగేటట్టు లేదు. నేనట్లా ఉండటానికి ఒప్పుకుంటే ప్రసాదుకూ సీతకూ సఖ్యత కలుస్తుంది. పగంతో

ఆగిపోయిన వాడి చదువూ పూర్తి అవుతుంది. ఆతరవాత వాడుకూడా ఎక్కడన్నా నాలుగురాళ్ళు తెచ్చుకుని భార్యతో స్వేచ్ఛగా ఉంటాడు. నేను మనసారా ప్రేమించిన సీతకోసం—భారతికి ఈ మాత్రం ఉపకారం చెయ్యటానికి తీర్మానించాను.

ఈ ఆలోచన కలిగిననాడే నేను మా అత్తవారూరు బయలుదేరాను. దారిలో నేను వెయ్యబోతున్న పశ్చాత్తప్తుడి వేషం చక్కగా రిహార్సు చేసుకున్నాను. కష్టమంతా మొదట్లోనే ఉంది. నన్ను చూడగానే సీత పుట్టిక్కన యేదో పిడుగంటిమాట అంటుంది. అప్పుడు నేను చలించకుండా వుంటే మిగిలిన నాటకం సులభంగా ఆడవచ్చును. ఆ తరవాతకూడా కొంత కష్టం లేకపోలేదు. నేను నిజంగానేపశ్చాత్తాప పడుతున్నాను. వాడి దొంగేత్తుకాదు. అని సీతను నమ్మించాలి. అంత నటనాకౌశలం నాలోఉందా? ఇటువంటి విద్యలు జీవితంలో అవసరపడతవని నేను కలలోకూడా అనుకుని ఉండలేదు. నిజానికి నాగరిక ప్రపంచం రోజూ చేస్తున్నది నటనకాదా—ఆ చిరునవ్వులూ, ఆ నమస్కారాలూ, ఆ వినయమూ ఆ మర్యాదా....

నేను వెళ్ళేటప్పటికి నా అదృష్టము బాగుండి సీత ఒంటరిగానే వుంది. ఒక్క చూపులోనే గ్రహించాను సీత కొద్దిగా పాలిపోయి కొద్దిగా చిక్కి వుందని నన్ను చూడగానే ఆమెడ లేచి నిలబడి నావంక దిగ్భ్రమచెందిన దానల్లే చూడసాగింది. నేను గట్టిగా ధైర్యం చిక్కబట్టి పాఠం వప్పగించ సాగాను.

"సీతా, నేను నీ విషయంలో ఎంత దుర్మార్గంగా ప్రవర్తించానో కనుక్కోటానికి ఇంతకాలం పట్టింది. నన్ను—నువు నన్ను క్షమించి—" ఆ వెధవ ముక్క దగ్గిర నాకు నోరు కట్టుపడ్డది. అదృష్టవశాత్తూ నేను నా వాక్యం పూర్తి చెయ్యవలసిన అవసరం తప్పింది. సీత నమ్మ శక్యం గాని పని చేసింది —నా మాటలు పూర్తికాక మునుపే మొహానికి చీరె చెంగు అడ్డం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

ఒక్క క్షణకాలం నేను నిశ్చేష్టుణ్ని అయిపోయి సీత వంకచూశాను. మరు క్షణం నా అనుమానాలన్నీ రహితమయినై. ఏం జరిగిందో, ఎట్లా జరిగిందో నాకెందుకు? ఈ ఏడిచే సీత మూడు మూర్తులా నా మొదటి సీత మాదిరిగా వుంది. నేను చప్పున సీత దగ్గిరకి వెళ్ళి ఆమెను నా చేతుల్లోకి తీసుకుని కన్నీటితో తడిసిన ఆమె చెక్కిళ్లు ముద్దు పెట్టుకున్నాను. ఆ తరవాత సీత నిమిషంలో నా అనుమానాలన్నీ తీర్చింది.

"మీరు వుద్యోగంకోసం తహతహలాడటంచూసి, మీకు నామీద మొదట్లో వుండిన అపేక్ష పోయిందనీ, అందుకనే నా బొమ్మ ముట్టకోవడం మీకంత కష్టంగా వుందనీ అనుకున్నాను. ఉద్యోగం రాగానే మీరు నేననుకున్నంతా చేశారు. ఆ వెధవ నౌకరీమీదపడి మీరు నాకు రోజల్లా కనపడకుండా వుండటమే కాక

యువ

రాత్రివేళకూడా నా సంగతి విచారించటం మానేశారు. నాకు మీమీద చాలా కోపం వచ్చేది. చెప్పొద్దూ చివరకూ ఒకనాడు అన్నీ పాడుగుడ్డలుతెచ్చి నాచేతికిచ్చారు. అవన్నీ పాడు గుడ్డలు అయి వుండ వచ్చునని నాకు ఇంతకాలమయిన తరు వాత సీత చెప్పేదాకా తట్టనైనాలేదు. మొదట్లోనే అన్నదనుకోండి. ఆ అన టానికీ ఆరు సంవత్సరాల అవతల అన టానికీ చాలా భేదం వుంది!) నేనామాట అన్నానని మీకు కోపంవచ్చి మీరు నాకు తెచ్చిన చీరెలు ఇచ్చేశారు. అప్పటినించీ మీరు మారిపోయినారు (ఇది అన్యాయం. నేను సీతను గురించి అనుకున్నమాటే. నన్నుగురించి సీత అనుకుని ఉండటం!) అదివరకు మీ దగ్గిర ఎంత చనువు తీసు కున్నా మీకు ఇష్టమయ్యేది. మీకు ప్రతి దానికీ నామీద కోపం రావటం మొదలు పెట్టింది. జరిగిపోయిన రోజులు తలచు కొని రోజూ ఏడిచేదాన్ని. అఖరికి మిమ్మల్ని చూస్తే భయమూ, అసహ్యమూ కలిగింది. నాకు ఇష్టమైన మొగుణ్ని చంపేసి ఆ స్థానం మీరు పుచ్చుకున్నా రనుకునేదాన్ని.

నాది యెంత పాపిష్టి జన్మో. నా మనసులో ఒకటుంటే పైకి ఇంకొకటి వచ్చేది. నా నోటివెంబడి ఏది వచ్చినా మీకు తప్పుగానే కనపడేది. ఆఖరుకు ఆయింటో వుండలేక వచ్చేశాను.

కాని నేను మీ విషయంలో ఎంత ఘోరంగా ప్రవర్తించానో నాకు తెలిసి రాలేదు. మా ప్రసాదు ఇంటోనించిలేచి పొయ్యే వరకూ!''

నా అనుమానాలన్నీ తీరినై కాని ఇంకా ఒకటి మిగిలివుంది.

''అదంతా సరేకాని. పాపం. మీ మరదలిని అంత ఒత్తిడి పెట్టావుట— దేనికి?'' అన్నాను.

''నా కేదో భూతం ఆవేశించింది. వాళ్లిద్దర్నీ చూసినప్పుడల్లా మన కాపరం మొదటిరోజులు జ్ఞాపకం వచ్చేవి. నా మనస్సు భగభగ మండిపొయ్యేది. వాళ్లు ఆపేక్షగా ఉండాలంటే నేను చూడకుండా ఉండరాదా? నా కెందుకీ శిక్ష? అని పించేది! పాపం! వాడికేమర్థమవుతుంది నా బాధ! .... వాడితోకూడా అంతే— ఒకటి మనసులో ఉంటే ఇంకోటి అనే దాన్ని. నాకు ఎటువంటి శిక్ష విధించాలో అటువంటి శిక్ష విధించాడు! మొదట మీకు దూరం కావటమూ—తరవాత వాడికీ! తీరా వాడు వెళ్లిపోతున్నాడని తెలిసిన తరువాత నా ప్రాణం దిమ్మర పోయింది. బుద్ధి తక్కువై ఆమాట అన్నాను. నన్ను క్షమించమని అందా మనుకున్నాను కాని నా నోట మాట రాలేదు. వాడు వెళ్లిపోయినప్పటినించీ నాకు నిద్రాహారాలు సరిగా లేవు. ఇప్పుడు మాట్లాడినందుకు నో రెండిపోతున్నది.

''నేను మీతోనూ వాడితోనూ అని వుండాలిసిన మాటలు మీరు నాతో అనే టప్పటికి నాగుండె పగిలిపోయింది.. ఏమైతే ఏం మీరు మళ్లీ నాకు కన పడ్డారు!....''

ఇంతకూ నేను చెప్పవచ్చిందేమంటే— ఇంతలో ఉంది!




# తప్పటడుగు

(గత సంచిక తరువాయి)

''ఎవరా డాక్టర్ సాబ్? రవీంద్రేనా?'' అన్నాడు తీక్షణంగా ఆమెవంక చూస్తూ రజీవ్.

''ఔను. మన డాక్టర్ రవీంద్రే!''

'' 'మన' డాక్టరేమిటి? ఆ డాక్టర్ మన సొంతం అయినట్లే మాట్లాడుతున్నావే?'' అన్నాడు రజీవ్.

''మన బాబాకి ప్రాణం పోసి బ్రతికించిన డాక్టర్ కనుక మన డాక్టర్ అంటున్నాను. అందులో తప్పేముంది?'' చిరాగ్గా అంది మెహర్.

''నువ్వూరుకో రజీవ్! మాటిమాటికీ అక్కయ్యన్న గౌరవమన్నా లేకుండా మెహర్‌తో ఎందుకలా పేచీలు పెట్టుకుంటావు?'' అంటూ వహీదా మరిదిని కోప్పడింది.

''నాకంటే ఒక సంవత్సరం ముందు పుట్టిందన్న కారణంచేత యీ మహారాణిని గౌరవించాలన్న రూలు యెక్కడుంది? ఒక మనిషిని గౌరవించవలసింది వయసునుబట్టి కాదు, బుద్ధులనుబట్టి'' అన్నాడు రజీవ్.

''ఐతే నా బుద్ధులకు ఏం లోపం వచ్చిందంటావు?'' ఆవేశంతో వణికిపోతూ అంది మెహర్.

''గురివెంద గింజకు తన నలుపుని గూర్చి తనకు తెలియదు. ఇతరులు చెప్పినా ఆ నలుపుని గుర్తించలేదు.''

''యూ రాస్కెల్! షటప్! నిన్ను చంపేస్తాను బద్మాష్! పిచ్చిగా వాగకు.''

అంటూ తమ్ముడిమీద కలియబడబోయింది మెహర్.

వహీదా వచ్చి మెహర్‌ని గట్టిగా పట్టుకుంది. "ఏమిటి మెహర్ ఆ ఆవేశం? రజ్వీ నీ తమ్ముడు చిన్నవాడు. ఏదో నోరుజారి అన్నాడే అనుకో దానికంత రాద్ధాంతం ఎందుకు?" అన్నది అనునయిస్తూ.

"వాడు నా తమ్ముడు కాడు వదినా! వాడు వాడు నాకు శత్రువు ప్రబల శత్రువు నన్ను హింసించటమే వాడి పని " అంటూ కుర్చీలో కూలబడి వెక్కి వెక్కి ఏడ్చింది మెహర్.

"అయ్యో! అయ్యో! అవేం శోకాలే! ఇలాటి చోట అదేం ఏడుపు? బాబాకి అసలే ఆరోగ్యం సరీగ్గాలేదు" అంటూ తల్లి మొత్తుకుంది.

గఫర్‌ఖాన్ రజ్వీవంక చూసి "ఒరేయ్ చవటా! ఈ రోజునుండి నువ్వు యీ హాస్పిటల్‌లో అడుగుపెట్టవద్దు. ఏం కావాలన్నా నౌకర్ల చేతనే పంపించు ఆడపిల్లను అలా ఏడిపిస్తావుటరా! నీకు సిగ్గులేదూ," అని ఆయాసంతో ఆగిపోయాడు.

తాహిరాబేగమ్, వహీదా యిద్దరూ "మీరు మాట్లాడకండి. కళ్లు మూసుకోండి ఆ పిల్లలిద్దరూ ఎప్పుడూ అంతేగా" అంటూ ఆయనకి సర్దిచెప్పేరు.

"నేను రిక్షాలో ఇంటికి వెళ్లిపోతాను. మీరు తరువాత కారులో రండి" అని సమాధానంకోసంకూడా యెదురుచూడకుండా చటుక్కున లేచి వెళ్ళిపోయేడు రజ్వీ.

# 5

హాస్పిటల్‌లో పదిరోజులున్న తరువాత గఫర్‌ఖాన్ కోలుకున్నాడు అతని ఆరోగ్యం చాలావరకు బాగుపడిందనే చెప్పాలి డాక్టర్ రవీంద్ర. ఆయన యింటికి వెళ్ళిన తరువాతకూడా అట్టే శారీరక శ్రమకుగాని, మానసికాందోళనకి గాని గురి కాకూడదని చెప్పేడు.

ఆ పదిరోజులలోనూ డాక్టర్ రవీంద్ర రోజూ ఉదయం, సాయంత్రం రెండు పూటలా వచ్చి గఫర్‌ఖాన్‌ని పరామర్శించిపోతూండేవాడు.

డాక్టర్ కేవలం అందగాడే కాదు. తెలివైన వాడుకూడా. తెలివైనవాడు మాత్రమే కాదు, కరుణార్ద్ర హృదయుడు. అంతేకాదు, గొప్ప కళాకారుడు డాక్టర్‌గా రోగులను ప్రతి ఒక్కరినీ సేవలు. ధనికులు అన్న తేడా లేకుండా ఎంతో ఆప్యాయంగా పలకరిస్తాడు. రోగులు చెప్పే కంప్లయింట్సు అన్నీ శ్రద్ధగా వింటాడు. "గవర్నమెంటు డాక్టర్‌ని కదా! ఏదో డ్యూటీ పూర్తిచేసుకు పోదాము" అన్న ఆలోచనే రాదు అతనికి. ఆ రోగులను పరీక్షించి, మందులివ్వటం తన విద్యుక్త ధర్మం అయినట్లు ప్రవర్తిస్తాడు. అంతే కాదు. ప్రతి చిన్నకేసునీ ఎంతో క్షుణ్ణంగా చదివి తన డైరీలో నోట్ చేసుకుంటాడు.

తన వార్డులోవున్న రోగులను పేర్లతో సహా అందరినీ గుర్తు పెట్టుకుంటాడు. ఇవన్నీ గమనించిన మెహర్ మనసు అతనియెడల భక్తిశ్రద్ధలతో నిండిపోయింది. డాక్టర్ ఆమె కంటికి సాక్షాత్తూ దైవస్వరూపుడిలానే కనపడేవాడు.

ఇది డాక్టర్‌లోని ఒకవైపు.

మరోవైపున డాక్టర్ కులాసా పురుషుడు. కళాకారుడు. మెత్తని మనసు గలవాడు. ఒకరిని నొప్పించడు. తాను నొచ్చుకున్నట్లు ఎప్పుడూ కనపడడు. ఏ సమయంలో చూసినా అతని ముఖంలో స్నేహపూర్వకమైన చిరునవ్వు తొణికిసలాడుతూ ఉంటుంది. అందుకే తోటి డాక్టర్లు. నర్సులు. రోగులు అంతా డాక్టర్ రవీంద్ర అంటే ప్రాణస్నేహితుడిలా భావిస్తారు ప్రతి ఒక్కరూ ఆయన తన ఆత్మీయుడనే చెప్పుకుంటారు.

ఒక వ్యక్తిలో ఎలాటి గుణాలుండాలని మెహర్ కోరుకుంటుందో ఆ గుణాలన్నీ డాక్టర్ రవీంద్రలో ఉన్నయ్

అందుకే ఎంత ప్రయత్నించినా, అతనివైపుకు బలంగా ఆకర్షింపబడుతున్న తన మనసును నిగ్రహించుకోలేక పోతోంది మెహర్. బాబాకి నయం కాకుండా యింకా కొన్నిరోజులపాటు హాస్పిటల్‌లోనే ఉంటే బాగుండును అనుకునేది. మళ్లా తన ఆలోచనకి తానే సిగ్గుపడేది

ఒకప్పుడు బాబాని ఎంతో ప్రాణ సమానంగా ప్రేమించేది మెహర్. కాని డాక్టర్‌తో పరిచయమైన తరువాత బాబాతో పాటు మిగిలిన వ్యక్తులందరూ కూడా డాక్టర్ తరువాతివారే అయినారు. స్త్రీ హృదయంలో ఒక పురుషుడికి ఎప్పుడు స్థానం ఏర్పడుతుందో అప్పుడు లోకంలోని యితర వ్యక్తులు. విషయాలు అన్నీ అర్థహీనంగా కనపడతయ్.

మెహర్ మనస్థితి అలాగే ఉంది. ఆమె డాక్టర్‌ని వెర్రిగా ప్రేమిస్తోంది. అనుక్షణమూ అతని రాకకోసం యెదురు చూస్తుంది అతను రావటం ఆలస్యమైతే క్రుంగిపోతుంది. వస్తే ఉప్పొంగిపోతుంది. రాత్రింబవళ్లు అతని ధ్యాసే। మెలకువలో, నిద్రలో అతని రూపే ఆమె మనసులో కదులుతుంది. ఇలా ఎందుకు జరుగుతోందో ఆమెకు తెలియదు అది తప్పో, ఒప్పో అంతకన్న తెలియదు.

అతను కంటబడితే చాలు, ఆమె మనసు నాగస్వరం విన్న పాములా నాట్యం చేసేది. అతను పలకరిస్తే చాలు, ఆమె హృదయం పురివిప్పిన నెమలిలా గంతులు వేసేది. అతని మాటలు వింటూంటే జలపాత ధ్వనులలోని సంగీతం, సంధ్యాసమయంలోని పక్షుల కలకల స్వానాల కమ్మదనం అనుభవంలోకి వచ్చేవి మెహర్‌కి.

ఒక్క వాక్యంలో చెప్పాలంటే— ఆమె అతనిని చూసి సమ్మోహితురాలయింది.

యువ

ఇలాటి స్థితిలో హఠాత్తుగా బాబాని మర్నాడే డిశ్చార్జి చేస్తారన్న వార్త విని క్రుంగిపోయింది మెహర్.

డాక్టర్ తండ్రిని చూసి "యు ఆర్ క్వైట్ ఓకే! రేపే డిశ్చార్జి చేస్తున్నాం" అని వెళ్లిపోయేక చాలా సేపటివరకు స్మృతి హీనురాలిలా ఉండిపోయింది మెహర్. డాక్టర్‌కు దూరంగా ఉండటం ఎలా సాధ్యం? ఐనా తన మనసెందుకిలా అయిపోతోంది? పదిరోజుల పరిచయంతో డాక్టర్‌తో యింత గాఢమైన అనుబంధాన్ని కలుగజేసుకుంది తను. దీని పరిణామాలు ఎలా ఉంటాయి? అలాటి ఆలోచనలతో ఆమె మనసంతా చికాకై పోయింది.

కాసేపు తన బలహీనతకి తనని తాను తిట్టుకుంది. మరికాసేపు తన దురదృష్టానికి దుఃఖపడింది. తన నిస్సహాయతకు తానే జాలిపడింది. తన బుద్ధి హీనతకు విసుక్కుంది.

అంతా అయిన తరువాత కాసేపు ఆత్మ పరిశీలన చేసుకుంది. తానింతగా అతని ఎడబాటుకి కలవర పడిపోతోంది కాని, డాక్టర్ అసలు తనని గురించి యేమైనా ఆలోచిస్తున్నాడా? అతను మొదటిసారి తను చూసినప్పుడు ఎలా ఉన్నాడో యిప్పుడూ అలాగే ఉన్నాడు. అవే చిలిపి చూపులు అదే చిరునవ్వు, అదే మెత్తని కంఠం ఎవరితో మాట్లాడుతున్నా, ఎలాటి పరిస్థితులలో ఉన్నా ఒకేరకమైన ప్రవర్తన అతనిది.

నర్సులతో మాట్లాడుతున్నా, తోటి లేడీ డాక్టర్లతో మాట్లాడుతున్నా తనతో మాట్లాడినా ఒకే విధంగా కనిపిస్తాడు డాక్టర్ రవీంద్ర. కాని తన అందాన్ని పొగుడుతూ అతడన్న మాటలు, తన చిత్రాన్ని గీయాలన్న అతని సంకల్పం అవన్నీ చూస్తుంటే అతనికి తనమీద ప్రత్యేకమైన శ్రద్ధ ఉన్నట్లు స్పష్టమవుతోంది. తా మిద్దరూ ఏకాంతంగా ఉన్నప్పుడల్లా తన అందాన్ని గురించి ప్రశంసించకుండా ఎప్పుడూ అతను వెళ్ళ లేదు. ఒకవేళ బాబాగాని, అన్నయ్యగాని ప్రక్కన ఉండి అతనామాటలు చెప్పటానికి వీలులేనట్లయితే చూపులలోనే తనకా భావాన్ని అందించి వెళ్ళిపోయేవాడు.

బహుశా అతను కళాకారుడవటంవల్ల తనని ఒక "మోడల్" గా మెచ్చుకుంటున్నాడే తప్ప ఫ్రీగా తనని ప్రేమించటం లేదేమో అనుకుంది మెహర్.

ఏది యేమైతేనేం, ఆరోజు రానే వచ్చింది. సామానవీ సర్దుకుని బయలుదేరటానికి అందరూ సిద్ధంగా ఉన్నారు. రజ్వీ, అహమ్మద్, డ్రైవరు కాక, మరిద్దరు నౌకర్లు కూడా వచ్చేరు వారిని యింటికి తీసుకు పోవటానికి.

మొదట సామాను కారులో పెట్టి, గఫర్‌ఖాన్‌ని కారులో కూర్చోపెట్టిన తరువాత మెహర్ అన్నతోపాటు గది

బయటకు వచ్చింది.

వార్డులోనుండి నడుచుకుంటూ వెళ్తుంటే డాక్టర్ రవీంద్ర 'రౌండ్సు'లో ఉన్న వాడల్లా వీళ్ళను చూసి "హల్లో!" అన్నాడు ఎప్పటిలానే నవ్వుతూ.

అతని నవ్వు ఆమె గుండెను కత్తిలా కోసింది.

"వెళ్తున్నాం. మీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేం." అంటూ నీళ్ళునిండిన కళ్ళతో రెండు చేతులనూ జోడించింది మెహర్.

అహమ్మద్ "మీరు లేకపోతే మా బాబా ఏమైపోయేవాడో" అన్నాడు.

"ఓ....అలా అనకండి. నా స్థానంలో ఏ డాక్టరున్నా నేను చేసినదే చేస్తాడు. ప్రత్యేకంగా నేను చేసిన గొప్పతన మేదీ లేదు." అన్నాడు డాక్టర్. "ఐతే ఒక్క మాట మాత్రం నిజం. ఈ పది రోజుల్లోనూ మంచి కంపెనీ దొరికింది. మీ ఫ్యామిలీని చూస్తుంటే ఎంతో చూడ ముచ్చటగా ఉంది. ఎప్పుడైనా అవసరం వస్తే యింటికి ఫోన్ చెయ్యండి. తప్పకుండా మీ యింటికి వస్తాను. ఏసమయంలో నా సహాయం మీకు కావలసి వచ్చినా, రెక్కలు కట్టుకుని వచ్చి మీ ముందు వాల్తాను." అన్నాడు.

ఆ మాటలు వింటుంటే అహమ్మద్ హృదయం కృతజ్ఞతతోను మెహర్ హృదయం ఆనందంతోను నిండి పోయినయ్.

డాక్టర్‌కి పూర్తిగా దూరంగా ఉండ నక్కర్లేదు. అవసరమైనప్పుడు అతనిని చూడవచ్చునన్న ఆలోచన ఆమె కెంతో రిలీఫ్ నిచ్చింది.

డాక్టర్ రవీంద్ర తన విజిటింగ్ కార్డును అహమ్మద్ చేతికిచ్చిన తరువాత అన్న చెల్లెళ్ళిద్దరూ డాక్టర్ దగ్గర సెలవు తీసుకున్నారు.

అహమ్మద్‌కి నాలుగడుగులు వెనుకగా మెల్లగా నడుస్తోంది మెహర్. ఆమెకాళ్ళు ముందుకు నడుస్తున్నవన్న మాటేగాని ఆమె మనసు మాత్రం వెనక్కు లాగుతోంది.

డాక్టర్‌ని మరోసారి ఏకాంతంగా కలుసుకోవాలనీ, అతనితో ఏమేమో మాట్లాడాలనీ ఆమె ఉవ్విళ్ళూరింది. కాని ముందు అన్న. కారు రెడీగా ఉంది. డాక్టర్ రౌండ్సులో ఉన్నాడు. తను నిస్సహాయురాలు. మెహర్‌కి దుఃఖం పొర్లుకొచ్చింది. లిఫ్టుదగ్గర నిలబడి ఒక్కసారి వెనుదిరిగి చూసింది మెహర్.

ఆమె గుండె దడదడలాడింది. డాక్టర్ ఒక రోగి మంచం దగ్గర నిలబడి తదేకంగా తనవంకే చూస్తున్నాడు. ఎప్పటిలా అతని ముఖంలో చిరునవ్వు లేదు. ఏదో విలువైన వస్తువును పోగొట్టుకున్నవాడిలా దిగాలుపడి నిల్చున్నాడు. అలాటి భంగిమలో అతనిని చూడటం అదే మొదటి సారి.

ఆ క్షణంలో అతని ఆకృతి ఆమె

కెంతో ఆనందాన్నిచ్చింది. డాక్టర్ కూడా తన ఎడబాటుకు బాధపడుతున్నాడన్న భావం ఆమె కెంతో ధైర్యాన్నిచ్చింది. అతని చూపులతో తన చూపులు కలిపే శక్తి లేక చటుక్కున తలవంచుకుంది. ఆమె బుగ్గలు కలవరపాటుతో కంది పోయినయ్.

లిఫ్టులోకి వెళ్ళి నిల్చున్న తరువాత మరోసారి అటువైపుగా చూసింది మెహర్. డాక్టర్ అదే భంగిమలో నిలబడి అలాగే చూస్తున్నాడు.

రెండు జతల కళ్ళూ అరక్షణంపాటు ఎక్స్-రే కిరణాలవలె ఎదుటివారి గుండె నుండి దూసుకు పోయినయ్. రెప్ప పాటులో ఆమె క్రింది అంతస్తులోకి దిగి పోయింది. డాక్టర్ రూపం ఆమె కళ్ళ ముందు నుండి తొలగిపోయింది. కాని ఆరూపం ఆమె మనసులో మాత్రం నిండుగా వ్యాపించి పోయింది.

పది రోజులు ఒకదాని వెంట ఒకటి దొర్లిపోతున్నాయ్. మెహర్ మామూలు దినచర్య యధావిధిగా సాగిపోతోంది. రోజూ ఉదయం పదిగంటలకు కాలేజీకి వెళ్ళి పాఠాలు విని సాయంత్రం నాలుగు గంటలకు యిల్లు చేరుకునేది.

మొదటి రెండు మూడు రోజులూ కాలేజీలో ఉన్నా, యింట్లో ఉన్నా ఎక్కడున్నా ఆమెకు డాక్టర్ రవీంద్రే గుర్తుకు వచ్చేవాడు. ఆమెకు తిండి సయించలేదు. నిద్రసరిగ్గా పట్టేది కాదు.

కాని తరువాత క్రమంగా ఆమె మనసు కుదుట బడింది. దానికి ఒక కారణం యిల్లంతా బంధువులతో నిండి ఉండటం.

గఫర్ ఖాన్ కి జబ్బుచేసిందన్న వార్తను ఉత్తరాలద్వారా తెలుసుకుని దగ్గరి బంధువులంతా అతనిని పరామర్శించటానికి వచ్చేరు, చాలామంది "అసలే పెద్ద వాడయ్యేడు. దానికి తగ్గట్టు గుండెజబ్బు కూడానయ్యె. ఎన్నాళ్ళుంటాడో యేమో" నని పాకిస్తాన్ వంటి దూర ప్రదేశాల నుండి చూట్టానికి వచ్చేరు బంధువులు. వారిలో లక్నోనుండి వచ్చిన మెహర్ పినతల్లి ముఖ్యురాలు. ఆమెపేరు తస్నీమ్ బేగమ్. భర్తృహీనురాలైన తస్నీమ్ తన ఏకైక పుత్రుడు పాషాని వెంటపెట్టుకుని వచ్చింది.

పాషా కూడా మెహర్ యీడు వాడే. అతను పుట్టిన సంవత్సరం లోపునే తండ్రిపోయేడు, గొప్ప జమీందారుల వంశం వారిది. మొదట్లో గఫర్ ఖాన్ మధ్య తరగతి కుటుంబీకుడు. అందువల్ల పాషా తండ్రి వైపువారికి వాళ్ళ కుటుంబమంటే చిన్న చూపుగా వుండేది. కాని హైద్రాబాద్ వచ్చి గఫర్ ఖాన్ వ్యాపారంలో లక్షలార్జించేసరికి తస్నీమ్ అక్కగారింటికి రాకపోకలు సాగించింది. అంతేకాక మెహర్ అందచందాలు చూసి మురిసిపోయి, ఆమెను తన కోడలుగా చేసుకుందామని కూడా భావించింది గఫర్



యువ

ఖాన్ ఎంత లేదన్నా కూతురి పేరిట ఒక లక్షరూపాయలఆస్థినైనా వ్రాయడా అని ఆమె భావిస్తోంది ఈ సంబంధాన్ని కలుపు కోవటం గఫర్‌ఖాన్‌కి. అతని భార్యకు కూడా సమ్మతమే: ఒక్కగా నొక్క వంశోద్ధారకుడు, రెండు బట్టల మిల్లులకు అధికారి. అలాటి వాడిని పెళ్ళి చేసుకుని తన కూతురు రాణీలా వెలిగిపోతుందని ఆదంపతుల ఆశ.

ఐతే పాషాకి డబ్బువల్ల సంక్రమించే అవలక్షణాలన్నీ అబ్బినయ్. పట్టుమని ఇరవై యేళ్లు నిండకముందే మధువు, మదిరలలోగల మహదానందాన్ని అనుభ వించేడు. ప్రతియేడూ పరీక్షాధికారులకు లంచమిచ్చో, దానికి లొంగకపోతే గూండాలతో తన్నిస్తానని బెదిరించో మార్కులేయించుకొని యెలాగో కాలేజీ చదువులోకి వచ్చేడు. అంత కష్టపడి చదవటానికి ముఖ్యకారణం డిగ్రీమీద మోజుకన్న తన కాబోయే భార్యా మెహ రున్నీసాతో సమానంగాచదువుకోవాలన్న తహ తహ! ఈ సంవత్సరంతో మెహర్ బియస్సీ, తను బియ్యే పూర్తిచేస్తారు. పరీక్షలు వ్రాయటంతోనే యిద్దరూ చదు వుకు స్వస్తిచెప్పి దాంపత్య జీవితం ప్రారంభించవచ్చు.

పాషా మెహర్‌ని చూస్తూనే దిమ్మ తిరిగిపోయేడు. ఏమిటి? నాలుగేళ్ళ క్రితం తను చూసిన మెహరేనా యీమె, ఈమె మానవకాంతా, లేక దేవకన్యా? అను కున్నాడు. తనలోని తొలియౌవనపు పొంగును సంతృప్తిపరచిన స్త్రీలలో ఎందరో అందగత్తెలున్నారు. కాని మెహర్‌వంటి అతిలోక సుందరిని అతను ఎన్నడూ చూడలేదు.

మెహర్ చిన్నతనంలోకూడా చాలా అందంగా ఉండేది కాని యౌవనం ఆమె అందాన్ని మరింతగా ప్రజ్వరిల్ల జేస్తోంది. నూర్జహాన్, క్లియోపాట్రా, హెలెన్ ఆఫ్ ట్రోయ్ — వాళ్లెవ్వరూ మెహర్ కాలిగోటికికూడా సరిపోరు. అంతటి సౌందర్యవతియైన భార్యను వెంటపెట్టుకుని తను క్లబ్బులకు, పార్టీలకు పోతే తనకెంత గౌరవం లభిస్తుంది! తోటి స్నేహితులందరూ తన అదృష్టాన్ని చూసి అసూయతో ఉడికిపోరూ? ఇంతటి అపురూప సౌందర్యవతి భార్యగా లభించిన తరువాత తను చస్తే పరస్త్రీల జోలికి పోకూడదు అనుకున్నాడు పాషా.

అతని కెలాగైనా మెహర్‌తో మాట్లా డాలని, ఆమెతో కలిసి మెలిసి తిరగాలనీ ఉంది. దగ్గరిబంధువు లవటంవల్ల మెహర్ అతనిముందు 'ఘోషా' లో ఉండక పోయినా అతనికి దూరదూరంగానే ఉంటూవచ్చింది. అది మహమ్మదీయుల ఆచారం. ఎంతటి దగ్గరబంధువులైనా ఒక వయసులోఉన్న ఆడపిల్ల ఒక యువ కుడితో చనువుగా ఉండటం సభ్యతగల విషయం కాదు.

ఐనా పాషా ఎటు పడీ మెహర్‌కి

కాబోయే భర్త తనుక యిరువైపులవారికీ వాళ్లిద్దరూ చనువుగా మాట్లాడుకోవటానికి ఎలాటి అభ్యంతరమూ లేదు. కాని పాషాని యిబ్బందిలో పెట్టిందల్లా మెహర్ మౌనమే! తనని చూసినప్పుడల్లా ముఖం చాటు చేసుకుంటోంది. తనని తప్పుకు తిరుగుతోంది. కాబోయే భర్త అన్న సిగ్గు కాబోలు! నవ్వుకున్నాడు పాషా గర్వంగా, తృప్తిగా.

## 6

ఒకరోజు మెహర్ తనగదిలో కూర్చుని నోటపీ రికార్డులో బొమ్మలు గీస్తుండగా వచ్చేడు పాషా.

అతను వచ్చిన అలికిడి విని, ఓసారి తలెత్తి చూసి మళ్లీ తల దించుకుని రికార్డుపనిలో మునిగిపోయింది. పాషా రెండుకళ్ళు నిండుగా ఆమె వంకనే చూస్తూ నిలబడిపోయేడు. రికార్డులోకి తీక్షణంగా చూస్తున్న నల్లటి విశాల నయనాలు, కొద్దిగా ముడివడిన తీర్చిదిద్దిన కనుబొమలు. విశాలమైన ఫాలభాగం, దానిమీద అందంగా అమర్చబడిన రాగి రంగు జుట్టు, కొనదేలిన ముక్కు, దాని క్రింద సన్నగా, పల్చగావున్న పెదవులు, కోలగావున్న గడ్డం .... లోతుగా కత్తి రించిన మెడ గల మినీస్కర్టు, కొద్దిగా వంగుని ఉండటంవల్ల బయటకు తొంగి చూస్తూ కవ్విస్తున్న యౌవన సౌందర్యం, నగ్నంగావున్న మోకాళ్లూ, లేత తమల పాకుల్లా వున్న పాదాలు....అన్నీ వరుస వరుసగా చూసి ముగ్ధుడై పోయేడు.

అతను ఎంతసేపటికీ మాట్లాడక పోయేసరికి మెహర్ తలెత్తి మరోసారి అతనివంక చూసింది.

తనని తినేలా చూస్తున్న అతని కళ్ళ లోకి చూడలేక వెంటనే కళ్ళు దించేసు కుంది. ఆమె ముఖం కొద్దిగా ఎఱ్ఱబారింది. అతను తనవంక మోహదృష్టితో చూడ టం ఆనందం కలిగించినా, ఆ ఆనం దంలో 'యిష్టం' లేదు. అందువల్ల వెంటనే తనని తాను సంబాళించుకుంది మెహర్.

"రా! కూర్చో! అలాగే నిలబడి పోయేవే?" అన్నది.

ఆమె అలా ముందుగా పలకరిస్తుం దని ఆశించని పాషా ఆమె ఆహ్వానానికి తబ్బిబ్బయినాడు.

ఆమె ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చుని "ఎప్పుడూ చదువేనా? కాసే పైనా కులాసాగా కూర్చోకుండా?" అన్నాడు.

"నీకేం ఆర్ట్సు స్టూడెంటువి. ఎన్ని కబుర్లయినా చెప్తావు. మా సైన్సు స్టూడెంట్సుకి ఒక్క క్షణంకూడా తీరిక దొరకదు. కాలేజీలో ఉన్నంతసేపూ క్లాసులు, ప్రాక్టికల్సు. ఇంటికి వచ్చిన తరువాత రికార్డు వర్కూను" అంది, బొమ్మ వెయ్యటం ఆపి. కుర్చీకి చేరగిల బడి వీనస్ పెన్సిల్‌తో పెదవులమీద

చిన్నగా కొట్టుకుంటూ.

దగ్గరగా కూర్చున్న ఆమె శరీరం నుండి వస్తున్న వట్టివేళ్ళ సెంటువాసనల మత్తు అతణ్ణి పిచ్చివాణ్ణి చేస్తోంది. అమాంతం ఆమెను కౌగలించుకుని నగ్నంగావున్న ఆమె భుజాలను, ఆమె బుగ్గలను కొరికెయ్యాలన్న కోరికను బలవంతాన నిగ్రహించుకున్నాడు పాషా.

"ఏదీ? ఏం బొమ్మ గీస్తున్నావో చూడనీ!" అంటూ ఆమె ముందున్న రికార్డును తీసుకున్నాడు. రికార్డును తీసుకుంటున్నపుడు కావాలనే అమె చేతి వేళ్ళను తాకేడు.

"ఏమిటీ బొమ్మ?" అన్నాడు.

"చెప్పినా నీ కర్థం కాదులే!" మల్లెపూల జలజల రాలినట్లు నవ్వింది మెహర్.

"కాదూ! సైన్సు స్టూడెంటునని బోడి పోజులూ నువ్వూను. ఈ పోజులన్నీ మరో పదినెలలవరకే! ఆ తరువాత నా చెప్పుచేతల్లో వచ్చినట్టు పడుండాలి" అన్నాడు నవ్వుతూనే పాషా.

"అంటే యేమిటి నీ ఉద్దేశ్యం?" చటుక్కున ఆమె కళ్ళు కోపంతో ఎరుపెక్కేయి.

ఆమె ముఖంలో ఏ భావం చూపించినా పాషాకంటికి అద్భుతంగానే కనిపిస్తోంది. అందుకే ఆమె కోపాన్ని ఖాతర్ చెయ్యక "అంటే యేమిటో యింకా వివరంగా చెప్పాలా పిల్లా? వచ్చేయేడు యీపాటికి నువ్వు మిసెస్ పాషావి అయిపోతావ్. సరేనా?" అన్నాడు.

"అంతా నీ యిష్టమే నేమిటి? నా యిష్టంతో పనిలేదా?" అంది కోపంగానే మెహర్.

"ఎందుకు లేదు? ఉంది. ఏం, నేనంటే నీ కిష్టంలేదా?" ఆమె కళ్ళలోకి లోతుగా చూస్తూ అడిగేడు పాషా.

ఆ చూపులకు తట్టుకునే శక్తి సామాన్య స్త్రీలకు లేదు. మెహర్ అతి సామాన్యమైన స్త్రీ.

అందుకే వెంటనే కళ్ళు వాల్చేసుకుని "అది కాదు. నువ్వంటే యిష్టంలేదని కాదు నే ననేది. ఎందుకో నాకు పెళ్ళంటేనే యిష్టంగా లేదు" అంది.

పాషా నవ్వేడు. "ఈ వయసులో చదువుకుంటున్న ఆడపిల్లలందరూ అలాగే అంటారు. పెళ్ళయి ఆ జీవితంలోని రుచి మరిగేక అప్పుడను ఆమాట—చూద్దాం."

అతని మాటలు మోటుగావున్నా నవ్వు వచ్చింది మెహర్‌కి. "చూస్తుంటే నీకా రుచేదో యిప్పటికే తెలిసినట్లుందే!" అన్నది నిర్లజ్జగా అతని ముఖంలోకి చూస్తూ.

పాషా తత్తరపడ్డాడు. కొంపతీసి మెహర్‌కి తన వ్యవహారాలన్నీ తెలియవు కదా? తల్లికికూడా తెలియకుండా జాగ్రత్త పడుతూ వచ్చేడిన్నాళ్ళూ. ఇక మెహర్‌కి ఏం తెలుస్తుంది? ఎక్కడి కక్కో. ఎక్కడి

హైద్రాబాద్! అంతా తన భయం. మెహ రికే తనని వేళాకోళం చేస్తోంది అను కున్నాడు.

"మెహ త్తాడికి గడుసుదానివే! ఏమిటో అనుకున్నాను" అన్నాడు పళ్లు బయట పెట్టి నవ్వుతూ పాషా.

"ఏమిటనుకున్నావేమిటి?" అంది ఓరగా అతనివంక చూస్తూ.

"అబ్బ! అలా చూడకు. నా మతి పోతోంది."

"నీ మతి పోతోందా, పాపం! ఐతే పోయి పరిగెత్తుకుని పట్టుకు తే! నేను 'నాస్తా' చెయ్యాలి. వెళ్తాను" అంటూ చటుక్కున లేచి నిల్చుంది మెహర్. ఆమె వెళ్లాలంటే అతను కూర్చున్న కుర్చీ పక్కనుండే వెళ్లాలి. మరో మార్గం లేదు.

పాషామాత్రం కదలకుండా కుర్చీలోనే కూర్చున్నాడు. అందువల్ల అతనిని రాచు కుంటూ మానుకుని బయటకు వెళ్ళి పోయింది మెహర్.

ఆ స్పర్శవల్ల కలిగిన 'షాక్' నుండి తేరుకోవటానికి పాషా శరీరానికి అర గంట పైగా పట్టింది.

మరో రోజు మెహర్ గార్డెనులో పచ్చికమీద వెల్లికిలా పడుకున్నప్పుడు ఎక్కడనుంచి వచ్చాడో వచ్చి ఆమె ముందు ప్రత్యక్షమయ్యేడు పాషా.

సాయంకాలపు నీరెండలో బంగారు ప్రతిమలా మెరిసిపోతున్న మెహర్ సౌందర్యాన్ని కళ్ళతోనే త్రాగివేస్తూ నిల్చున్నాడు పాషా!

అతనివంక చూసి నవ్వింది మెహర్. "ఏమిటి నన్నిలా తరుముకుంటూ వస్తు న్నావు?" అంది అతనివంక చిలిపిగా చూస్తూ.

ఆ చూపులు ఆ నవ్వు తన పురుష త్వాన్నే ఛాలెంజి చేస్తున్నట్లుగా అనిపిం చింది పాషాకి.

ముందూ, వెనకా ఆలోచించకుండా ఆమెమీద వాలి అమె పెదవులమీద గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు పాషా.

హఠాత్తుగా జరిగిన ఆ చర్యకి అప్రతి భురాలయింది మెహర్. అతని పెదవుల స్పర్శ, తన శరీరాన్ని ఆవరించుకో బోతున్న అతని దృఢమైన శరీరం, ఆమె లోని స్త్రీత్వాన్ని ఉద్రేకపరచినయ్. కాని వెంటనే ఆమె మనసులో రవీంద్ర మెరి లేడు. రవీంద్ర రూపం ఆమె మనసులో మెదలగానే పాషా స్పర్శ జుగుప్సను కలి గించింది ఆమెకు. ఎడమచేత్తో వత్తుగా ఉన్న అతని జుట్టును పట్టుకుని, కుడిచేత్తో లాగి అతని చెంపమీద కొట్టింది.

ఆ దెబ్బకు కళ్ళు తిరిగినయ్ పాషాకి. సుకుమారంగా పెరిగిన ఆ శ్రీమంతుల బిడ్డడికి లావణ్యవతుల మృదువైన స్పర్శ మాత్రమే తెలుసు. వారిలోని కఠినమైన భాగాలను గురించి యేమాత్రం తెలియదు.

చిత్తరుపోయి, లేచి నిల్చున్నాడు పాషా. "మెహర్! ఏమిటి నువ్వు



యువ

చేసింది?'' అన్నాడు క్రోధావమానాలతో వణికిపోతూ.

మెహర్ కూడా లేచి నిల్చుంది. ''ఆ ప్రశ్నే నేనూ అడగాలనుకుంటున్నాను. నువ్వు చేసిన ఆ తప్పుడు పనేమిటి?'' అని.

''నువ్వు నా కాబోయే భార్యవి. నిన్ను ముద్దుపెట్టుకొనే అధికారం నాకుంది.''

''నేను 'కాబోయే' భార్యనే కాని, భార్యను కాను కదా! పెళ్ళి కానిదే నీకు నామీద ఎలాటి అధికారం ఉండటానికి వీల్లేదు. ఆ సంగతి గుర్తుంచుకో'' అన్నది మెహర్.

''తల్చుకుంటే నిన్ను యీ రాత్రికే పెళ్లిచేసుకుని లక్నో తీసుకుపోగలను. ఏమనుకున్నావో! పోనీలే. ఆడపిల్లవి. ముచ్చట పడుతున్నావని చదవనిస్తున్నాను.''

''నీ విశాల హృదయానికి థాంక్స్. మొన్ననే చెప్పేను. నాకు పెళ్ళంటే యిష్టం లేదని. నా కిష్టంలేని పనిని ఏదీ మా బాబా కాని, అమ్మగాని, అన్నయ్య గాని, యింట్లో ఎవ్వరూ చెయ్యరు. తెలిసిందా?'' అన్నది పెంకెగా.

''ఇంట్లో అందరూ అంత గారాబం చెయ్యబట్టే నువ్వింత మంకుగా తయారయ్యావు. నా దగ్గరనీ ఆటలేం సాగవు పెళ్లయిన తరువాత నేను చెప్పినట్టు విన్నావా, సరేసరి. లేదా కుక్కిన పేనులా నామాట వినేటట్టు నేనే తయారుచేస్తాను''

అని హుంకరిస్తూ వెళ్లిపోయేడు పాషా.

'పాషా! ఒక్కమాట!'' అన్నది మెహర్ అతనివైపుకు పరుగెత్తుతూ.

పాషా వెనుదిరిగి చూసేడు. ''ఈ సంగతి యింట్లో ఎవ్వరికీ చెప్పకు ప్లీజ్! నేనన్నవన్నీ మర్చిపో. బాబాకి అసలే ఆరోగ్యం బాగాలేదు. మనిద్దరం యిలా కీచులాడుకున్నామని తెలిస్తే చాలా బాధ పడిపోతాడు'' అంది తలవంచుకుని.

''నాకు తెలుసు. నువ్విలా క్షమాపణ వేడుకుంటావని. ఆడది ఎప్పుడూ అణగి ఉంటేనే అందం. తెలిసిందా?'' అని వెళ్ళిపోయేడు పాషా.

మెహర్ చాలా రాత్రి వరకు తోటలోనే వంటరిగా ఉంది.

సాయంత్రం జరిగిన సంఘటనకు ఆమె మనసు వికలమై పోయింది. పాషా ఒక పురుషుడిలా తనకి నచ్చేడు. కాని అతనెందుకో తన మనసు నాక్రమించుకో లేక పోతున్నాడు. పాషాని చూసినపుడల్లా డాక్టర్ రవీంద్రే గుర్తుకు వస్తున్నాడు తనకి. రవీంద్ర తనసమక్షంలో నిలబడితే చాలు తన మనశ్శరీరాలు రెండూ ఊగిపోయేవి. ఆ ఉత్తేజం, ఉన్మాదం పాషా తన శరీరాన్ని స్పృశించి తనని ముద్దుపెట్టుకున్నప్పుడు కూడా కలగలేదు. కారణం యేమిటి?

రవీంద్రను తను మనస్ఫూర్తిగా ప్రేమించింది. అతను అన్నివిధాల తనకి నచ్చేడు. పాషాకూడా అందగాడే! పైగా

# Kleertone

# క్లీర్‌టోన్- సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

క్లీర్‌టోన్' రకరకాల విద్యుత్ ఉపకరణాలకు పెట్టింది పేరు. నాణ్యమైన ఈ ఉపకరణాల వెనుక, ఏళ్ళ తరబడి సాధించిన తయారీ అనుభవం ఉన్నది. అందుకే దేశమంతటా వేల కొద్దీ గృహిణులు 'క్లీర్‌టోన్' ఉపకరణాలనే వాడుతున్నారు. మీ సొమ్ముకు తగ్గ విలువగల వస్తువులు కావాలంటే, 'క్లీర్‌టోన్' విద్యుత్ ఉపకరణాలే కొనండి. ఈ ఉపకరణాల సర్వీస్ కొరకు దేశమంతటా. 1,500 కు పైగా క్లీర్‌టోన్ డీలర్లు విస్తరించిఉన్నారు.

ఇస్త్రీ పెట్టె

హాట్ ప్లేటు

సుప్రీమ్ కెటిల్

బేకింగ్ ఓవెన్

ప్రెస్ లిఫ్ట్ టోస్టర్

కుకింగ్ రేంజ్

సాస్ పేన్ కెటిల్

వాటర్ హీటరు

వాటర్ బాయిలరు

హాట్ ఫుడ్ కేబినెట్

గోడ గడియారం

నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కంపెనీ. లిమిటెట్ (జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్.) బొంబాయి . ఢిల్లీ . కలకత్తా . మద్రాస్

తనకతను పెద్దలు నిర్ణయించిన భర్త. ఐనా అతనంటే తనకి ప్రేమ కలగటం లేదు. ఎందుచేతనో! రవీంద్రను చూసిన కళ్ళతో ఏపురుషుడిని చూసినా తనకి ఆనటం లేదు. రవీంద్రుని కనుక తను చూడక పోయినట్లయితే పాషాని భర్తగా మనస్ఫూర్తిగా కోరుకునేదేమో!

అలా పరిపరివిధాల ఆలోచించు కుంటూ కూర్చుండి పోయింది మెహర్.

చివరకు భోజనాల వేళకు యింట్లోకి వెళ్ళింది. ఎందుకైనా మంచిది. పాషాకి కోపం తెప్పించకుండా తన అసమ్మతిని మంచి మాటలతో చెప్పాలి అని నిశ్చ యించుకుంది మెహర్.

ఆ మర్నాడు ఆదివారం అవటంవల్ల కాలేజీకి సెలవు. ఉదయం "నాస్తా" అయిన తరువాత తనగదిలోకి వెళ్ళబోతూ గుమ్మానికి యివతలగా నిల్చుంది మెహర్.

పాషా, రజ్వీ యిద్దరూ డైనింగ్ హాలులోనుండి బయటకు వచ్చేరు. పాషా ప్రక్కన రజ్వీ ఉండటంవల్ల పాషాతో ఎలా మాట్లాడాలో సరిగ్గా తెలియలేదు. వెంటనే మెరుపులా ఒక ఆలోచన తట్టింది. "పాషా! నిన్న నువ్వడిగిన నావెల్ నా దగ్గర ఉంది. వచ్చి తీసుకుపో" అన్నది.

రజ్వీ సాధారణంగా మెహర్ గదిలోకి వెళ్ళడు. అందునా హాస్పిటల్లో ఆమెతో తగువు పెట్టుకున్న దగ్గరనుండి ఆమెతో ముభావంగా ఉండటం నేర్చుకున్నాడు. అదీకాక అతనికి యం. బీ బి యస్. లో సీటు వచ్చింది. అందువల్ల బి యస్సీ. వదిలిపెట్టి. అల్హాబాద్ వెళ్ళి మెడిసన్‌లో చేరే ప్రయత్నంలో ఉన్నాడతను.

పాషా ఎటుపడీ మెహర్‌కి కాబోయే భర్త కనుక. అతను ఆమె గదిలోకి వెళ్ళటం తప్పనిపించలేదు రజ్వీకి. "ఇంక నేను వెళ్తాను. ప్రయాణం మూడురోజులేగా ఉంది పుస్తకాలవీ చాలా సర్దుకోవాలి" అని రజ్వీ వెళ్ళిపోయేడు.

పాషాకి మెహర్ మాటలు ఆశ్చర్యాన్ని కలిగించినయ్. తనేమిటి. మెహర్‌ని నవలు అడగటమేమిటి? అనుకున్నాడు. కాని వెంటనే ఆమె ముఖం చూడగానే అత నికి విషయం కొంతవరకు అర్థమయింది. బహుశా రాజీకి వస్తోంది కాబోలు అను కున్నాడు. ఆ ఆలోచనతో అతని ముఖం వికసించింది.

ఆమెవెంట గదిలోకి నడిచేడు.

ఆమె "కూర్చో" అంటూ కుర్చీ చూపింది.

పాషా కుర్చీలో కూర్చున్నాడు.

తనుకూడా అతని కెదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

"కోపం వచ్చిందా నామీద?" అన్నది.

"వచ్చింది కాని. యిప్పుడు నీఅంతట నువ్వే పలకరించేసరికి ఆ వచ్చిన కోపం కాస్తా యెగిరిపోయింది" అన్నాడు నవ్వుతూ.

యువ.





స్పర్ ఇప్పుడు ఇంకా అందమైన
వన్నె చిన్నెలు

"నువ్వు చాలా మంచివాడివి."

"థాంక్స్! థాంక్యూ వెరీ మచ్ మేమ్ సాబ్!"

"అది సరేకాని, నిన్నొక ప్రశ్న అడుగుతాను. ఏమీ అనుకోవు కదా?"

"ఏమిటో అడుగు. ఈ దేవిగారి అనుగ్రహమే ఉండాలి కాని, ఏం చెయ్యమన్నా చేస్తాను. మూసీలో పడి చావమంటే చస్తాను. చార్మినార్ మీదనుండి క్రిందికి దూకమంటే దూకుతాను...."

"అంత పనేమీ చెయ్యవద్దు కాని; నా ప్రశ్నకు సమాధానం చెప్పు. చాలు. నేను నీకేమౌతాను?"

"నువ్వా? నాకా? అదేం ప్రశ్న? నువ్వు నా కోహినూర్‌వి. నా తాజ్‌మహల్‌వి, నూర్జహాను‌వి. నా హృదయ దేవతవి .చాలా?"

"ఊహుఁ. అవేవీ కాను. నేను నీ చెల్లెలిని?"

"వ్వాట్! నీకుగాని పిచ్చెక్కలేదు కదా?"

"ఊహుఁ. లేదు, నువ్వెంత తెలివిలో ఉన్నావో అంతకన్న ఎక్కువ తెలివిలోనే ఉన్నాను"

"ఐతే నువ్వు నా చెల్లెలి వెందు కవుతావు? నువ్వు నా భార్యవు."

"అదే తప్పుమాట అంటాను. హిందువులలో అక్కచెల్లెళ్ళ పిల్లలు సోదరీ సోదరులుగా ఉంటారు తెలుసా? మీ అమ్మ, మా అమ్మ ఏకోదరులు. వాళ్ళకి పుట్టిన మనంకూడా ఏకోదరులతో సమానమే! అలాటి మనం పెళ్లి చేసుకుంటే తప్పు కదూ?"

"హిందువులలో మేనరికం చేసుకుంటారు. అన్నాచెల్లెళ్ళ పిల్లలు భార్యాభర్తలవగా లేని తప్పు, అక్కచెల్లెళ్ళ పిల్లలు పెళ్లిచేసుకొంటే వచ్చిందా?"

"హిందువులలోని మేనరికం ఆచారాన్నికూడా నేను తప్పుగానే భావిస్తాను. కేవలం సెంటిమెంట్‌కోసమే కాదు, సైంటిఫిక్‌గాకూడా అది మంచి పద్ధతి కాదు"

"ఆహా! ఈనాటికి నువ్వొకదానివి బయల్దేరేవు సంప్రదాయాలను, ఆచారాలను మార్చేదానివి. దగ్గరి సంబంధాలు కలుపుకోవటంలోని అంతరార్థమేమిటో తెలుసా? ఒకరి వంశాన్నిగురించి ఒకరు తెలుసుకుని, వధూవరుల గుణగణాలను పూర్తిగా పరిశీలించుకున్న తరువాతనే పెళ్లిళ్లు చేసుకోవాలి. అది బంధువులలోని వాళ్ళకే సాధ్యమవుతుంది. ఎక్కడో ముక్కూ మొహం తెలియనివాళ్ళను చేసుకున్నట్లయితే వారి అలవాట్లు, పద్ధతులూ అన్నీ కొత్తగా ఉంటయ్. ఒకరికొకరు అడ్జస్ట్ అవటానికి ఎంతో శ్రమ పడవలసి ఉంటుంది. ఇంతదూరం ఆలోచించే మనవాళ్ళీ ఆచారాలన్నీ పెట్టేరు తెలుసా?"

"చాల్లే. వధూవరులు ఒకరినొకరు అర్థం చేసుకోవాలంటే రక్తసంబంధమే

ఉండ నవసరంలేదు. నీలాటి మూర్ఖులింకా యీనాటికీ ఉండటంవల్లనే భారతదేశపు పురోగతి యింత అధ్వాన్నంగా ఉంది. ఈ మేనరికం అన్నది హిందువులలో అందరిలోనూ లేదు. ఈ ఆచారం దక్షిణ భారతంలోని కొన్ని ప్రాంతాలవారిలో మాత్రమే ఉంది. ఉత్తర భారతదేశంలోని ప్రజలు మేనరికాలు చేసుకునే మనుషులను ఆటవికులుగా భావిస్తారు తెలుసా?'' అన్నది మెహర్.

''అందరూ నీ లాగానే ఆలోచిస్తే యిక యీ బంధుత్వాలు అవీ మట్టిలో కలిసిపోవలసిందే.''

బంధుత్వాలు మట్టిలో కలసిపోతాయని అన్నాచెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చేసి పాపం చుట్టుకోమంటావా? దగ్గరి బంధువులకు పెళ్ళిళ్ల చేస్తే వాళ్ళకు పుట్టే పిల్లలు బలహీనంగా, బుద్ధిహీనులుగా ఉంటారని శాస్త్రజ్ఞులు చెప్తారు. ఇంకా కొన్ని తరాలపాటు యిలాగే ఏకోదరుల పిల్లలకు పెళ్లిళ్ల చేసేరంటే ఏ జాతిఅయినా సరే నిర్వీర్యమై పోతుంది.''

''సైంటిఫిక్‌గా తప్పని చెప్పేవు, బాగానే ఉంది. ముఖ్యంగా మన మహమ్మదీయులలో యీ ఆచారం ఎందుకు వచ్చిందో తెలుసా? ఇలా ఇతరదేశాల్లో అల్పసంఖ్యాకులుగా ఉన్న మనకు దూరపు చుట్టాలతో పెళ్లిసంబంధాలు కుదరాలంటే చాలా కష్టం. అంతేకాక బంధుత్వాలు దూరమైనకొలది 'జాతి సంకీర్ణత' పెరిగే అవకాశం ఉంది. మనవాళ్ళకది యిష్టం లేదు. పవిత్రమైన మహమ్మదీయ రక్తం ప్రతి మహమ్మదీయునిలోనూ ఉండా లంటే మహమ్మదీయులంతా వీలైనంత వరకు ఒకరితో ఒకరు దగ్గర సంబంధాలు ఏర్పరచుకోవాలి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, సోదరీసోదరులు అంతా తమతమ పిల్లలను ఒకరికొకరు యిచ్చి వివాహం చేసినట్లయితే మహమ్మదీయ జాతి స్వచ్ఛంగా ఉండగలదు అని మనవారి అభిప్రాయం.''

''ఆ అభిప్రాయాలు, ఆనవాయితీలు రాజకీయ కారణాలవల్ల ఏర్పడినవి.''

''కాదు. మత సంబధమైనవి.''

''అబద్ధం. ఏ మతమూ అలాటి అర్థహీనమైన సంప్రదాయాలను బోధించదు. ఖురాన్‌లో ఎక్కడా ''ఏకోదరుల పిల్లలకు పెళ్లిళ్ల చెయ్యండి'' అని వ్రాసి లేదు. ఇలాటి పిచ్చిపిచ్చి ఊహలన్నీ మనం కల్పించుకున్నవే! రాజకీయంగా మన జాతిని వృద్ధిపరచుకునే ఉద్దేశ్యంతో అవసరమైతే ఎలాటివారితోనైనా పెళ్ళి సంబంధాలు కలిపించుకోవచ్చునని తీర్మానించేరు. ఎంతసేపూ మహమ్మదీయులు తమ రక్తంయొక్క 'స్వచ్ఛత'కి ప్రాధాన్యత నిస్తున్నారే తప్ప దానివల్ల కలిగే దారుణ ఫలితాలను గుర్తించటంలేదు. మహమ్మదీయుల దేశమైన పాకిస్థాన్‌లో ఏటేటా దాదాపు లక్షమంది మానసిక వ్యాధులు గల పిల్లలు పుడుతున్నారట. దీనికి

# అద్భుతమైన రుచి
## ఒక లక్షణమైతే



## బలవర్ధకమైన పోషకత్వం మరొక శ్రేష్టమైన లక్షణం

ఆహా! కరకరలాడిస్తూ తినటం పోషణ పొందటం ఎంత బాగుంటుంది! పార్లే గ్లూకో బిస్కట్లలో పాలు, గోధుమ పంచదారలోని సారం, అత్యధికంగా ప్రోటీన్లు, విటమిన్లూ కూడా ఉన్నాయి.




**పార్లే గ్లూకో బిస్కట్లు**

**ప్రత్యేకించి పిల్లలకు ఎంతో మంచివి**

భారతదేశంలో అత్యధికమైన అమ్మకం కలిగిన బిస్కట్లు

everest/4f-r/PP Tel

ఒక ముఖ్యకారణం, వారు సజాతీయులతో వివాహాలు చేసుకోవటమేనని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. ఇలా వర్ణసంకీర్ణతకు భయపడి మహమ్మదీయులు మూర్ఖంగా ప్రవర్తించేరంటే ఎప్పుడో ఒకప్పుడు యీ జాతి నశించిపోగలదు'' అన్నది మెహర్.

ఇక పాషాకి వినే సహనం లేకపోయింది. ''ఇంతకూ నువ్వు నన్ను నవలవంక పెట్టుకుని పిల్చింది యీ ఉపన్యాసం దంచటానికేనా?'' అన్నాడు.

''లేకపోతే నీ మెడలో పూలహారం వెయ్యటాని కనుకున్నావా?'' అనబోయి నిగ్రహించుకుంది మెహర్. పాషాని రెచ్చగొట్టటంకన్న మంచిగా అతనికి నచ్చచెప్పటమే మంచిదని తోచింది.

పైకి చిరునవ్వు నవ్వింది.

పాషా లేచి నిల్చున్నాడు 'నువ్వు ఎలాగైతే బోడి బీ.యస్సీ. చదువుతున్నావులే! నీలాటి బీ యస్సీలూ, ఎమ్మెస్సీలు లోకంలో కొల్లలుగా ఉన్నారు. వాళ్ళందరికీ లేని మేధస్సు యేదో నీకే ఉందని విర్రవీగకు. వాళ్ళందరూ శాస్త్రజ్ఞానం లేని మూర్ఖులూ, నువ్వొక్కతివే తెలివిగలదానివీ అని ఎప్పుడూ అనుకోకు. ఒకరికి—అందునా ఆడదానికి అంత అహంభావం తగదు. ఆ అహంభావమే ఎప్పుడో ఒకప్పుడు నీ జీవితాన్ని నాశనం చేస్తుంది. జాగ్రత్త! తీరికగా ఆలోచించుకో. కావాలని వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకోకు. ఆపైన ఎంత విచారించినా లాభంలేదు'' అని బయటకు వెళ్ళిపోయేడు.

అతను వెళ్ళినవైపుకే చూస్తూ పళ్ళు నూరుకుంటూ కసిగా అనుకుంది మెహర్ ''వట్టి బ్రూట్! అడవిగొడ్డు'' అని.

## 7

ఆరోజు సాయంత్రం అలా బయటకు వెళ్దామని స్వయంగా కారు డ్రైవు చేసుకుంటూ బయల్దేరింది మెహర్. పాషాతో మాట్లాడినప్పటినుండీ ఆమెకేదో కసిగా ఉంది. ఎవరిమీదనో తెలియని ద్వేషం, అసహనం ఆమె నావరించినయ్. ఆ కసిని, ద్వేషాన్ని చూపటానికి మనుషులెవరూ దొరకనందున గదిలో ఒంటరిగా కూర్చుని తనివితీరా ఏడ్చింది. తరువాత డ్రెస్ చేసుకుని బయటకు వచ్చింది.

రవీంద్రను చూసినప్పటినుండీ తన మనస్తత్వంలోనే ఎంతో తేడా వచ్చినట్లు గమనించింది మెహర్. తనలో ఎన్నడూ లేని మొండితనం, కసి, నిర్లక్ష్యం తలెత్తసాగినయ్. ఈ ప్రపంచంలో యే మనిషిని చూసినా వారు రవీంద్రకంటె తనకి శత్రువులు కారనిపించింది మెహర్ కి. అందుకే ఆమెకీ సమయంలో స్నేహితురాళ్ళ దగ్గరికికూడా వెళ్లాలనిపించలేదు.

కారును సరాసరి 'క్వాలిటీ' వైపుకు నడిపించింది. మెల్లగా ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ ఆమె హోటలు లోపలికి వెళ్తుంటే రోడ్డుమీద జనమంతా ఆమె వంకనే కళ్ళప్పగించి చూడసాగేరు.

ఇప్పుడు క్రొత్త
ఇళ్లకు రంగువేయుటకు
**డెకోప్లాస్ట్**
మాత్రమే ఎందుకు
వాడుతున్నారు?

**DECOPLAST**
Water thinnable exterior wall paint

ఎందువల్లనంటే:
ప్రైమరుతో
పని లేకుండానే,
క్రొత్త ప్లాస్టరు మీద కూడా
వెయ్యవచ్చును.
సిమెంటు రంగుల కన్న
5 రెట్లు ఎక్కువ జాగాపై
రంగు వెయ్యవచ్చును.
రంగు ఏళ్ల తరబడి ఉంటుంది.
కూలి ఖర్చు 40% తక్కువ.

రంగులు విరిసిన
రంగారు జీవితానికి
**ఏషియన్ పెయింట్స్**



ఎందుకో విరాశగా అనిపించింది మెహర్‌కి. ఎలాటి మనిషినైనా యిట్టే వలిపివేయగల శక్తి తన అందానికి ఉంది. కాని యేం లాభం? ఈ అందమంతా ఎవరికోసం? తన అందానికి మరింత వన్నెతెచ్చే యీ మేకప్, యీ ఖరీదైన దుస్తులు ...యివన్నీ ఎవరిని సంతృప్తి వరచటానికి? తను కోరుకున్న పురుషుడు, తనని కావాలనుకున్న పురుషుడు తన ప్రాణేశ్వరుడైతే తప్ప తన సౌందర్యానికి సార్థకతలేదు.

ఆమె లోపలికి ప్రవేశించగానే తలుపు దగ్గర ఉన్న నౌకరు ఆమెను గుర్తించి వంగివంగి 'సలాం' చేసేడు. ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ ఠీవిగా, వయ్యారంగా నడచి ఒకమూల ఎవ్వరూ లేని బల్లదగ్గర కూర్చుంది. సర్వర్ వచ్చి నిలబడగానే ఐస్‌క్రీమ్‌కి ఆర్డరిచ్చింది. మెహర్ చుట్టూ ఓసారి కలియజూసింది. ఎక్కడ చూసినా యువతీయువకులు రంగురంగుల దుస్తులు ధరించి, మనసులోని ఆనందమంతా ముఖాల్లో స్పష్టంగా చూపిస్తూ జంటలుగా కూర్చుని తింటున్నారు. ఆ జంటలను చూడగానే ఆమె మనసులోని విచారం మరింత యెక్కువయింది.

యౌవనోత్సాహంతో మిడిసి పడుతున్న ఆ జంటలు తన జీవితంలోని వెలితిని ఎత్తి చూపిస్తున్నట్లుగా తోచింది మెహర్‌కి.

సర్వర్ ఐస్‌క్రీమ్ తెచ్చాడు.

రెండు చెమ్చాలు తిన్నదో లేదో ఇంతలో కిల కిల మంటూ అరడజను మంది ఆడవాళ్లు వచ్చేరు. వాళ్ళ వెనుకనే డాక్టర్ రవీంద్ర!

తన కళ్ళను తానే నమ్మలేక పోయింది మెహర్.

ఆ ఆడవాళ్లంతా కిలకిల నవ్వుతూ, జారిపోతున్న పమిటలను కూడా లెక్కచేయకుండా చంగు చంగున గంతులు వేస్తున్నట్లుగా నడుస్తూ వచ్చేరు.

రవీంద్ర మెహర్‌ని చూస్తూనే "హల్లో!" అన్నాడు అదే చిరునవ్వుతో. ఆమె గుండె ఝల్లుమంది.

'ఔను! రవీంద్రే! సందేహం లేదు" అనుకుంది.

"మెహర్! నువ్వొక్కతివే వచ్చేవా? వెంట యెవరూ రాలేదా?" అన్నాడు ఆమె దగ్గరగా నిలబడి, టేబులుమీద చేతులు పెట్టి, ఆమె ముఖం మీదకు వంగుతూ. తాను ఏ వ్యక్తికోసం రాత్రింబవళ్లు కలవరిస్తోందో ఆవ్యక్తిని హఠాత్తుగా చూసేసరికి ఆమె ఉక్కిరి బిక్కిరయిపోయింది. దానికి తగ్గట్టు అతను తనతో అంత చనువుగా మాట్లాడేసరికి ఆమెకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

"ఓ డాక్టర్ సాబ్!"

"వేరార్ యూ!"

"వాట్ ది హెల్ యు ఆర్ డూయింగ్ దేర్?"

# మీ సేవాభిలాషి

# స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌తో మీరు వ్యవహరించేటప్పుడు, మీరు సామాన్యమైన బ్యాంకింగ్ సౌకర్యాలన్నీ పొందుతారు. అంతేకాదు, మరో ప్రత్యేకత కూడా!

మీ గురించీ, మీ ఆర్థికవిషయాల గురించీ వ్యక్తిగతంగా మేము తీసుకునే శ్రద్ధే ఈ ప్రత్యేకత. మేము చూపే శ్రద్ధ విషయంలో, మాకు ఏ ఒక్కరూ తక్కువ వారనిపించరు. సేవచేయటమే మా లక్ష్యం. ఆ సేవనే సకాలానికి, సామర్థ్యంతో, సగౌరవ ప్రదంగా అందజేస్తాము

ప్రధాన కార్యాలయ భవనం
హైదరాబాద్.




## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

అంటూ ఆ ఆడవాళ్ళ గుంపులోనుండి వచ్చిన కేకలకు రవీంద్ర తేరుకుని "మెహర్! ప్లీజ్ వన్ మినిట్!" అంటూ ఆమెను వాళ్ల దగ్గరకు తీసుకు వెళ్ళేడు

"షి యీజ్ మిస్ మెహరున్నిసా! వన్స్ షి వజ్ మై 'మోడల్'" అంటూ ఆమెను వాళ్లకు పరిచయం చేసేడు

"షి యీజ్ మిస్ మాలా షి యీజ్ డాక్టర్ చంచల. షి యీజ్ మిసెస్ కుల్‌కర్ణి. షియీజ్ మిసెస్ రెడ్డీ" అంటూ అందరినీ పరిచయం చేస్తుంటే మెహర్ బిడియంగా నమస్కరించింది

వాళ్ళందరి ముందూ మెహర్ వయసులో చాలా చిన్నది తెల్లగా, నాజూగ్గా మల్లె మొగ్గలా వున్న మెహర్‌ని చూస్తూనే వాళ్లందరి మొహాలూ అదోరకంగా మారిపోయినయ్ దానిని మెహర్ గుర్తించక పోయినా, డాక్టర్ రవీంద్ర యిట్టే గ్రహించి నవ్వుకున్నాడు

"యూ హేవ్‌టు ఎక్స్యూజ్‌మీ" అని వాళ్ళతో చెప్పి మెహర్ చెయ్యి పట్టుకుని దూరంగా లాక్కుపోయేడు రవీంద్ర

అతని ప్రవర్తనకు సిగ్గుతో కుంచించుకు పోయింది మెహర్

'ఏమిటా చొరవ?' అని అతనిని కోప్పడాలనుకుంది కాని ఆమెకు ఉద్రేకంతో కంఠం పెగలి రాలేదు

ఆమెను అందరికీ దూరంగా ఉన్న చిన్న టేబులు ముందుకు తీసుకు వెళ్లి కూర్చోపెట్టేడు ఆ బల్లదగ్గర రెండే రెండు కుర్చీలున్నయ్

కుర్చీలో ముడుచుకుని కూర్చున్న మెహర్‌కి స్వప్నంలో వున్నట్లు అనుభూతి



నవంబరు నెల

# భావపరిచయ పోటీ

## జెయిల్



బహుమతి పొందిన వ్యాఖ్య

జైలు, నరకంబు, వాటిలో మేలు కనగ
హాజరయినాడు యమధర్మరాజు నేడు
అచటి అధికారి అపరాధియయ్యె నిచట
ఎనుమునను మతి లేకనే ఎక్కె గాన

ఎ వి అర్ ప్రసాద్, అనంతపురం

మరణ శిక్ష పడిన ముద్దాయి అసువులు
కోరివచ్చియున్న కాలయముడు
ప్రాణభిక్ష నిడుచు ప్రెసిడెండు ఉత్తర్వు
వచ్చియుండెననగ విస్తుపోయె.

కొమ్మూరి నారాయణరావు, చింతపర్రు

జరుగుతోంది. దీమ్‌గా వెలుగుతున్న దీపాలు. మెల్లగా వినవస్తున్న పాశ్చాత్య సంగీతం. ఎదురుగా తాను వీక్షిస్తున్న రవీంద్ర ఐస్ క్రీమ్ రుచే తెలియ లేదు మెహర్‌కి.

"మెహర్! నా మెహర్! నువ్వెంత మంచి దానివి మెహర్! మళ్లీ నిన్ను చూస్తానని నే ననుకోలేదు. ఈ యిరవై రోజులుగా నే నెంతగా నీకోసం పరితపించేనో తెలుసా? ఇక నిన్ను వదలను" అంటూ గట్టిగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని నొక్కేడు రవీంద్ర. మల్లె చెండులా ఆమె చెయ్యి అతని ధృఢమైన వేళ్ల మధ్య నలిగిపోయింది

అస్పర్శ. ఆ వాతావరణం. ఆమె మన స్థితి.... అన్నీ ఆమె వరాలను కుల్లిమనేట్లు చేసినయ్. రవీంద్ర! రవీంద్ర! అతనిలా మాట్లాడు తాడని, అంత త్వరగా తను అతని మనసుని చదవగలనని మెహర్ అనుకోలేదు. తాను రవీంద్రను యెంతగా ప్రేమించినప్పటికీ ఆమెకు రవీంద్ర తనని ప్రేమిస్తున్నాడా లేదా అన్న విషయం సందేహాస్పదంగానే వుంది. కాని ఇప్పుడతను ఏమాత్రం సంకోచంగాని, బిడియంగాని లేకుండా తన మనసుని వెల్లడించే సరికి ఆమె కానందమయింది.

"ఏమిటలా మౌనంగా ఉన్నావు?

నువ్వు మాట్లాడకుండా కూర్చుంటే మరింత అందంగా ఉన్నావు. ఈ పల్చని కాంతిలో, రాగిరంగు జుట్టులో, తెల్లని దుస్తులలో ఉన్న నీ ఆకృతి చూస్తుంటే యిప్పటికిప్పుడే ఒక బొమ్మ గీయాలనిపిస్తోంది నాకు'' అన్నాడు రవీంద్ర ఆమె గడ్డం పట్టుకుని ఆమె కళ్ళలోకి చూస్తూ.

మెహర్ ఎవరైనా చూస్తారేమోనని భయపడింది కాని: ఇలాటి చర్యలు ఎవరూ యిక్కడ పట్టించుకోరు. చూసీ చూడనట్లు పోతారు అనుకుని మనసు కుదుటపరచుకుంది.

తన గడ్డాన్ని స్పృశిస్తున్న అతని వేళ్ళను తన చేత్తో పట్టుకుని నొక్కుతూ ''అన్నీ కబుర్లే మీవి. నాకోసం అంతగా చూస్తున్నవారు నన్ను చూట్టానికి ఎందుకు రాలేదు? అంతా అబద్ధం. మీరు నన్ను మర్చిపోయేరు. నేను మీ దృష్టిలో కేవలం మీ పేషెంటు కూతుర్ని. ఒక 'మోడల్'ని అంతే! కాని మీరు నాకేమౌతారో తెలిస్తే మీరు నన్నింతగా బాధపెట్టి ఉండేవారు కాదు '' అంటూ జలజల కన్నీళ్ళు కార్చింది.

రవీంద్ర తన చేతిరుమాలుతో ఆమె కళ్ళనీళ్ళు తుడిచేడు. ''పిచ్చి మెహర్! ఏడవకు. ఇంక నిన్నెప్పుడూ యిలా బాధపెట్టను. నీ మనసు పూర్తిగా అర్థం చేసుకోనిదే నేనుమాత్రం ఎలా చనువు తీసుకోను? ఇప్పుడు నువ్వు నాకు పూర్తిగా అర్థమయ్యేవు మెహర్! ఇంక నిన్నెప్పటికీ

పెడిచిపెట్టను'' అంటూ ఆమె కుడిచేతిని ముద్దుపెట్టుకున్నాడు.

మెహర్ చటుక్కున తన చేతిని లాక్కుంది.

రవీంద్రతో కలసివచ్చిన ఆడవాళ్ళందరూ వీరివైపే చూస్తూ ఏవో గుసగుసలు చెప్పుకుంటున్నారు.

''వాళ్ళందరూ ఎవరూ?'' అనడిగింది మెహర్.

''వాళ్ళా! అందులో కొందరు నా స్నేహితుల భార్యలు, చెల్లెళ్లు, కొందరు నాతో కలసి పనిచేసేవాళ్లూ. అలా సర్దాగా బయటకి వెళ్ళొద్దాం రమ్మంటే వచ్చేను. నిన్ను చూసేక యింక వాళ్ళ కంపెనీని భరించలే ననిపించింది. అందుకే నీ దగ్గరకు వచ్చేసేను. గ్రీకు సుందరివంటి నీ సౌందర్యాన్ని కళ్లారా జూసిన తరువాత మరే స్త్రీని చూసినా నాకు వెగటు పుడుతోంది'' అన్నాడు రవీంద్ర.

''వాళ్లతో అంత చనువుగా ఉంటున్నారు .అంటే వాళ్ళ తాలూకు మగవాళ్ళు మీకు చాలా దగ్గరి స్నేహితులన్న మాట! ...'' అంది. ఎందుకో రవీంద్ర అంతమంది ఆడవాళ్లతో స్నేహం చేస్తున్నాడనుకునేసరికి మెహర్‌కి అసూయగా ఉంది. ఎంత ప్రయత్నించినా ఆ అసూయను తన ముఖంలో కనపడకుండా చెయ్యలేకపోయింది మెహర్.

''వాళ్ళతో అంత చనువుగా ఉండటానికి కారణం వాళ్ళు నా స్నేహితుల తాలూకు వాళ్లవటమే కాదు నేనున్న ప్రొఫెషన్‌కి—మంచి పాప్యులారిటీ రావాలంటే సొసైటీలో కలసిమెలసి తిరిగే మనస్తత్వం ఉండాలి. అందంగా, దర్జాగా ఉన్న ఒక కుర్రడాక్టరు కనపడితే ఏ ఆడవాళ్ళు మాత్రం వెంటపడరు? నేనుకూడా సర్దాకోసం వాళ్లతో కలసి తిరుగుతుంటాను'' అన్నాడు రవీంద్ర నవ్వుతూ.

మెహర్‌కి అతను చెప్పినది నిజమే ననిపించింది. అంతమంది ఆడవాళ్ళతో తిరుగుతూకూడా వాళ్లని వదిలి, అతను తనదగ్గరకి వచ్చేడంటే అతనికి తనమీద ఎంత గాఢానురాగమో తెలుస్తోంది అనుకుంది మెహర్.

''వాళ్లల్లో కొందరు నేను గీసే చిత్రాలకు మోడల్‌గాకూడా ఉండేవాళ్లు. అఫ్ కోర్స్. ఏ మోడలైనా—నీ తరువాతనే ననుకో!'' అన్నాడు అతను రెండు కళ్ళల్లోనూ శృంగారం ఒలికిస్తూ.

అతని కళ్లలోకి చూస్తూ ''ఔను. ఏ ఆడదిమాత్రం యితనివెంట పడకుండా నిగ్రహించుకోగలదు?'' అనుకుంది మెహర్. (ఇంకా వుంది)

ఈ నవలలోని సన్నివేశాలూ, పాత్రలూ కేవలం కల్పితం. జీవించివున్న వారికిగాని, మరణించిన వారికి గాని ఏ సంబంధమూ లేదు.

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26 and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam, 146, T. H. Road, Madras-21.
Controlling Editor : "CHAKRAPANI"